# శ్రీ వివేక చూడామణి



మూలము:
శంకర భగవత్పాదులు



అనువాదము
డా॥ Y కమలాకరసాయి

# శ్రీ వివేక చూడామణి

మూలము :

శ్రీ శంకర భగవత్పాదులు

అనువాదము :

వై. కమలాకరసాయి.

* శ్రీ వివేక చూడామణి

అనువాదము :-

వై. కమలాకరసాయి

మొదటి ముద్రణ : 1992



ప్రతులు :- 1000

వెల : రూ. 40/-

This Book is
Published with the Financial Assistance of
TIRUMALA TIRUPATI DEVASTHANAMS
Under
"AID TO PUBLISH RELIGIOUS BOOKS"

ప్రతులకు :

డా॥ వై. కమలాకరసాయి, M. B. B. S.
వెంకటగిరి - 524 132

ముఖచిత్రము :

శ్రీ ఆర్. బి. బాబునాథ్

ముద్రణ :

R. K. ప్రింటర్స్
బాపట్ల.

శ్రీ మదఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుండును,
సప్తగిరీశుండునగు
శ్రీ వేంకటేశ్వరస్వామికి
సహాయార్థము విజ్ఞాపనము

కం॥ శ్రీ వేంకటేశ ! శుభకర !
భూవర ! కృపతోడ మమ్ము। బ్రోవగ రమ్మా।
శ్రీవత్స ! జగద్రక్షక !
భావాతీతా ! నమామి। పావనపురుషా॥ ౧

సీ॥ నిరతయోగ ధ్యాన। నిష్ఠానిమగ్నుండౌ
కైలాసవిభుండు, ముక్కంటికైన,
నాలుగువేదాల। నయముగ వల్లించు
చతురాననుండు, వాక్పతికినైన।
వేనోళ్ళ నొకవడి। వినుతించగాం జాలు
వేయితలల సర్ప। విభునికైన,
సతతమ్ము నీ నామ। సంస్కరణముతోడ
ముజ్జగాలందిరుంగు। మునికినైనం॥

గీ॥ గాదు వర్ణింప నీ రూపు। గమలనయన !
సచ్చిదానందరూప ! ప్రశాంతనిలయ !।
ఆది మధ్యాంత రహిత యనంతమూర్తి !
ఇంక నే నెంతవాండ నుతించ నిన్ను॥ ౨

ఆ.వె॥ పొగడువారి నీవు। పోషింతు వనుకొనం
దిట్టువారిం జేరం। దీయలేదె।
పట్టువిడని భక్తి। ప్రాముఖ్య మగుంగాని
పొగడినంతం బొంగి। పోదువేమి॥ ౩

కం॥ ముద్రణకై నీ సాయము
భద్రం బని పల్క బుధులు। పరమాసక్తిన్।
కద్రువ సుతరిపు వాహన!
చిద్రూపా చాచినాడఁ। జేతులు భక్తిన్॥ 4

కం॥ అప్పుగొని నిన్నదెవ్వరొ,
త్రిప్పలు వేవేలుపెట్టి। దిద్దిరి నామం।
బప్పా! యప్పడుగ నయా,
త్రిప్పుకొనక తోచినంత। దెప్పక యీవే॥ 5

కం॥ వడ్డికిఁ గాసుల రాశుల
దొడ్డతనమ్మున గొలిచెడి। దొర వీవు గదా।
బిడ్డనుగా నా కియ్యగ
నడ్డేమిటి సంశయించ। కంబుజనాభా॥ 6

సీ॥ నిత్యము క్షీరాబ్ధి। నిద్రించెడి స్వామి!,
నిలువజీతానికి। నిల్చినావు।
శ్రీసతి సేవించ। సిరులఁ దూగెడివాడ!
అలకాపతికిఁ బెండ్లి।నప్పు వడితి।
ఇరువురు సతులకు। హితవుఁ జెప్పగ లేక
ఎక్కి కొండలనుంటి। వేకతమున।
వచ్చి పోయెడి భక్తు। లిచ్చెడి కాసుల
వడ్డికి జమకట్టు। వాడవైతి

గీ॥ వెపుడు తీరెడు నీ యప్పుఁ। కెపుడు నీవు
కంటి నిండుగ నిద్రించఁ। గలవు తండ్రి!
శ్రీరమణి నింకనైనను। జేరదీసి
చెల్లువేయగరాదొకో। చేసినప్పు। 7

గీ॥ తెరపిలేనట్టి సేవల। దినదినమ్ము
చేవిఁగనఁ గొండ దిగపైనఁ। దిరదాము।
నీదు రాకకుఁ జూచుచు। నిదుర కాచి,
దిగువ మంగమ్మ యున్నది। దిగులుచెంది॥ 8

కాంతకంటెను మక్కువ। కానుపైన
మిక్కుటం బను లోకోక్తి॥ నిక్కమంటె ?
దేవ ! రారమ్ము కొండల। దిగుము, తల్లి
నూరడించుము ప్రేమతో। నురముఁ జేర్చి॥ 9

కలిని మితిలేని పాపంబుఁ।గాంచలేక
మూసుకొంటివి కన్నులు। రోసి జగము।
చలువకనియో మరేదేని।సాకొ కనులు
తెరువకుండగ నామాలు। దిద్దిరయ్య॥ 10

కాంచు మొకపరి జగమును। గనులు విచ్చి,
పాపమంతయుఁ జిటికెలో। భస్మ మగును।
భక్తవత్సల ! లోకేశ ! పరమ పురుష !
దీన జనపోష ! పాహి మాం। తిరుమలేశ !॥ 11

భక్తజన పారిజాతమా !! పద్మనాభ!
దివ్యమంగళ విగ్రహా।। దేవ దేవ।
శేషశైల శిఖరవాస !। చిద్విలాస !
కవికరించుము నన్ను వేం।కట గిరీశ॥ 12

గీ॥ సచ్చిదానందరూపుఁడు। శంకరుండు,
సాధుజనవత్సలుండు, ప్ర।శాంతమూర్తి।
భక్తపరిపాలనార్థము। ముక్తి మార్గ
దర్శకుం డయి ధర నవ।తార మెత్తె॥ 1

గీ॥ సత్యమార్గ ప్రబోధాన। శంకరుండు
పల్కె నద్వైత మార్గము। భవహరముగ।
బ్రహ్మ సత్యంబు మిథ్య ప్ర।పంచ మనుచు
అన్యవాదములను దా ని।రాకరించి॥ 2

గీ॥ మోక్ష బిలమార్గమందు ము।ముక్షువులకు
తలను మణిదీపమై నిల్చి। దారిఁ జూప।
శ్రీ వివేక చూడామణిఁ। జిత్త మలర,
శంకరుండు రచించెఁ బ్రా।సన్నుఁ డగుచు॥ 3

గీ॥ తత్త్వ విజ్ఞాన విదుల సా।ధనపరులకు
మనసు రంజిల్ల శ్రద్ధగ। మక్కువఁగొని।
తెనుఁగుసేసితి నౌనన ।ధీమతు లిలఁ
సరస భావ ప్రయుక్తిమై। సరళముగను॥ 4

# షష్ఠ్యంతములు

కం॥ శ్రీ కంఠార్ధ శరీరకు
నాకార్చిత శఖిలలోక। నాయక సతికిన్
ఆ కర్ణాయత నేత్రకు
శ్రీకర కద్వైత త త్త్వ। సిద్ధికి నుమకున్॥ ౫

నను దయఁ జూచెడి తల్లికి
దినకర శతకోటి దివ్య। తేజస్వినికిన్।
ఘనకుచకుంభ। యుగళకున్
సనకాది మునీంద్ర నుతకు। శంభుని సతికిన్॥ ౬

నగజకు నీరజనయనకు
నిగమాగమ వినుత శఖిల। నిర్మలయశకున్
అగణిత సద్గుణ ఖనికిన్
భగవతికిఁ బురారిసతికిఁ। బార్వతి కింకన్ ౭

గౌరికి, సుకుమారికి, నోం
కారికి, దైత్యారికిన్ మ।కార మనో సం
చారికి, నిర్మల కరుణా
వారికి, విజితారికిన్। జపాపహారిణికిన్॥

శంకరి కాశ్రిత భక్తవ
శంకరి కద్రిజకు సకల। సంకట హరికిన్।
వేంకటగిరిపుర నిలయకు
నంకిత మొనరింతుఁ గృతి, భావాబ్ధిఁదరించన్ ౯

# అవతారిక

శ్రీ మత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యులగు శంకర భగవత్పాదులు ముముక్షుజనబోధనార్థము రచించిన పెక్కు ప్రకరణ గ్రంథములలో 'శ్రీ వివేక చూడామణి' విశిష్టమైనది. సకల సద్గుణంబులయందు వివేకము తలమానికమువంటిదగుట గ్రంథనామము సార్థకము. వివేకము, వైరాగ్యము, శమదమాది గుణషట్కము, ముముక్షుత్వములు నాల్గు మోక్షసాధన చతుష్టయ మనబడును. వానిలో వివేకము, నిత్యా నిత్య వస్తు విచారణముచే నిత్యమగు బ్రహ్మజ్ఞానదాయక మగుటచేత నది ప్రముఖ సాధనము. వివేకమునకు జ్ఞానము ఫలము. జ్ఞానము సర్వ పాపముల దహించును. మృత్యు సంసారమును భస్మీపటల మొనర్చును భవబంధనములఁ ద్రెంచి మోక్షము సిద్ధింపఁజేయును.

ఛాందస భావములకు వ్యతిరేకముగ నుద్భవించి ప్రబలమై యజ్ఞ యాగాదుల నిరసించి యహింస ప్రబోధించిన బౌద్ధ, జైన మతములు నన్య నాస్తిక భావములు విస్తృత వ్యాప్తి నొందుచుండి, సనాతన మత మస్తవ్యస్తమై యుండ, నపరశివావతారమై కేరళ రాష్ట్రమందు కాలడి గ్రామమున సదాచార గృహంబున జనించి వేదశాస్త్ర పారం గతులై పిన్ననాటనే సన్యసించి ఆసేతు శీతాచలము పర్యటించి వాదం బున పండితుల నెల్లర జయించి సర్వజ్ఞ పీఠ మధిష్ఠించి యద్వైత ప్రబోధామృతముచే ఆస్తిక మతమునకు జీవము పోసి హైందవ మత మునకు సుస్థిరతను చేకూర్చిన జగద్గురువులు శ్రీ మచ్ఛంకర భగవత్పా దులు. దుస్సాధ్యమగు ప్రస్థాన త్రయమునకు భాష్యము చెప్పుటయే గాక పెక్కు ప్రకరణ గ్రంథములను, స్తోత్రములను రచించి వారు మనల ననుగ్రహించిరి. అద్వైతసారమగు జీవబ్రహ్మైక్యతావాదమును ఆత్మా నాత్మ విచారము, బ్రహ్మ సత్యం జగన్మిథ్య, తత్త్వమసి ఇత్యాది మహా వాక్య విచారముచే వివేక చూడామణియందు గురుశిష్య సంవాద రూప మున విశదముగ బోధించిరి. జీవన్ముక్తుని గూర్చి సమాధి ప్రారబ్ధ ఫల ముల గూర్చి వివరించిరి. జ్ఞానదాయకము మోక్షప్రదమగు వివేక చూడామణి యపార కరుణా సముద్రులై శంకరులు సాధనపరులగు సుజనులకొఱ కనుగ్రహించిన మహాప్రసాదము.

శంకరానుగ్రహము నాయందు పరిపూర్ణమైయుండ నే నీ మహా ప్రబంధరాజము ననువదించ గల్గితిని. నా యనువాదము సకల జనాను రంజకమై బుధజనామోదము బడయగలదని యాశించుచున్నాను. అను వాద మొనర్చుటకు ప్రోత్సహించిన మిత్రులకు, ముద్రణ కార్థిక సహాయ మొనర్చిన తిరుమల తిరుపతి దేవస్థానము యాజమాన్యమునకు నా కృతజ్ఞతలు.

వేంకటగిరి. వై. కమలాకరసాయి.

శ్రీ శంకరాచార్య కృత

# శ్రీ వివేక చూడామణి

## మంగళాచరణము

సర్వవేదాన్తసిద్ధాన్తగోచరం త మగోచరమ్,
గోవిన్దం పరమానన్దం సద్గురుం ప్రణతోఽస్మ్యహమ్. 1

శా॥ శ్రీగోవిందు నగోచరున్ శ్రుతిశిర।స్సిద్ధాంతదృగ్గోచరున్,
నాగేంద్రోద్ధరణున్,సనాతను మహా।నందాత్మునిన్,సద్గురున్,
యోగీశున్,భవరోగదూరుఁ ద్రిజగ।ద్ధ్యేనిన్ గృపాసింధువున్
వాగీశాదిసమస్తభక్తవరదున్ భక్తిన్ ప్రపూజించెదన్॥

## మానవజన్మ-మోక్షసాధన

జన్తూనాం నరజన్మ దుర్లభ మతః పుంస్త్వం తతో విప్రతా
తస్మా ద్వైదికధర్మమార్గపరతా విద్వత్త్వ మస్మాత్పరమ్,
ఆత్మానాత్మవివేచనం, స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితిః
ముక్తిర్నో శతకోటిజన్మసుకృతైః పుణ్యైర్వినా లభ్యతే. 2

ఆ.వె॥ అరుదు జీవకోటి।నరజన్మ మందునఁ
బురుషుఁడగుట యరుదు। పురుషులందు
విప్రజన్మమింక విప్రుల నిర్మల
ధర్మమార్గపరతఁ। దనరుటరుదు

వారలందు దుర్ల।భమ్ము పాండిత్యంబు
పండితుల వివేక।పరత యింక।
స్వానుభవము బ్రహ్మ।సంస్థితి, మోక్షంబు
పొందుట బహుజన్మ।పుణ్యవశము॥

దుర్లభం త్రయమేవైత ద్దైవానుగ్రహహేతుకమ్,
మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః. 3

గీ॥ మనుజజన్మము, మోక్షాభిమాన మింక

ననవరతము మహాత్ములయందు మెలఁగు
భాగ్య మివి మూడు దైవకృపను లభించు
నన్యథా దుర్లభము లంచు నరయవలయు॥

లబ్ధ్వా కథంచి న్నరజన్మ దుర్లభం
తత్రాపి పుంస్త్వం శ్రుతిపారదర్శనమ్,
యస్త్వాత్మముక్తౌ న యతేత మూఢధీః
స హ్యాత్మహా స్వం వినిహంత్యసద్గ్రహాత్. 4

ఆ. అరుదగు నరజన్మ మంది పురుషుఁడై
చక్కగ నిల శాస్త్రసార మెఱిఁగి
ఆత్మముక్తి కెవఁడు యత్నించ డాతఁడు
ఆత్మహంతకుఁడగు నజ్ఞుఁడగుట॥

ఇతః కోన్వస్తి మూఢాత్మా యస్తు స్వార్థే ప్రమాద్యతి,
దుర్లభం మానుషం దేహం ప్రాప్య తత్రాపి పౌరుషమ్. 5

గీ॥ మనుజదేహముఁ బురుషజన్మమును బొంది
స్వార్థభవబంధమోక్షసఁ సాధనమునఁ
బొరపడెడు నెవ్వఁడిల నట్టి బుద్ధిహీను
కంటె మూఢుఁడు వేరొండు గలఁడె ధరణి॥

వదంతు శాస్త్రాణి యజంతు దేవాన్, కుర్వంతు కర్మాణి భజంతు దేవతాః,
ఆత్మైక్య బోధేనవినా విముక్తిః న సిద్ధ్యతి బ్రహ్మశతాంతరేఽపి 6

చ॥ పలుకగ శాస్త్రమర్మములు బాగుగ యాగము లెన్ని చేసినన్
మెలఁకువఁ గర్మముల్ సలుపు మేదిని మ్రొక్కగ దేవకోటికిన్
కలుఁగదు ముక్తి లోకులకుఁ గల్గక యాత్మవిచార మెన్ని నూ
రుల యుగము ల్గతించినను రూఢిగనన్నది నిత్యసత్యమౌ॥

అమృతత్వస్య నాశాఽస్తి విత్తేనేత్యేవ హి శ్రుతిః,
బ్రవీతి కర్మణో ముక్తే రహేతుత్వం స్ఫుటం యతః. 7

అతో విముక్త్యై ప్రయతేత విద్వాన్
సంన్యస్తబాహ్యార్థసుఖస్పృహస్సన్,
సన్తం మహాన్తం సముపేత్య దేశికం
తేనోపదిష్టార్థసమాహితాత్మా. 8

గీ॥ ధరణిఁగల్గదు మోక్షము ధనమున నని,
పలికినటులనె స్ఫుటముగఁదెలుపు శ్రుతులు
కర్మయును గాదు ముక్తికిఁ గారణ మని
కాన నిస్సంశయంబుగ దాని నెరిఁగి॥
విషయసుఖచింతనంబును వీడి బుధుఁడు,
సత్పురుషుని మహాత్ముని సద్గురువరుఁ॥
జేరి యాతని బోధనఁ జిత్తముంచి,
జతన మొనరించవలయు మోక్షమ్ముఁ గోరి॥

ఉద్ధరే దాత్మనాత్మానం మగ్నం సంసారవారిధౌ,
యోగారూఢత్వ మాసాద్య సమ్యగ్దర్శననిష్ఠయా. 9

గీ॥ చక్కని జ్ఞాననిష్ఠచే సజ్జనుండు
యోగసంసద్ధుఁడై నిత్యయుక్తుఁ డగుచు
ఘోరసంసారవారిధిఁ గ్రుంకనున్న
యాత్మ నుద్ధరించవలయు నాత్మచేత॥

సంన్యస్య సర్వకర్మాణి భవబంధవిముక్తయే,
యత్యతాం పండితైర్ధీరై రాత్మాభ్యాస ఉపస్థితైః. 10

గీ॥ ధీరుఁడగు పండితుండు సు।స్థిరమనమునఁ
బడయు భవబంధమోక్షముఁ।బుడమియందు
సర్వకర్మములను బూ_ర్తి।సంన్యసించి
ఆత్మరతుఁడయి యత్నించు।ననవరతము॥

చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే,
వస్తుసిద్ధి ర్విచారేణ న కించిత్కర్మకోటిభిః. 11

గీ॥ చిత్తశుద్ధికి నిరతము।సేయు కర్మ
సిద్ధిపొసఁగదు చింతన।సేయకుండ
కోటికర్మల పున్నెము।గూడెనని
సిద్ధి కలుఁగదు బ్రహ్మంబుఁ। జేరఁజనదు॥

సమ్యగ్విచారతః సిద్ధా రజ్జుతత్త్వావధారణా,
భ్రాంత్యోదిత మహాసర్పభయదుఃఖవినాశినీ. 12

గీ॥ రజ్జుతత్త్వమెరుంగుట। భ్రాంతివలనఁ,
గలుఁగు సర్పభయంబేగు।కరణి నిపుడు।
చక్కని విచారణంబున। సకలజనుల
భ్రాంతి తొలఁగెడు నరులకు।భవమునందు॥

అర్థస్య నిశ్చయో దృష్టో విచారేణ హితోక్తితః,
న స్నానేన న దానేన ప్రాణాయామశతేన వా. 13

గీ॥ హితవచనవిచారంబుల।నిల నరులకు
సత్పదార్థావగాహన।సాధ్య మగును
జపతపాదుల బహుతీర్థ।జలకములను
దానముల సత్యమెరుఁగ సా।ధ్యంబు గాదు॥

అధికారిణ మాశాస్తే ఫలసిద్ధిర్విశేషతః,
ఉపాయా దేశకాలాద్యాః సంత్యస్మిన్ సహకారిణః. 14

గీ॥ హితవచనవిచారాసక్తి।నెపుడు నుండు
బ్రహ్మఫలసిద్ధి కధికారి।వంతుఁడైన
సజ్జనుని కెల్ల విధముల।సహకరించుఁ
గాలదేశాద్యుపాయముల్।గాంచ సిద్ధి॥

అతో విచారః కర్తవ్యో జిజ్ఞాసో రాత్మవస్తునః,
సమాసాద్య దయాసింధుం గురుం బ్రహ్మవిదుత్తమమ్. 15

గీ॥ సకలశాస్త్రార్థకోవిదు।సద్గురువరు
బ్రహ్మవిదుని దయానిధి। ప్రాపుఁ జేరి
ఆత్మవస్తు జిజ్ఞాసతో। ననవరతము
సద్విచారమ్ము బ్రాజ్ఞుండు।సలుపవలయు॥

మేధావీ పురుషో విద్వా నూహాపోహవిచక్షణః,
అధికారీ ఆత్మవిద్యాయా ముక్తలక్షణలక్షితః. 16

గీ॥ మతి వివేకంబుఁగూడుక।మాన్యుఁ డగుచు
బుద్ధిమంతుడు పురుషుఁడు।బుధవరేణ్యుఁ
డాత్మవిద్యావిచారణ। కధిపతియగు
ముందు చెప్పిన లక్షణ।ములను గల్గి॥

వివేకినో విరక్తస్య శమాదిగుణశాలినః,
ముముక్షోరేవ హి బ్రహ్మజిజ్ఞాసాయోగ్యతా మతా. 17

గీ॥ రహి వివేకము నమలవై।రాగ్యము నిఁక
శమదమాదిగుణాన్విత।స్వాంతమునను
మోక్షవాంఛాపరుండగు। పురుషుఁ డిలను
బ్రహ్మజిజ్ఞాస కర్హతఁ। బడయు నంద్రు॥

సాధానాన్యత్ర చత్వారి కథితాని మనీషిభిః,
ఏషు సత్స్వేవ సన్నిష్ఠా యదభావే న సిద్ధ్యతి. 18

గీ॥ సాధనచతుష్టయమున సమాధనిష్ఠ
పొసగునందురు నరులకు బుధులు ధరణి
నాల్గు సాధనములు లేక నయముగ నది
పొసగని దటంచు బల్కిన బొల్లు గాదు॥

ఆదౌ నిత్యానిత్యవస్తువివేకః పరిగణ్యతే,
ఇహాముత్ర ఫలభోగవిరాగ స్తదనంతరమ్,
శమాదిషట్కసంపత్తి ర్ముముక్షుత్వమితి స్ఫుటమ్. 19

గీ॥ తొలుత సదసద్విచారంబుతో మొదలిడి
పైన నిహపర భోగాలపయి విరక్తి
శమదమాదులు మోక్షజిజ్ఞాస గూడి
సాధనచతుష్టయంబగు సాధువులకు॥

బ్రహ్మ సత్యం జగన్మిథ్యా ఏవంరూపో వినిశ్చయః,
సోఽయం నిత్యానిత్యవస్తువివేకః సముదాహృతః. 20

తద్వైరాగ్యం జిహాసా యా దర్శనశ్రవణాదిభిః,
దేహాది బ్రహ్మపర్యంతే హ్యనిత్యే బ్రహ్మవస్తుని. 21

గీ॥ బ్రహ్మ సత్యము,మిథ్య ప్రపంచ మనెడి
నిశ్చయంబు వివేకంబు నిరతము మది
దేహమాదిగ బ్రహ్మాంత దృశ్య శ్రవణ
విషయముపై ముఖ్యము విరక్తి విపులముగను॥

విరజ్య విషయవ్రాతా ద్దోషదృష్ట్యా ముహుర్ముహుః,
స్వలక్ష్యే నియతావస్థా మనసః శమ ఉచ్యతే. 22

విషయేభ్యః పరావర్త్య స్థాపనం స్వస్వగోళకే,
ఉభయేషా మింద్రియాణాం స దమః పరికీర్తితః. 23

బాహ్యానాలంబనం వృత్తే రేషోపరతి రుత్తమా,
సహనం సర్వదుఃఖానా మప్రతీకారపూర్వకమ్. 24

చింతావిలాపరహితం సా తితిక్షా నిగద్యతే,
శాస్త్రస్య గురువాక్యస్య సత్యబుద్ధ్యవధారణామ్. 25

సా శ్రద్ధా కథితా సద్భిర్యయా వస్తూపలభ్యతే,
సమ్యగాస్థాపనం బుద్ధేః శుద్ధే బ్రహ్మణి సర్వదా. 26

తత్సమాధానమిత్యుక్తం న తు చిత్తస్య లాలనమ్ 27

గీ॥ మాటిమాటికి యోచించి।మహి నరుండు
దోషదృష్టిని విషయేచ్ఛ।దొలఁగఁ ద్రోసి
నిశ్చలంబుగ లక్ష్యము।నిల్పి మనసు
అంతరంగని గ్రహము సే।య నది శమము॥

గీ॥ ఇంద్రియంబుల విషయాది।నెడము సేసి
స్వస్థలంబుల నెలకొల్పి।సుస్థిరముగ
నిగ్రహంబును సాధించ।నిశ్చయముగ
దమ మనంబడుసాధన। ధరణియందు॥

గీ॥ బాహ్యములు చిత్తవృత్తిని। బట్టువడక
యుండు టుపరతియనఁబడు। నుర్వియందు
సర్వదుఃఖముల యెడల।సహనగుణము
వగపులేకుండుట తితిక్ష। వసుధయందు॥

గీ॥ శాస్త్రముల గురువాక్యాల। సత్యబుద్ధిఁ
గఁలుగ శ్రద్ధ యనంబడుఁ।గాంచ సిద్ధి
బ్రహ్మమందున మది నిల్పి।బాగుగాను
వరల నగు సమాధానము। వసుధ జనుల॥

అహంకారాది దేహాంతాన్ బంధా నజ్ఞానకల్పితాన్,
స్వస్వరూపావబోధేన మోక్తు మిచ్ఛా ముముక్షుతా. 28

గీ॥ ఆత్మరూపావబోధన।మంది నరుఁడు
అజ్ఞతాకల్పితములైన।యట్టివియగు
నహము మొదలుగ దేహాంత।మైన బంధ
ముల విముక్తిని గోర ము।ముక్షుత యగు॥

మందమధ్యమరూపాఽపి వైరాగ్యేణ శమాదినా,
ప్రసాదేన గురోః సేయం ప్రవృద్ధా సూయతే ఫలమ్. 29

ఆ॥ మందమధ్యమమగు।మహితమోక్షేకాంక్ష
శమదమాదిషట్క।సాధనముల।
గురుని కరుణబలియుఁ।గూడి వైరాగ్యము,
బ్రహ్మపదము నొందు।ఫలము గలుఁగు॥
వైరాగ్యం చ ముముక్షుత్వం తీవ్రం యస్య తు విద్యతే,
తస్మిన్నే వార్థవంతః స్యుః ఫలవన్తః శమాదయః. 30

ఆ॥వె॥ ఎవని మోక్షకాంక్ష।యిహపరవైరాగ్య
మెన్నఁ దీవ్రతరము।లన్నరులకు
శమదమాదిషట్క।సాధనవర్గంబు
సఫల మతనియందు।సార్థకంబు॥
ఏతయోర్మందతా యత్ర విరక్తత్వ ముముక్షయోః,
మరౌ సలిలవ త్తత్ర శమాదేః భానమాత్రతా. 31

ఆ॥వె॥ ఎవని మోక్షకాంక్ష।యిహపరవైరాగ్య
మెన్న మందమైన।వన్నరులకు
శమదమాదిషట్క।సాధనవర్గంబు
ఎండమావినీటి।కేగునట్లు॥

మోక్షకారణ సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ,
స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే,
స్వాత్మతత్త్వానుసంధానం భక్తి రిత్యపరే జగుః. 32

గీ॥ మోక్షసామగ్రియందు ము।ముక్షువులకు,
భక్తి శ్రేష్ఠంబటందును।బల్కుదు రిల
నాత్మరూపానుభవ సము।పార్జనంబు
భక్తినాఁబడుఁ గొందరి।భావనంబు॥
కొందరిఁక నెన్ను వారలు।గువలయమున
నాత్మతత్త్వావగాహనం।బఁచు భక్తి॥

ఉక్తసాధనసంపన్న స్తత్త్వజిజ్ఞాసు రాత్మనః,
ఉపసీదే ద్గురుం ప్రాజ్ఞం యస్మాద్బంధవిమోక్షణమ్. 33

గీ॥ పైని సాధనసంపత్తిఁ।బడసి మిగుల,
ఆత్మజిజ్ఞాసుపైనట్టి।యాతఁ డింక।
ప్రాజ్ఞుడైనట్టి గురుదేవు।సజ్జఁజేరి,
యాశ్రయించ నతినికి వి।ద్యార్థియగుచు॥
బంధవిముక్తి యతని కందు।బ్రాప్తమగును॥

## భవతరణోపాయమునకై గురుని ప్రార్థించుట

శ్రో శ్రోత్రియోఽవృజినోఽకామహతో యో బ్రహ్మవిత్తమః, 34

బ్రహ్మణ్యుపరత శ్శాంతో నిరింధన ఇవానలః.
అహేతుకదయాసింధు ర్బంధు రానమతాం సతామ్. 35

తమారాధ్య గురుం భక్త్యా ప్రహ్వప్రశ్రయసేవనైః,
ప్రసన్నం తమనుప్రాప్య పృచ్ఛే జ్జ్ఞాతవ్యమాత్మనః. 36

గీ॥ వేదవిదు,నిర్మలు, బ్రహ్మ।వేత్త,నసఘు,
కామరహితునిసద్గురు।గరుణనిలయు।
నిరతబ్రహ్మోపరతు శాంతు।నిశ్చలాగ్ని
వినతసజ్జనబాంధవు।విబుధవర్యు॥
నాత్మతత్త్వవిజ్ఞానము।నరయుటకును,
భక్తివిశ్వాసములతోడ।బ్రాంజలియయి।
కోరవలయును మెప్పించి।గురువు సేవ,
కరుణ బోధించవే యని।కరము సాచి॥

స్వామి న్నమ స్తే నతలోకబన్ధో కారుణ్యసింధో పతితం భవాబ్ధౌ,
మా ముద్ధరాత్మీయకటాక్షదృష్ట్యా ఋజ్వాతికారుణ్య
సుధాభివృష్ట్యా॥ 37

కం॥ స్వామీ।నతజనబాంధవ!
ధీమతి! భవజలధిఁబడిన।దీనుని నన్నున్।
బ్రేమోద్ధతిఁ గాపాడవె,
మామకహృత్కమలభృంగ!మహిమోపేతా॥

దుర్వార సంసారదవాగ్నితప్తం
దోధూయమానం దురదృష్టవాతైః,
భీతం ప్రపన్నం పరిపాహి మృత్యోః
శరణ్యమన్యం యదహం న జానే. 38

కం॥ ఉరుతరభవాగ్నికీలలు
దురదృష్టానిలము వెగయ।దుర్వారములై।
శరణంటి మృత్యుభయమున
గురువర! యెరు వెరుఁగ రక్ష।కుండవు నీవే॥

శాన్తా మహాంతో నివసన్తి సన్తో వసన్తవల్లోకహితం చరన్తః,
తీర్ణాస్స్వయం భీమభవార్ణవం జనాన్ అహేతునాన్యానపి
తారయన్తః. 39

కం॥ కడు భీమభవార్ణవమును,
గడచినవారగుటచేత।ఘనులు మహాత్మున్।
పుడమికి వసంత మట్లుగ,
నడుగక శ్రేయంబు గూర్తు।రవని జనులకున్॥

అయం స్వభావ స్స్వత ఏవ యత్పర-
శ్రమాపనోద ప్రవణం మహాత్మనామ్,
సుధాంశురేష స్వయమర్కకర్కశ-
ప్రభాభితప్తా మవతి క్షితిం కిల. 40

చ॥ తపన సుతీక్ష్ణకాంతి పరి।త ప్త ధరాతలికిన్ సుధాకరుం
డుపశమనంబుఁ గూర్చు నటు।లు త్తములైన మహాత్ము లుర్విలోఁ।
గృపఁ దమయంత లోకులకు।మృత్యుభయం బెడఁబాపువారలై
విపులజనాప్తులై జగతి।వేడుక సేయుట సాజమే కదా॥

బ్రహ్మానందరసానుభూతికలితైః పూతైః సుశీతైర్యుతైః
యుష్మ ద్వాక్కలశోజ్ఝితై శ్శ్రుతిముఖై ర్వాక్యామృతై స్సేచయ,
సంత ప్తం భవతాపదావదహనజ్వాలాభి రేవం ప్రభో
ధన్యా స్తే భవదీక్షణక్షణగతేః ప్రాతీకృతాః స్వీకృతాః. 41

ఉ॥ శ్రీకర వేదవాక్య।సుధఁ జిల్కవె బ్రహ్మరసానుభూతిచే
నీ కమనీయవాక్కలశ।నిర్గత నిర్మలతోయధారలన్।
భీకరమౌ భవాగ్నులను।భీతిలినట్టి ననున్ దయాళువై
స్వీకృతిఁ బాత్రుఁజేసి యిటుఁ జేయవె ధన్యుఁ గృపాకటాక్షమున్॥

కథం తరేయం భవసిన్ధు మేతం
కా వా గతిర్మే కతమోఽస్త్యుపాయః,
జానే న కించిత్కృపయాఽవ మాం ప్రభో
సంసారదుఃఖక్షతి మాతనుష్వ. 42

ఉ॥ ఏ విధి నేఁ దరించెదనొ।యీ భవవారిధి నేది దారి! నే
నే వివరంబుఁగాన నిఁక।నేది యుపాయము సద్గురూత్తమా!
ప్రోవఁగదే దయాంబునిధి!భూరిభవాంబుధిఁ దల్లడిల్లు నన్
దావక సత్కృపావిలసి।తంబగు దృక్కులతోడఁ దేర్చుచున్॥

## గురువు శిష్యుని కభయ మొసఁగి బోధించు విధి

తథా వదన్తం శరణాగతం స్వం సంసారదావానలతాపతప్తమ్,
నిరీక్ష్య కారుణ్యరసార్ద్రదృష్ట్యా, దద్యాదభీతం సహసా
మహాత్మా 43

వ. అని యివ్విధంబుగ

కం॥ శరణని దఁచేరిన, దు
స్తరభవదావాగ్నిహో త్ర।తప్తుని దీనున్।
కరుణామయ వీక్షణములఁ
బరఁపుచు గురువరుఁడు తృటిని।భయ మొసఁగవలెన్॥

విద్వాన్ సదస్మా దుపసత్తిమేయుషే
ముముక్షవే సాధు యథోక్తకారిణే,
ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ
తత్త్వోపదేశం కృపయైవ కుర్యాత్. 44

గీ॥ సకలసాధనసంపత్తి। శాంతమనము,
మోక్షమును గోరి గురునాజ్ఞ। ముదము మీర।
తలను దాల్చెడు సుజనుఁడు।దరిని జేర,
దయను బోధించవలయును।తత్త్వము నిల॥

మా భైష్ట విద్వం స్తవ నాస్త్యపాయః,
సంసారసింధో స్తరణేఽస్త్యుపాయః,
యేనైవ యాతా యతయోఽస్య పార
తమేవ మార్గం తవనిర్దిశామి. 54

గీ॥ కల దుపాయంబు భవవార్ధిఁ గడచుటకును
కలతవలదయ్య యతివరుల్ గాంచినట్టి
పథము, నీ కిందు బోధింతు భక్తి మీర
వినుము మృత్యుభయమ్మును విడువు మింక॥

అస్త్యుపాయో మహాన్ కశ్చిత్ సంసారభయనాశనః,
తేన తీర్త్వా భవాంభోధిం పరమానన్దమాప్స్యసి. 46

గీ॥ ఘోరసంసారసాగర తారకమగు,
సులభతర మహోపాయంబు గలదు; దీన
దాటవీలగు భవవార్ధి, దాటినంత,
నతులఘనపరమానన్ద మందనగును॥

వేదాంతార్థవిచారేణ జాయతే జ్ఞానముత్తమమ్,
తేనాత్యంతికసంసారదుఃఖనాశో భవత్యను. 47

గీ॥ ఉపనిషత్సారచింతన నుద్భవించు
నుత్తమంబగు జ్ఞాన మీయుర్విజనుల
జ్ఞానసంప్రాప్తిచేత ను ఘనమతులకు,
ఘోరసంసారదుఃఖ ని వారణమగు॥

శ్రద్ధాభక్తిధ్యానయోగాన్ముముక్షో-
ర్ముక్తేర్హేతూన్వక్తి సాక్షాచ్ఛ్రుతేర్గీః,
యో వా ఏతేష్వేవ తిష్ఠత్యముష్య,
మోక్షోఽవిద్యాకల్పితా ద్దేహబన్ధాత్॥ 48

గీ॥ మోక్షసాధకునకు నిల ముక్తిఁబడయ,
అజ్ఞతాజన్య భవబంధ నాంతకముగ
శ్రద్ధ, భక్తి, యోగ, ధ్యాన సాధనముల,
శ్రుతులు ఘోషించెఁ బ్రత్యక్ష సూక్తములను॥

అజ్ఞానయోగాత్పరమాత్మన స్తవ
హ్యనాత్మబంధ స్తత ఏవ సంసృతిః,
తయో ర్వివేకోదితబోధవహ్ని-
రజ్ఞానకార్యం ప్రదహే త్సమూలమ్. 49

గీ॥ బ్రహ్మరూపుండ వయ్యును।భవము కలిగె
అజ్ఞత ననాత్మబంధంబు।లందుఁదగుల।
సద్వివేకంబుఁ గల్గిన।జ్ఞానవహ్ని
భస్మ మొనరించు నజ్ఞాన।బాధనముల॥

## బంధము, ముక్తి, ఆత్మ ప్రయత్నము

కృపయా శ్రూయతాం స్వామిన్ ప్రశ్నోఽయం క్రియతే
మయా,
య దుత్తర మహం శ్రుత్వా కృతార్థస్స్యాం భవన్ముఖాత్. 50

గీ॥ కరుణ నా ప్రశ్న నాలించి। గురువరేణ్య!
ఉత్తరం బీయవే తండ్రి।యొప్పిదముగ।
మీరు చేసెడి బోధన।మిగుల భక్తి,
విని కృతార్థుండ నయ్యెద।విపులముగను॥

కో నామ బన్ధః కథమేష ఆగతః
కథం ప్రతిష్ఠాస్య కథం విమోక్షః,
కోఽసా వనాత్మా పరమః క ఆత్మా
తయో ర్వివేకః కథమేతదుచ్యతామ్ 51

ఉ॥ ఎయ్యది బంధమన్న నది।యెవ్విధిఁగల్గెనో దాని కెన్నఁగా
నెయ్యది యున్కి మోక్షణము।దెట్లగు బంధమునుండి జీవికిన్।
ఎయ్యదనాత్మయన్న నిఁక।నెయ్యదియౌఁ బరమాత్మ యన్నదో
యయ్య! వచింపవే కరుణ।నజ్ఞతఁ బాయగ శిష్యవత్సలా!

దన్యోఽసి కృతకృత్యోఽసి పావితం తే కులం త్వయా,
య దవిద్యాబంధ ముక్త్యా బ్రహ్మ భవితు మచ్ఛసి. 52

గీ॥ అజ్ఞతాబంధమోక్షణ।మభిలషించి,
బ్రహ్మమవగుట కీ వెంచ।జాలకుండ।
పావనంబయ్యె నీదగు।వంశ మెల్ల,
ధన్యుఁడవు కృతార్థుండవు।దాన నయితి॥

ఋణమోచనకర్తారః పితు స్సన్తి సుతాదయః,
బంధమోచనకర్తా తు స్వస్మా దన్యో న కశ్చన. 53

గీ॥ తండ్రిఋణమును దీర్చెడి।తనయు లుండ్రు,
కాని భవబంధ ముడుపంగఁ।గలుఁగువార।
లుందురే, యెందునైన న।న్యులను జగతిఁ
దాను యత్నింపకౌనె సా।ధ్యంబె ముక్తి?

మస్తకన్యస్తభారాదేః దుఃఖ మన్యై ర్నివార్యతే,
క్షుధాదికృతదుఃఖం తు వినా స్వేన న కేనచిత్. 54

గీ॥ ఆత్మయత్నంబు నన్యాదు।లాదరించ
క్షుత్పిపాస లణంగెడు;। కువలయమున।
నెత్తుకొననగు నన్యులు।నెత్తిబరువు,
క్షుత్పిపాసల నితరులు।గొనుట కలదె॥

పథ్య మౌషధసేవా చ క్రియతే యేన రోగిణా,
ఆరోగ్యసిద్ధి ర్దృష్టాఽస్య నాన్యానుష్ఠితకర్మణా. 55

గీ॥ పథ్యము నిఁక నౌషధమును।బాగుగఁ గొన,
రోగి యారోగ్యవంతుఁడౌ।లోకమందు।
తానుగా నౌషధంబును।ద్రావకున్న
పరుల నిష్ఠల రుగ్మతఁ।బాయునగునె॥

వస్తుస్వరూపం స్ఫుటబోధచక్షుషా,
స్వేనైవ వేద్యం న తు పండితేన,
చంద్రస్వరూపం నిజచక్షుషైవ
జ్ఞాతవ్య మన్యై రవగమ్యతేకిమ్. 56

గీ॥ తెలియ, వస్తువుఁ గాంచంగ।వలెను గనుల,
పండితుల బోధనల నేర్వఁ।బడునె ధరణి।
చక్షువులఁ దిలకించక।జంద్రబింబ
మన్యవచనము నెరుగంగ।నగునె శిష్య॥

అవిద్యా కామకర్మాది పాశబంధం విమోచితుమ్,
కః శక్నుయా ద్వినాఽఽత్మానం కల్పకోటిశతై రపి. 57

గీ॥ అజ్ఞత జనించు కామక।ర్మాదిపాశ,
మోచనకుఁ దానె శక్యుఁడు।ముక్తి యెటుల।
నొరుల సాయము నొనగూడు।నుర్వియందుఁ,
కల్పశతకోటికాలము।గాచి చూడ॥
న యోగేన న సాంఖ్యేన కర్మణా నో న విద్యయా,
బ్రహ్మాత్మైకత్వబోధేన మోక్ష స్సిధ్యతి నాన్యథా॥ 58

గీ॥ కాదు యోగంబు సాధ్యంబుఁ గాదు, కర్మ,
విద్యలవలన మోక్షము।వీలుగాదు।
బ్రహ్మ మాత్మయు నొకం డను।భావ మొదవ
మోక్షము లభించు నన్యంబుఁ।బొందఁగాదు॥

వీణాయా రూపసౌందర్యం తంత్రీవాదనసౌష్ఠవమ్,
ప్రజారంజనమాత్రం త న్న సామ్రాజ్యాయ కల్పతే. 59

గీ॥ చూడనింపగు వీణియ। శ్రుతి నొనర్చి,
నేర్పు మీటుచు బ్రజల రం।జింపవచ్చు।
కాని యది యెంత పైజీక।ఘనతయైన
మోక్షసామ్రాజ్యసాధన।మ్మునకుఁ గాదు॥

వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలమ్,
వైదుష్యం విదుషాం తద్వ ద్భుక్తయే న తు ముక్తయే 60

చ॥ చతురత, శబ్దదంబమును। శాస్త్రవిమర్శనకౌశలంబు, పాం
డితియును, ధీజనంబులకు। డింభకః।యౌనవి బొట్టకూటికే।
హితవులు, గాని బ్రహ్మపద। హేతువులౌనొకొ, యెంత నేర్చినన్,
వితరణనాత్మతత్త్వమును।వేడ్క నెరుంగక ముక్తి గల్గునే॥

అవిజ్ఞాతే పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా,
విజ్ఞాతేఽపి పరే తత్త్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా 61

గీ॥ పరమతత్త్వము చక్కగ।నెరుఁగఁ బడక,
సకలశాస్త్రాధ్యయనము ని।ష్ఫలము,పరమ।
తత్త్వ మెరుఁగఁగఁబడెనేని।ధరణియందు,
సకలశాస్త్రాధ్యయనము ని।ష్ఫలము శిష్య॥

శబ్దజాలం మహారణ్యం చిత్తభ్రమణకారణమ్,
అతః ప్రయత్నాజ్జ్ఞాతవ్యం తత్త్వజ్ఞా త్తత్త్వమాత్మనః 62

గీ॥ కారడవిశబ్దములు।భ్రమ।గలుఁగ మదిని,
అతి ప్రయత్నముమార్గంబు।నరయునటులు।
నాత్మతత్త్వముఁ దత్త్వజ్ఞు।నడిగి యడిగి,
మోక్షగామి గ్రహించంగ।ముక్తిగలుఁగు॥

అజ్ఞానసర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా,
కిము వేదైశ్చ శాస్త్రైశ్చ కిము మంత్రైః కిమౌషధైః 63

గీ॥ మోహసర్పదష్టునకు న।మోఘమైన,
యోషధము బ్రహ్మవిజ్ఞాన।మన్యమైన,
యౌషధము లేమి? వేదశా।స్త్రాదు లేమి?
మంత్రములు నేమిపనికగు।మాన్యచరిత॥

న గచ్ఛతి వినా పానం వ్యాధి రౌషధశబ్దతః,
వినాఽపరోక్షానుభవం బ్రహ్మశబ్దైర్న ముచ్యతే॥ 64

గీ॥ మందునామమ్ము నుడివినమాత్రముననె,
రోగ మేగదు మందుఁదాఁ ద్రాగకున్న।
నాత్మఁబొందక బ్రహ్మపదానుభూతి
నామ శ్రవణంబు బంధము నాశమగునె॥

అకృత్వా దృశ్యవిలయ మజ్ఞాత్వా తత్త్వ మాత్మనః,
బాహ్యశబ్దైః కుతో ముక్తి రుక్తిమాత్రఫలై ర్నృణామ్. 65

గీ॥ దృశ్యమునువిలయింపక దృక్స్వరూపంబు,
ఆత్మతత్త్వంబునెరుఁగక యాత్మ వృథగఁ।
బొద్దుఁబుచ్చంగభాషించు పురుషులకును,
కట్టిమాటల మోక్షము వలనుపడునె॥

అకృత్వా శత్రుసంహార మగత్వాఽఖిలభూశ్రియమ్,
రాజాహమితి శబ్దాన్నో రాజా భవితుమర్హతి॥ 66

గీ॥ శత్రువర్గముఁజంపక సకలరాజ్య
సంపదనుగల్గకే రీతి శబ్దమాత్ర
మునను రాజును నేనంచు మురియుచున్న
రాజు గాగలఁడే భువి రాజసాన॥

ఆప్తోక్తిం ఖననం తథోపరిశిలాద్యుత్కర్షణం స్వీకృతిం
నిక్షేపం సమపేక్షతే న హి బహిశ్శబ్దైస్తు నిర్గచ్ఛతి,
తద్వద్బ్రహ్మవిదోపదేశమననధ్యానాదిభి ర్లభ్యతే
మాయాకార్యతిరోహితం స్వమమలంతత్త్వ న దుర్యుక్తిభిః॥ 67

గీ॥ ఆప్రజనవాక్యమునఁ ద్రవ్వి।యవని శిలలఁ
బెల్లగించంగ లభియించుఁ।బెన్నిధి యిలఁ।
గాని లభియించునే పేరి।గళము నెత్తి
కూత లిడినంతమాత్రాన।రూపము కడ॥
అటులె మననముధ్యానము।ననఘులైన,
బ్రహ్మవేత్తల యుపదేశ।పాఠములను।
నరుఁడు మది నిల్ప భవబంధ।నాశకమగు,
ముక్తిలభియించుఁగాని దు।ర్యుక్తిఁ గాదు॥

తస్మాత్సర్వప్రయత్నేన భవబంధవిముక్తయే,
స్వైరేవ యత్నైః కర్తవ్యో రోగాదావివ పండితైః 68

గీ॥ ఆత్మయత్నంబు కర్తవ్య।మవనిలోనఁ
గాంచ భవబంధనవిముక్తి।ఘనబుధులకు।
ఎటుల రోగాదులను నిరో।ధించుటకును
ఆత్మయత్నంబు గడు నవ।శ్యమొ ధరిత్రి॥

## ఆత్మానాత్మ విచారము

యస్త్వయాఽద్య కృతః ప్రశ్నో వరీయాన్ శాస్త్రవిన్మతః,
సూత్రప్రాయో నిగూఢార్థో జ్ఞాతవ్యశ్చ ముముక్షుభిః 69

గీ॥ నీ వడుగుప్రశ్న శ్రేష్ఠము,। నిఖిలశాస్త్ర,
విన్మతము,సూత్రప్రాయము,। వేద్యమమిత।
గూఢభావప్రపూర్ణము,।కువలయమున
బోధనీయంబు,సర్వము।ముక్షువులకు॥

శృణుష్వావహితో విద్వన్ యన్మయా సముదీర్యతే,
తదేతచ్ఛ్రవణాత్సద్యో భవబన్ధాద్విమోక్ష్యసే 70

గీ॥ పండితుఁడ సావధానుండ।వై వినుమిదె,
చెప్పుచుంటిని నీ కిది। శ్రేయమంచు।
వినిన తృటిలోన లభియించు।విమలమైన,
మోక్షపద మద్వితీయ మ।మోఘ।మనఘ॥

మోక్షస్య హేతుః ప్రథమో నిగద్యతే,
వైరాగ్య మత్యన్త మనిత్యవస్తుషు,
తతశ్శమ శ్చాపి దమ స్తితిక్షా; న్యాసం
ప్రసక్తాఖలకర్మణాం భృశమ్ 71

గీ॥ మోక్షకారణములలోన।మొదటిదం ద్ర,
నిత్యవస్తువైరాగ్యము।నిశ్చితమతి।
షట్కసాధనసంపత్తి। జగమునిఖల,
కర్మసంన్యాసము వచింత్రు।కారణములుగ॥

తత శ్శ్రుతి స్తన్మననం స్వతత్త్వధ్యానం
చిరం నిత్యనిరంతరం మునేః,
తతోఽవికల్పం పరమేత్య విద్వా, నిహైవ
నిర్వాణసుఖం సమృచ్ఛతి 72

గీ॥ వినినగురువాక్యమననము।విడువ కెపుడు,
నాత్మతత్త్వపుధ్యానమం।దలరమునిగ।
నిర్వికల్పంబు,పరమును।నిత్యమైన,
బ్రహ్మనిర్వాణపద మిందె।పండితునకు॥

యద్బోద్ధవ్యం తవేదానీ మాత్మానాత్మవివేచనమ్,
తదుచ్యతే మయా సమ్యక్ శ్రుత్వాఽఽత్మన్యవధారయ 73

గీ॥ వినుము తెల్పెద నిదె నీకు।విశదముగను
ఆత్మకు ననాత్మకును గల।యంతరమ్ము।
శ్రద్ధగా మది నిల్పుము।చక్కగ విని
బోధనీయము గావున।పుణ్యచరిత!॥

మజ్జాస్థి మేద;పలరక్తచర్మత్వగాహ్వాయై
ర్ధాతుభి రేభి రన్వితమ్,
పాదోరువక్షోభుజపృష్ఠమస్తకై రంగై
రుపాంగై రుపయుక్త మేతత్॥ 74
అహం మమేతి ప్రథితం శరీరం
మోహాస్పదం స్థూలమితీర్యతేబుధైః,
నభోనభస్వద్దహనాంబుభూమయః,
సూక్ష్మాణి భూతాని భవన్తి తాని॥ 75
ఉ॥ మజ్జయునస్థికమ్మెదడు।మాంసమురక్తముచర్మమింకఁద్వక్,
సజ్జితసప్తధాతువిల।సత్తనువందుననంగముల్ గనఁగా।
బొజ్జశిరంబుపాదములు।ముట్టెయుహస్తములూరువుల్ భుజాల్
సజ్జనఃనేను నాదనున।సద్గుణబంధురమైనదేహమౌ॥
ఆ.వె॥ నేననునాదియనున।నిత్యదేహము బుధుల్
స్థూలమందురింకఁ।సూక్ష్మమైన
భూతపంచకంబు।భూమి,యాకాశము
అగ్ని,జలమువాయు।వనఁగజగతి॥
పరస్పరాంశై ర్మిలితాని భూత్వా స్థూలాని
చ స్థూలశరీరహేతవః,
మాత్రాస్తదీయా విషయా భవన్తి శబ్దాదయః
పంచ సుఖాని భోక్తుః 76
గీ॥ కల్గెనీస్థూలదేహము।గలియభూత
పంచకంబొందొకటితోడఁ।బ్రకృతియందు
వీనిమాత్రలెశబ్దాది।విషయపంచ
కమగుజీవునికవిసుఖ।కారణములు॥
య ఏషు మూఢా విషయేషు బద్ధా
రాగోరుపాశేన సుదుర్దమేన,
ఆయాన్తి నిర్యాన్త్యధ ఊర్ధ్వ ముచ్చైః
స్వకర్మదూతేన జవేన నీతాః

గీ॥ మూఢుఁడెవ్వఁడు విషయస।మూహమందు,
రాగపాశనిబద్ధుండు।రమ్యచరిత!
కర్మమనుదూతచేఁజిక్కి।కడు రయముగఁ
బైకిఁ గ్రిందికి వెడలుచు।వచ్చుచుండు॥

శబ్దాదిభిః పంచభిరేవ పంచ పంచత్వమాపుః స్వగుణైర్నిబద్ధాః,
కురంగమాతంగపతంగమీనభృంగా నరః పంచభిరంచితః కిమ్?

గీ॥ కరిణి మోజునఁగరి చిక్కుఁ।గర్తమందు,
వంగనస్పర్శసౌఖ్యమ్ము।నభిలషించి।
భ్రమఁబతంగంబుగాంతిని।వహ్నిఁజొచ్చు,
నిరుకుమీనముగాలము।నెరకునరిగి
వేణునాదమున నురక్తి।విని
హరిణము।వేటగానికిఁజిక్కెడు।బ్రేటువడుచు
సంపెగను జేరిభృంగము।సౌరభాశఁ।
జిక్కివెలువడఁజాలక। శిథిలమగును॥

ఒకవికారమునకె యుర్వి।నుడుగఁ దనువు,
కరి,పతంగ,భృంగ,జలజ।హరిణములిఁక।
పంచవికృతులకిరవైన।పామరుగతి,
చెప్పవలయునెయాపైనఁ।జిన్నవాఁడ॥

దోషేణ తీవ్రో విషయః కృష్ణసర్పవిషాదపి,
విషం నిహన్తి భోక్తారం ద్రష్టారం చక్షుషాఽప్యయమ్ 79

గీ॥ విషవిచారణశబ్దాది।విషయములకు,
కృష్ణసర్పవిషంబైనఁ।గ్రిందెయగును।
గరళము భుజించ నిర్జించుఁ।గాని విషయ
కాంక్షనిర్జించువీక్షకుఁ।గనినత్పటిని॥

విషయాశామహాపాశా ద్యోఽ విముక్త స్సుదుస్త్యజాత్,
స ఏవ కల్పతే ముక్త్యై నాన్యః షట్ఛాస్త్రవేద్యపి 80

గీ॥ విషయవాంఛామహాపాశ।విగతబంధ,
నుండు మోక్షార్హుఁడు బుధజ।నుల ధరిత్రి।
సంగరహితుఁడు గాక ష।ట్ఛాస్త్రవిదుఁడు
బంధముక్తికి నర్హతఁ।బడయఁగలఁడె?

అపాతవైరాగ్యవతో ముముక్షూన్
భవాబ్ధిపారం ప్రతి యాతు ముద్యతాన్,
ఆశాగ్రహో మజ్జయతేఽన్తరాళే
నిగృహ్య కంఠే వినివర్త్య వేగాత్ 81

గీ॥ పతితవైరాగ్యవంతుఁడు।భవజలనిధి,
దాటుచో మోక్షమునకయి।తాకి నడుమ।
ముంచు నొడుపుగ గళమును।మోముఁ గలచి
విషయవాంఛామకర మతి।వేగముగను॥

విషయాఖ్యగ్రహో యేన సువిరక్త్యసినా హతః,
స గచ్ఛతి భవాంబోధేః పారం ప్రత్యూహవర్జితః 82

గీ॥ ఘనతరంబగు వైరాగ్య।ఖడ్గధార,
విషయమకరంబు హతమార్చు।విబుధవరుఁడు।
చేరు నావలియొడ్డని।వారితుఁడయి,
కాంచు సిద్ధిని భవవార్ధిఁ।గడచినంత॥

విషమవిషయమార్గే వచ్ఛతోఽనచ్ఛబుద్ధేః
ప్రతిపద మభియాతో మృత్యురప్యేష విద్ధి,
హితసుజనగురూక్త్యా గచ్ఛత స్స్వస్య యుక్త్యా
ప్రభవతి ఫలసిద్ధి స్సత్యమిత్యేవ విద్ధి 83

గీ॥ విషయమార్గముఁ బయనించు-వికలబుద్ధి
ప్రతిపదమ్మున మృత్యువు।పాలఁబడెడు।
మిత్రసజ్జనగురువాక్య।మిళితమైన
ఆత్మయుక్తిని ఫలసిద్ధి।నందు నరుఁడు॥

మోక్షస్య కాంక్షా యది వై తవాస్తి త్యజాతిదూరా ద్విషయాన్ విషం యథా,
పీయూషవ త్తోషదయాక్షమార్జవా, ప్రశాన్తిదాన్తీః భజ నిత్య మాదరాత్॥ 84

గీ॥ నిజ మది మేని మోక్షమున।నీదగు కాంక్ష, విషమ్ము రీతిగన్
సుజనవరేణ్య! దూరమయి।చూడు మిఁకన్విషయాదివర్గమున్।
భజన మొనర్చు మాదరము।పావననౌ నమృతంబువంటి యీ
ఋజుమతి, శాంతి, దాంతి, క్షమ। ప్రేమలు హర్షముతోడ నిచ్చలున్॥

అనుక్షణం య త్పరిహృత్య కృత్య, మనాద్యవిద్యాకృతబంధమోక్షణమ్,
దేహం పరార్థోఽయ మముష్య పోషణే యః సజ్జతే స స్వమనేన హన్తి 85

గీ॥ సతతము పురాతనాజ్ఞాన।జనితబంధ
మోక్షమును గోరుటను మాని।మూఢుఁ డెవఁడు।
పూను స్వార్థముతో దేహ।పోషణమున
కతఁడు నిశ్చయముగ నాత్మ।హంతకుండు॥

శరీరపోషణార్థీ సన్ య ఆత్మానం దిదృక్షతి,
గ్రాహం దారుధియా ధృత్వా నదీం తర్తుం స గచ్ఛతి 86

గీ॥ తనదు దేహమ్ముఁబోషించు।తలఁపుఁగల్గి,
ఆత్మ దర్శించ నెంచెడు।నట్టివాఁడు।
దారుమొద్దుగ మొసలిని।దలఁచి నదిని
దాటఁ జూచెడిమూర్ఖపు।తలఁపువాఁడు॥

మోహ ఏవ మహామృత్యు ర్ముముక్షో ర్వపురాదిషు,
మోహో వినిర్జితో యేన స ముక్తిపదమర్హతి 87

గీ॥ మృత్యు వెరుఁగును దేహాద్య।నిత్యవస్తు
మోహమునఁగల్గు నఁచు ము।ముక్షువులకు।
నెవఁడు నిర్జించు మోహంబు।నిహమునందె,
యాతఁ డర్హుండు మోక్షంబు।నందుకొనగ॥

మోహం జహి మహామృత్యుం దేహదారసుతాదిషు,
యం జిత్వా మునయో యాన్తి తద్విష్ణోః పరమం పదమ్ 88

గీ॥ దేహ,దార,సుతాదుల।మోహమనెడి,
ఘోరమృత్యువు వీడుమో।ధీరవర్య!
మోహమును గెలిచినయట్టి।మునులు ఋషులు
చేరుదురు విష్ణుపదమును।సిద్ధిఁబొంది॥

త్వఙ్మాంసరుధిరస్నాయుః మేదోమజ్జాస్థిసంకులమ్,
పూర్ణం మూత్రపురీషాభ్యాం స్థూలం నింద్య మిదం వపుః 89

గీ॥ స్నాయుమేదోపలాస్థికా।చర్మరుధిర,
సంకులస్థూలదేహము।సరసవచన!
మూత్రమలమయుమత్యంత।మోహకరము,
హేయమంచు నిహంబున।నెరుఁగుమయ్య॥

పంచీకృతేభ్యో భూతేభ్యః స్థూలేభ్యః పూర్వకర్మణా,
సముత్పన్న మిదం స్థూలం భోగాయతన మాత్మనః 90
అవస్థా జాగర స్తస్య స్థూలార్థానుభవో యతః

గీ॥ పంచకంబుగసృష్టివి।భాజితమగు
ఘనతరంబగుభూతసం।ఘమునఁబూర్వ।
కర్మమునఁజేసి యీ స్థూల।కాయమొదవు
సర్వభోగాయతనముగ।జగతి నింద్రి॥
యార్థములనుజాగ్రదవస్థ।ననుభవించ
నాత్మ కిహముననుచు నీ।వరయు మయ్య॥

బాహ్యేంద్రియైః స్థూలపదార్థసేవాం స్రక్చందనస్త్ర్యాది
విచిత్రరూపామ్,
కరోతి జీవ స్స్వయ మేతదాత్మనా తస్మా త్ప్రశస్తి
ర్వపుషోఽస్య జాగరే 91

గీ॥ స్త్రీకుసుమచందనాద్యర్థ।సేవనముల,
నాత్మబాహ్యేంద్రియంబుల।ననుభవించు।
జీవుఁ డీస్థూలదేహముఁ జిత్రముగను
జాగృతిని దేహమున కీ ప్రశస్తి చెల్లు॥

సర్వోఽపి బాహ్యసంసారః పురుషస్య యదాశ్రయః,
విద్ధి దేహ మిదం స్థూలం గృహవ ద్గృహమేధినః 92

గీ॥ గృహము గేస్తున కిరవగు।రీతి నిలను,
సర్వమగునట్టి బాహ్యసం।సారమందు।
నాశ్రయము జీవునికి దేహ।మంచు నీవు
ఎరుగుమా శిష్య! నాదగు।హితవచనము॥

స్థూలస్య సంభవజరామరణాని ధర్మాః
స్థౌల్యాదయో బహువిధా శ్శిశుతాద్యవస్థాః,
వర్ణాశ్రమాదినియమా బహుధాఽఽమయా స్స్యుః
పూజావమానబహుమానముఖా విశేషాః॥ 93

గీ॥ జననవార్ధక్యమరణముల్।స్థౌల్యతాది,
వివిధశిశుతాద్యవస్థలు।వివిధములగు।
వర్ణములునాశ్రమంబుల।పారమైన,
నియమములు పూజలవమతుల్।భయముఁగొల్పు॥
బహువిధములగు రోగముల్।బాధ లిలను
గల్గుచున్నవి యీ స్థూల।కాయమునకు॥

బుద్ధీన్ద్రియాణి శ్రవణం త్వగక్షి ఘ్రాణంజిహ్వా విషయావబోధనాత్,
వాక్పాణిపాదా గుదమప్యుపస్థః కర్మేన్ద్రియాణి ప్రవణేన
కర్మను 94

గీ॥ ఘ్రాణ, జిహ్వా, త్వగంబక। కర్ణములను
అర్థగ్రహణతజ్ఞానేంద్రి। యంబులం్డ్రు।
కర్మకుశలతపాదవా। క్పాణ్యుపస్థ
గుదలకర్మేంద్రియములను। గురుతునండ్రు॥

నిగద్యతేఽన్తఃకరణం మనోధీరహంకృతిశ్చిత్తమితి స్వవృత్తిభిః,
మనస్తు సంకల్పవికల్పనాది ర్బుద్ధిఃపదార్థాధ్యవసాయధర్మతః
అత్రాభిమాన దహమి త్యహంకృతిఃస్వార్థానుసంధానగుణేన
చిత్తమ్95

గీ॥ మనసు, బుద్ధి, యహంకార। మనియుఁజిత్త
మనియుననఁబడెడిస్వవృత్తి। యంతరంగ।
మందుమదికల్పనము సేయు। నధికరణము
బుద్ధివస్త్వాదినిశ్చయ। ము నొనరించు।
నందునే నను నభిమాన। మగు నహమ్ము
తలఁచఁజిత్తంబు స్వార్థసం। ధానగుణము॥

ప్రాణాపానవ్యానోదానసమానా భవ త్యసౌ ప్రాణః,
స్వయమేవ వృత్తిభేదాత్ వికృతిభేదా త్సువర్ణసలిలమివ 97

సీ॥ ఉచ్ఛ్వాసనిశ్వాస। నురముననూగాడు,
ప్రాణవాయువునండ్రు। ప్రాణ మంచు।
పాయునిర్గతమగు। ప్రాణ మపానంబు
దేహసంచారియై। తిరుగు వ్యాన॥
మచలమైకంఠము। నందుం డుదానంబు
నాభివద్దనుసమా। నమనబడెడు।
ప్రాణ మీ గతిఁబంచ। ప్రాణవాయువులుగ
నామాంతరంబుల। నడచుచుండు॥

గీ॥ స్వర్ణజలమెట్లు వివిధరూ।పములఁగొనెడు,
ప్రాణమును నట్లె వివిధభా।వముల మెరయు।
నంచుఁ దెలియుము మోక్షకాం।క్షానురక్తి।
శిష్యసత్తమ।విన్ము నేఁ।జెప్పుమాట॥

వాగాది పంచ ప్రాణాది పంచ శ్రవణాది పంచాభ్రముఖాని
పంచ,
బుద్ధ్యా ద్యవిద్యాఽపి చ కామకర్మణీ పుర్యష్టకం సూక్ష్మశరీర
మాహుః 98

గీ॥ శ్రవణవాగభ్రప్రాణపం।చకచతుష్టిఁ
గామమునుగర్మమంతరం।గం బవిద్య।
లనెడినాలుగుకలిసిన।యష్టకంబు
కల్గుచున్నది ధర సూక్ష్మ।కాయ మనఘ॥

ఇదం శరీరం శృణు సూక్ష్మసంజ్ఞితం
లింగం త్వపంచీకృతభూతసంభవమ్,
సవాసనం కర్మఫలానుభావకం
స్వాజ్ఞానతోఽనాది రుపాధిరాత్మనః॥ 99

గీ॥ పంచభూతోద్భవంబు స।వాసనంబు
ఆత్మకు ననాదిగ నుపాధి।యైన తనువు।
అజ్ఞతాజన్యకర్మఫ।లానుభోగ
కమును లింగము సూక్ష్మదే।హ మనియండ్రు॥

స్వప్నో భవత్యస్య విభక్త్యవస్థా స్వమాత్రశేషేణ విభాతి యత్ర,
స్వప్నే తు బుద్ధి స్స్వయమేవ జాగ్రత్కాలీననానావిధవాసనాభిః
100

గీ॥ సూక్ష్మదేహంబునకుఁబోల్చ।స్థూలతనువు
స్వప్నము నవస్థభేదము।స్పష్టమగును।
తనువునిద్రించఁ గలలోనఁ।దనదు బుద్ధి
లింగదేహంబువాసన।లంగ్రహించు॥

కర్త్రాదిభావం స్వయమేవ రాజతే యత్ర స్వయం భాతి
హ్యయం పరాత్మా,
ధీమాత్రకోపాధి రశేషసాక్షీ న లిప్యతే తత్కృత కర్మలేశైః
యస్మా దసంగ స్తత ఏవ కర్మభిః న లిప్యతే కించి దుపాధినా
కృతైః 101

గీ॥ కర్త నేనను భావప్రకాశితంబు
ఆత్మభాసంబునౌ వర।మాత్మ,సాక్షి।
బుద్ధ్యుపాధిఁజేసినకర్మ।ముల నతండు
అంటఁబడడునిస్సంగుడై।యలరు కతన॥

సర్వవ్యాపృతికరణం లింగ మిదం స్యాచ్చిదాత్మనః పుంసః,
వాస్యాదికమివ తక్ష్ణ స్తేనై వాత్మా భవత్య సంగోఽయమ్. 102

గీ॥ బాడిశనులుని వడ్రంగి।వాడునటుల
నరయ నీ లింగదేహమిం।దన్నిపనుల।
నుపకరణమై చిదాత్మకు।నొప్పుచుండ
నాత్మ సంగవిరహితమై।యలరుచుండు॥

అంధత్వమందత్వపటుత్వధర్మాః, సౌగుణ్యవైగుణ్యవశాద్ధి చక్షుషః,
బాధిర్యమూకత్వముఖా స్తథైవ, శ్రోత్రాదిధర్మా న తు వేత్తు
రాత్మనః 103

గీ॥ చూపులోపంబునంధత।చురుకుఁదనము
కంటిగుణదోషములచేతఁ।గల్గునటుల।
బధిరమూకత్వములుకర్ణ।ముఖములందుఁ
గల్గులోపములాత్మకుఁ।గఁలుగవెరుఁగు॥

ఉచ్ఛ్వాసనిశ్శ్వాస విజృంభణక్షుత్,
ప్రస్యందనా ద్యుత్క్రమణాదికాః క్రియాః, 104

ప్రాణాది కర్మాణి వదంతి తజ్జ్ఞాః,
ప్రాణస్య ధర్మౌ వశనాపిపాసే

గీ॥ క్షుత్పిపాసల, లేచుటఁ।గూర్చొనుటల
శ్వాసప్రక్రియనితరమౌ। ప్రాణకర్మ।
ములను బ్రాణధర్మములంద్రు। బుధవరులను
తత్త్వవిదులౌ మహాత్ములు।ధరణియందు॥

అంతఃకరణ మేతేషు చక్షురాదిషు వర్ష్మణి,
అహ మిత్యభిమానేన తిష్ఠత్యాభాసచేతసా 105
అహంకార స్స విజ్ఞేయః కర్తా భోక్తాఽభిమాన్యయమ్,
సత్త్వాదిగుణయోగేన చావస్థాత్రయమశ్నుతే॥ 106

గీ॥ తనువునను సర్వేంద్రియి।తండమునను
భ్రాంతి నే ననియభిమాన।భావనంబుఁ।
దనరునట్టిది యరయ నం।తఃకరణము
అహము కర్తయు భోక్తయు।నంతరంగ॥
మతడె యభిమాని త్రిగుణసం।యుతుఁడగుచును
ముత్త్రివిధావస్థలనుభువిఁ।బొందుచుండు॥

విషయాణా మానుకూల్యే సుఖీ దుఃఖీ విపర్యయే,
సుఖం దుఃఖం చ తద్ధర్మః సదానందస్య నాత్మనః 107

గీ॥ విషయసంగతి ననుకూల।విధిని సుఖము
విషయ ప్రతికూలతంజేసి।వెతయుఁగల్గు
అంతరంగమునకుఁ జూడ।నవనియందు
ఘనసదానందునికి నవి।కలుఁగవెపుడు॥

ఆత్మార్థత్వేన ప్రేయాన్విషయో న స్వతః ప్రియః,
స్వత ఏవ హి సర్వేషా మాత్మా ప్రియతమో యతః 108

తత ఆత్మా సదానందో నాస్య దుఃఖః కదాచన,
య త్సుషుప్తౌ నిర్విషయ ఆత్మానందోఽనుభూయతే
శ్రుతిః ప్రత్యక్ష మైతిహ్య మనుమానం చ జాగ్రతి 109

సీ॥ ప్రియము లాత్మార్థమగు నెల్ల।విషయము లిలఁ
గావు తాముగఁ బ్రియము।లుగాని యాత్మ।
ప్రియము స్వాభావికమ్ముగ।విమలచరిత !
అత్మ యత్యంత ప్రియతమ।మైనదగుట॥
విషయరహితసుషుప్తిని।వేడ్కనుండ
సంతతానందమయుఁడగు।స్వాత్మ కిలను।
దుఃఖ మెన్నఁడుఁగల్గదు।తోయజాక్ష !
శ్రుతులునైతిహ్యమును గురు।హితవచనము॥
మరియు నమమాన మనెడు ప్ర।మాణములను
జాగృతంబులు పరమాత్మ।సత్యమందు॥

అవ్యక్తనామ్నీ పరమేశశక్తిః అనాద్యవిద్యా త్రిగుణాత్మికా పరా,
కార్యానుమేయా సుధియైవ మాయా యయా జగత్సర్వమిదం ప్రసూయతే॥ 110

గీ॥ మాయ త్రిగుణాత్మిక మనాది।మహితశక్తి,
దైవిక మవిద్య ధీజన।దర్శితంబు।
మాయ యవ్యక్తము పరమ్ము।మాయవలన,
నెల్ల జగము గోచరమగు।నిహమునందు॥

సన్నాప్యసన్నాప్యుభయాత్మికా నో భిన్నాప్యభిన్నాప్యుభయాత్మికా నో,
సాఙ్గాప్యనఙ్గాప్యుభయాత్మికా నో మహాద్భుతాఽనిర్వచనీయరూపా॥ 111

గీ॥ సత్తు కాకుండియు నదియు।సత్తుకాదు,
మాయయుభయాత్మకంబని।మదినెఱుఁగుము।
భిన్నమై బ్రహ్మమునకున।భిన్నమగుచు
సాంగమయ్యనుబరగున।సంగమగుచు॥
నుభయధర్మంబులనుగూడి।యొప్పు మాయ
అద్భుతంబనిర్వచనీయ।మగుచుననఘ :

శుద్ధాద్వయబ్రహ్మవిబోధనాశ్యా
సర్పభ్రమో రజ్జువివేకతో యథా,
రజ్జుస్తమస్సత్త్వమితి ప్రసిద్ధా
గుణా స్తదీయా ప్రథితైః స్వకార్యైః 112

గీ॥ రజ్జు నెఱుఁగఁగఁ దొలఁగు సర్పమను భ్రాంతి,
తెలియ శుద్ధాద్వయబ్రహ్మఁ।దొలఁగు మాయ।
త్రిగుణములు మాయఁగల్గి త।త్క్రియలఁబరఁగు
సత్త్వతామసరాజస।సత్వశక్తి॥

విక్షేపశక్తి రజసః క్రియాత్మికా యతః ప్రవృత్తిః ప్రసృతా
పురాణీ,
రాగాదయోఽస్యాః ప్రభవన్తి నిత్యం దుఃఖాదయో యే
మనసో వికారాః 113

గీ॥ అరయఁగ రజోగుణంబు క్రియాత్మకంబు,
సర్వసృష్టి యా శక్తిచే।సంభవించు।
కలుగు నిత్యము రాగాదు।లిల నరునికి
కలుగు దుఃఖాదిచిత్తవి।కారములును॥
ప్రబలవిక్షేపశక్తిఁ బ్ర।పంచమందు॥

కామః క్రోధో లోభదంభాద్యసూయాహంకారేర్ష్యామత్సరాద్యాస్తు
ఘోరాః
ధర్మా ఏతే రాజసాః పుంప్రవృత్తి ర్యస్మాదేషా తద్రజో
బంధహేతుః 114

క॥ కామ క్రోధాసూయే
ర్ష్యామత్సరలోభదంభ।రాజసగుణముల్।
తమనుజునిబంధించెడు
ధీమతి! యివి శత్రువులని।తెలియగదయ్యా॥

ఏషాఽఽవృతిర్నామ తమోగుణస్య
శక్తిర్యయా వస్త్వవభాసతేఽన్యథా,
సైషా నిదానం పురుషస్య సంసృతే
ర్విక్షేపశక్తేః ప్రవణస్య హేతుః॥ 115

గీ॥ మోహ జనక మావరణ త।మోగుణంబు,
తోచు వస్తువన్యంబుగ।దానివలన।
ముంచెడునదిసంసార స।ముద్రమందు,
పురుషునిఁదమోగుణమ్మును।బూనినంత॥

ప్రజ్ఞావానపి పండితోఽపి చతురోఽప్యత్యంతసూక్ష్మాత్మదృక్,
వ్యాలీఢస్తమసా న వేత్తిబహుధా సంబోధితోఽపి స్ఫుటమ్,
భ్రాన్త్యారోపితమేవ సాధు కలయత్యాలంబతే తద్గుణాన్,
హన్తాసౌ ప్రబలా దురన్తతమస శ్శక్తిర్మహత్యావృతిః 116

గీ॥ ఎంత పండితుఁడైన ధీ।మంతుఁడైన,
చతురుఁడైనను సునిశిత।మతియునైన।
నతని బుద్ధిఁ దమోగుణ।మావరించ
ప్రబలమై మనమ్ము హరించుఁ।బ్రస్ఫుటముగ।
నెంత బోధించియు ఫలంబు।సుంత లేక
భ్రాంతిఁబొరపడు నిజ మన్న।భావనంబు॥

అభావనా వా విపరీతభావనా, సంభావనా విప్రతిపత్తిరస్యాః,
సంసర్గయుక్తం న విముంచతి ధ్రువంవిక్షేపశక్తిః
క్షపయత్యజస్రమ్ 117

గీ॥ బ్రహ్మమున భావనయు నసం।భావనయును,
గలుఁగ విపరీతభావము।తలఁపునందు।
ముక్తి కల్గదుసంసార।యుక్తుని కిల
క్షయము విక్షేపశక్తి ని।శ్చయముగాన॥.

అజ్ఞాన మాలస్య జడత్వ నిద్రా, ప్రమాదమూఢత్వముఖా
స్తమోగుణాః,
ఏతైః ప్రయుక్తో న హి వేత్తి కిఞ్చిన్ని, ద్రాళువత్
స్తంభవదేవ తిష్ఠతి. 118

గీ॥ అజ్ఞతజడత్వమతినిద్ర।యలసతయును
మాఢత, ప్రమాదమునిఁకఁద।మోగుణంపు।
ధర్మములు;వీనిఁగూడిన।తామసుండు
స్తంభ మటునిద్రితునటు ల।జ్ఞతను మెలఁగు॥

సత్త్వం విశుద్ధం జలవత్తథాఽపి, తాభ్యాం మిళిత్వా శరణాయ
కల్పతే,
యత్రాత్మబింబః ప్రతిబింబిత స్యన్ ప్రకాశయ
త్యర్క ఇవాఖిలం జడమ్॥ 119

గీ॥ సత్త్వగుణము విశుద్ధమౌ।సలిల మట్లు
కూడెడిని తమోరాజస।గుణములందు।
అత్మ ప్రతిబింబితంబయి।యఖలజగము
వెలుఁగఁజేసెడు సూర్యుని।విధమునిందు॥

మిశ్రస్య సత్త్వస్య భవన్తి ధర్మా స్త్వమానితాద్యా నియమా
యమాద్యాః,
శ్రద్ధా చ భక్తిశ్చ ముముక్షుతా చ దైవీ చ సమ్పత్తి
రసన్నివృత్తిః 120

గీ॥ మిశ్రసత్త్వగుణంబున। మెరయు నరుఁడు,
యమము నియమమూనిత్య।మాది ధర్మ।
ములను,భక్తియు శ్రద్ధయు।ముక్షుతలను,
దైవసంపత్తిఁగూడుక।తనరుభువిని॥
సత్త్వభాభాసుఁడగుచున।సన్నివృత్తి

విశుద్ధసత్త్వస్య గుణాః ప్రసాదః స్వాత్మానుభూతిః
పరమప్రశాన్తిః,
తృప్తిః ప్రహర్షః పరమాత్మనిష్ఠా యయా సదానన్దరసం
సమృచ్ఛతి 121

గీ॥ సత్త్వగుణధర్మములు సుప్ర।సన్నతయును
పరమశాంతియు నాత్మాను।భవముతృప్తి।
బ్రహ్మనిష్ఠ ప్రహర్షము।ల్వానికతన
నిశ్చలానందమొనగూడు।నిత్యముఁగను॥

అవ్యక్త మేత త్త్రిగుణై ర్నిరుక్తం తత్కారణం నామ
శరీరమాత్మనః,
సుషుప్తి రేతస్య విభక్తవస్థా ప్రలీనసర్వేన్ద్రియబుద్ధివృత్తిః 122

గీ॥ మూడుగుణముల నవ్యక్త।ముగనఁబడు,
మాయ,యాత్మకుఁగారణ।కాయమనఘ ।।
విగతసకలేంద్రియ మనో।ప్రవృత్తివెలయు,
నీసుషుప్త్యవస్థ నాత్మ ప్ర।త్యేకముండు॥

సర్వప్రకార ప్రమితిప్రశాన్తి ర్బీజాత్మనాఽవస్థితిరేవ బుద్ధేః,
సుషుప్తి రేతస్య కిల ప్రతీతిః కిఞ్చిన్న వేద్మీతి
జగత్ప్రసిద్ధా॥ 123

గీ॥ ఇంద్రియములన్ని యణఁగినదుఁరించినంత
బుద్ధిబీజాత్మకస్థితిఁ।బొందియుండ।
జగము మరచిసుషుప్తిలో।సర్వజనులు
ఇంచుకైన జగమును మే।మెఱుఁగమనరె॥

దేహేన్ద్రియప్రాణమనోఽహమాదయః,సర్వే వికారా విషయా
సుఖాదయః,
వ్యోమాదిభూతా న్యఖిలం చ విశ్వ మవ్యక్త పర్యన్త మిదం
హ్యనాత్మా 124

గీ॥ దేహమాదిగ నవ్యక్త।దివ్యమాయ
వరకునింద్రియంబులహంబు।వాయువాది।
భూతసంయుతమైనట్టి।భువనమెల్ల
అరయుమ యనాత్మయని నిశ్చ।యముగనింక॥

మాయా మాయాకార్యం సర్వం మహదాది దేహపర్యన్తమ్,
అస దిదమనాత్మకం త్వం విద్ధి మరుమరీచికాకల్పమ్ 125

గీ॥ దేహమాది మహత్తర।దివ్యమాయ
మాయకార్యము సర్వంబు।మానితముగ

ఆత్మకన్యం బసత్తని।యరయనగును
తెలిసి యిది మిధ్య యని మృగ।తృష్ణవోలె॥

అధ తే సంప్రవక్ష్యామి స్వరూపం పరమాత్మనః,
య ద్విజ్ఞాయ నరో బంధాన్ముక్తః కైవల్య మశ్నుతే 126

గీ॥ వినుము పరమాత్మరూపము।విశదముగను
తెల్పుచున్నాడ నెద్దాని।దెల్సినంత।
కర్మబంధవిమోచన।కలుఁగు దానఁ
బడయువారలు కైవల్య।పదమునరులు॥

అస్తి కశ్చిత్స్వయం నిత్య మహం ప్రత్యయలంబనం,
అవస్థాత్రయసాక్షీ సన్ పంచకోశవిలక్షణః. 127

ఆ.వె॥ పంచకోశములకుఁ। బ్రత్యేకమై సాక్షి,
యయి యవస్థలను న।హంబునందు।
నిత్యము విలసిల్లు।నిర్వికారుండాత్మ,
స్వయముగ నొకఁడయి।జగము మెరయు॥

యో విజానాతి సకలం జాగ్రత్స్వప్నసుషుప్తిషు,
బుద్ధి తద్వృత్తిసద్భావ మభావ మహమిత్యయమ్ 128

గీ॥ స్వప్నము,సుషుప్తి,జాగ్రద।వస్థల నిఁక
చిత్తవృత్తుల సదసద్వి।శేషములను।
నేను నా దనుభావంబు।తో నెరుంగు
నతఁడె యరయంగ సర్వాంత।రాత్మ ధరణి॥

యః పశ్యతి స్వయం సర్వం యం న పశ్యతి కశ్చన,
య శ్చేతయతి బుద్ధ్యాది న తద్యం చేతయత్యయమ్. 129

గీ॥ ఎవఁడు దానుగ దర్శించు।నెల్ల జగము,
నెవనిఁ జూడ దొకానొక।యెడల నెదియు।
నెవఁడు బుద్ధ్యాది నియమించు।నెవ్వని కిఁక,
చేతనత నీయఁజాలదు।చిత్తవృత్తి॥

యేన విశ్వమిదం వ్యాప్తం యం న వ్యాప్నోతి కించన,
ఆభారూప మిదం సర్వం యం భాన్త మనుభాత్యయమ్ 130

గీ॥ ఎవనిచేతఁ బరివ్యాప్త।మెల్ల జగము,
ఎవనియందున వ్యాపించి।దెయ్యదియును।
ఎవని కాంతిని వెలుఁగొందు।నెల్ల జగము,
అతఁడె యరయంగ సర్వాంత।రాత్మ యనఘ॥

యస్య సన్నిధిమాత్రేణ దేహేన్ద్రియ మనోధియః
విషయేషు స్వకీయేషు వర్తన్తే ప్రేరితా ఇవ 131

గీ॥ ఎవని సన్నిధి దేహబుద్ధీంద్రియములు,
తమదు విషయములందు సుదారముగను
ప్రేరితములయి వర్తిల్లుఁ బృథ్వియందు
నతఁడె యరయంగ సర్వాంతరాత్మ యనఘ ॥

అహంకారాది దేహాన్తా విషయాశ్చ సుఖాదయః,
వేద్యన్తే ఘటవ ద్యేన నిత్యబోధస్వరూపిణా 132

గీ॥ అహము మొదలుగ దేహపర్యంతవిషయ
ములను, శీతోష్ణసుఖదుఃఖములను ఘటము
గా నెఱింగెడు నిత్యవిజ్ఞానరూపుఁ
డతఁడె యరయంగ సర్వాంతరాత్మ యనఘ ॥

ఏషోఽన్తరాత్మా పురుషః పురాణో
నిరన్తరాఖండసుఖానుభూతిః,
సదైకరూపః ప్రతిబోధమాత్రో,
యేనేషితా వాగసవ శ్చరన్తి 133

గీ॥ అంతరాత్మ సనాతనుండద్వితీయ,
సచ్చిదానందమూర్తి ప్రశాంతపురుషుఁ,
డెవఁడు ప్రతిబోధమాత్రకుఁడెవనియిష్ట,
వర్తులై వర్తిలెడిని వాక్ప్రాణములును

అత్రైవ సత్త్వాత్మని ధీగుహాయా మవ్యాకృతాకాశ ఉరుప్రకాశః,
ఆకాశ ఉచ్చైః రవివత్ప్రకాశతే స్వతేజసా విశ్వమిదం
ప్రకాశయన్ 134

గీ॥ ధీగుహాంతర గగనంబు। దివ్యకాంతి,
శుద్ధసత్త్వాత్మ వెల్గెడు। శోభనముగ।
విశ్వమున కెల్లఁగాంతిని। వెల్గుచౌనఁగు
భాస్కరునివలె సత్త్వాత్మ। భాసకమ్ము॥

జ్ఞాతా మనోఽహంకృతివి క్రియాణాం
దేహేన్ద్రియ ప్రాణకృత క్రియాణామ్,
అయోఽగ్నివత్తా వనువర్తమానో
న చేష్టతే నోఽవి కరోతి కిఞ్చన 135

సీ॥ కను చహంకారచిత్తవి,కారములను,
కాయ ప్రాణేం ద్రియంబుల। కర్మములకు।
జ్ఞాతయై తనరెడు నాత్మ। సాక్షియయ్యు
ఇనుము గూడిన ఘనవహ్ని। రీతి నాత్మ
కర్త గాదు వికారము। గాంచ దనఘ ॥

న జాయతే మ్రియతే న వర్ధతే న క్షీయతే నోఽవి కరోతి నిత్యః,
విలీయమానేఽపి వపుష్యముష్మిన్ న లీయతే కుంభ
ఇవాంబరం స్వయమ్ 136

ఆ॥ చావు పుట్టుకలును। క్షయవృద్ధులను లేవు
అరయ లేవు వికృతు। లాత్మ కెపుడు।
శిథిలమైనఁ దనువు। చెదరకుండున దాత్మ
ఘటము చెడినఁ జెడని। గగన మటుల॥

ప్రకృతి వికృతి భిన్న శ్శుద్ధ బోధ స్వభావ-
స్సదస దిద మశేషం భాసయ న్నిర్విశేషః,
విలసతి పరమాత్మా జాగ్రదాదిష్వవస్థా-
స్వహమహ మితి సాక్షాత్సాక్షిరూపేణ బుద్ధేః 137

ఆ.వె॥ ప్రకృతి వికృతులకును। బరమగు పరమాత్మ
శుద్ధ బోధ రూప। శోభితమ్ము।
సదసదాఖ్య విశ్వ। సంకాశకము జాగ్ర
దాద్యవస్థల నహ। మహ మటంచు॥
ఆత్మ సాక్షి తనువు। నంతఃకరణమున
కనుచుఁ దెలియవలయు। నమలచరిత॥

నియమితమనసాఽముం త్వం స్వమాత్మానమాత్మ,
న్యయమహమితి సాక్షాద్విద్ధి
బుద్ధి ప్రసాదాత్। జని మరణతరంగాపారసంసారసిన్ధుమ్, ప్రతర
భవ కృతార్థో బ్రహ్మరూపేణ సంస్థః॥ 138

చ॥ నియతమనంబుతోడ మన। నిర్మల చిత్తము తో నెరుంగుమా,
స్వయముగ నే ననంబడెడు। సాక్షిని యాత్మను నిత్యసత్యమున్।
రయముఁ గృతార్థతం బరమ। బ్రహ్మపదాంకిత మానసంబునన్
భయద భవార్ణవంబుఁ గడు।వంగదె శాశ్వతసౌఖ్య మందగన్॥

## అ ధ్యా స

అత్రానాత్మ న్యహమి తి మతేర్బంధ ఏవాస్య పుంసః
ప్రాప్తోఽ జ్ఞానా జ్జనన మరణ క్లేశ సమ్పాత హేతుః,
యేనై వాయం వపురిదమ సత్సత్య మిత్యాత్మ బుద్ధ్యా,
పుష్యత్యుక్షత్యవతి విషయైస్త మభిః కోశకృద్వత్॥ 139

చ॥ తలఁచి యనాత్మ నేననుచుఁ। దాఁ బడుసంభవమృత్యు కష్టబం,
ధుర భవబంధ జాలమున। దుర్బలతం బరమాత్మ నెంచకన్।
పొలుపుగ సాలెపుర్వు కడు। పూనిక గూడు రచించి చిక్కు రీ
తుల విషయాది తంతువులఁ। దోషణ పోషణమజ్జనాదికం
బులఁ దనియించుచుందనువు। బుద్ధిని సత్యమటంచు దేహమున్॥

అతస్మిం స్తద్బుద్ధిః ప్రభవతి విమూఢస్య తమసా
వివేకాభావాద్వై స్ఫురతి భుజగే రజ్జుధిషణా,
తతోఽనర్థవ్రాతో నిపతతి సమాధాతు రధిక
స్తతో యోఽసద్గ్రాహ స్స హి భవతి బంధ శ్శృణు సఖే 140

గీ॥ త్రాడుఁగని సర్పమని మదిఁదలఁచు మూఢు
డజ్ఞత వివేకహీనుఁడై యటులె సత్య
మని యసత్తును దలఁచి యనర్థములను
బడు నసద్గ్రాహమే భవ బంధనంబు॥

అఖండ నిత్యాద్వయ బోధ శక్త్యాస్ఫురన్త మాత్మాన
మనన్త వైభవమ్,
సమావృణో త్యావృతిశక్తి రేషా తమోమయీ రాహు
రివార్కబింబమ్ 141

గీ॥ భానుఁ గప్పెడునట్టి స్వర్భాను పగిది
అద్వయజ్ఞానభాసు ననన్త విభవు
నిత్యు నాత్మ సనాతను సత్యతేజు
నావరించు తమోమయమైన మాయ॥

తిరోభూతే స్వాత్మ న్యమలతర తేజోవతి పుమాన్
అనాత్మానం మోహా దహమితి శరీరం కలయతి,
తతః కామః క్రోధః ప్రభృతిభి రముంబంధనగుణైః
పరం విక్షేపాఖ్యారజస ఉరుశక్తి ర్వ్యథయతి 142

గీ॥ అమలతేజోమయంబగునాత్మ మాయ,
మరుగుపడినంత మనుజుఁడు మదిఁ దలంచు
నే ననుచు దేహముంగని దానఁజేసి
పట్టువడి కామ క్రోధాది బంధనముల॥
వెతల నొందెడు రాజసోద్ధతిని నరుఁడు॥

మహామోహగ్రాహ గ్రసనగళితా త్మావగమనో,
ధియో నానాఽవస్థాం స్వయమభినయన్ సద్గుణతయా,
అపారే సంసారే విషయవిషపూరే జలనిధౌ
నిమజ్జ్యోన్మజ్జ్యాయం భ్రమతి కుమతిః కుత్సితగతిః 143

గీ॥ కుమతి విస్మృతాత్ముండైన। కుత్సితుండు
మోహ మకరము మ్రింగిన। మూఢజనుఁడు।
విషయ విషపూర్ణ సంసార। భీషణాబ్ధిఁ
గొట్టుమిట్టాడు భ్రమణము। కుదుటపడక॥

భానుప్రభాసంజనితాభ్రపంక్తి ర్భానుం తిరోధాయ విజృంభతే యథా,
ఆత్మోదితాహంకృతి రాత్మ తత్త్వం తథా తిరోధాయ విజృంభతే స్వయమ్ 144

గీ॥ జలజమిత్ర ప్రతాప సం।జనిత మేఘ
మాల జలజాప్తుఁగప్పెడి।మాడ్కి నిహము।
నాత్మజనిత మహంకార। మాత్మ తత్త్వ
మును విజృంభించి కప్పెడు। మోహనముగ॥

కలుశితదిననాథే దుర్దినే సాన్ద్రమేఘై ర్వ్యథయతి హిమఝంఝూవాయురుగ్రో
యథై తాన్। అవిరతతమసాఽఽత్మన్యావృతే మూఢబుద్ధిం, క్షపయతి
బహుదుఃఖై స్తీవ్రవిక్షేప శక్తిః 145

గీ॥ మిత్రుఁగప్పిన దుర్దిన। మేఘములను
శీతఝంఝానిలమ్ములు। చెరచునటుల।
మోహ తిమరావృతాత్ముని। మూఢబుద్ధి
క్లేశము నశించుఁ దీవ్ర వి।క్షేపశక్తి॥

ఏతాభ్యామేవ శక్తిభ్యాం బన్ధః పుంసస్సమాగతః,
యాభ్యాం విమోహితో దేహం మత్వాஉஉత్మానం
భ్రమత్యయమ్ 146

గీ॥ ఎట్టి నిక్షేపశక్తిచేఁ జుట్టఁబడుట
తనువు నే నని మోహానఁ దలఁచు నరుఁడు
అట్టి రాజస శక్తుల నజ్ఞతయును
బంధనములును గల్గెడు భవమునందు॥

బీజం సంసృతిభూమిజస్య తు తమో దేహాత్మధీ రంకురః
రాగః పల్లవ మమ్బుకర్మ తు వపుస్కన్ధోஉసవశ్శాఖికాః,
అగ్రాణీన్ద్రియ సంహతి శ్చ విషయాః పుష్పాణి దుఃఖం ఫలం
నానాకర్మసముద్భవం బహువిధం భోక్తాஉత్ర జీవః ఖగః 147

గీ॥ బీజ మజ్ఞత సంసారవృక్షమునకు,
ఆత్మ దేహమనెడి బుద్ధియంకురంబు
జలము కర్మరాగాది కిసలయమింక
తనువు కాండము ప్రాణముల్ దాని శాఖ
లింద్రియసమూహ మగ్రము లింక విషయ
సంచయము పుష్పగుచ్ఛముల్ సకలవిధము
లైన కర్మసముద్భవమైన దుఃఖ,
ము ఫలమగు జీవుఁడను పక్షి భోక్తయచట॥

అజ్ఞానమూలోஉయ మనాత్మ బంధో నైసర్గికోஉనాది రనంత
ఈరితః,
జన్మాప్యయవ్యాధి జరాది దుఃఖప్రవాహపాతం
జనయత్యముష్య 148

గీ॥ అజ్ఞతామూలమైన యనాత్మబంధ,
నం బనాద్యం బ నంతంబు నరున కరయు
జన్మమృత్యు జరావ్యాధి సకలదుఃఖ
చయముఁ బడ హేతువరయ న జ్ఞతయె యనఘ!

## ఆత్మానాత్మ వివేకము

నాఽస్త్రైర్న శస్త్రైరనిలేన వహ్నినా ఛేత్తుం న శక్యో న చ కర్మ కోటిభిః
వివేకవిజ్ఞానమహాసినా వినా ధాతుః ప్రసాదేన సితేన మఞ్జునా॥ 149

గీ॥ ఈశ్వరుని కృపను వివేక ప్రేషితమగు
జ్ఞాన నిశితాసి ధారలఁ గాక త్రుంచ
శక్యమే కర్మబంధము శస్త్రములను
అస్త్రముల మారుతంబుల నగ్నిచేత॥
కోటి కర్మల నజ్ఞతఁ గోయనగునె॥

శ్రుతి ప్రమాణైకమతే స్స్వధర్మ నిష్ఠాతయై వాత్మవిశుద్ధి రస్య,
విశుద్ధబుద్ధేః పరమాత్మ వేదనం తేనైవ సంసారసమూలనాశః 150

గీ॥ వేద ప్రామాణికంబగు విహితకర్మ,
నాత్మపరిశుద్ధమగు శుద్ధమైనయాత్మ
మోహ సంప్రాప్త సంసారమూలనాశ
మునను బరమాత్మఁ దెలియంగ మోక్షమొదవు॥

కోశై రన్నమయాద్యైః పంచభిరాత్మా న సంవృతో భాతి,
నిజశక్తి సముత్పన్నైః శైవాలపటలైరివామ్బు వాపీస్థమ్ 151

గీ॥ ఆత్మశక్తి సముత్పన్న। మైనయట్టి
పంచ కోశావృతంబుగ।బరగు నాత్మ।
నాచుపట్టిన కూపమ్ముఁ। దోచనట్టి
నీరమటులుగ గన్పించ।నేర దనఘః

తచ్ఛైవాలాపనయే సమ్యక్సలిలం ప్రతీయతే శుద్ధమ్,
తృష్ణా సంతాపహరం సద్యస్సౌఖ్యప్రదం పరం పుంసః 152

గీ॥ నాచుఁదొలఁగించ నీరము।తోచు రీతి
జ్ఞానఖడ్గానఁ బంచకో।శములఁ ద్రుంచ।
తాప తృష్ణోపశమనంబు। పాపహరము
సుఖదమగు నట్టి పరమాత్మఁ। జూడనొప్పు॥

పంచానామపి కోశానా మపవాదే విభాత్యయం శుద్ధః
నిత్యానందైక రసః ప్రత్యగ్రూపః పరం స్వయం జ్యోతిః 153

గీ॥ పంచ కోశావృతంబనఁ।బరఁగు నిత్య
శుద్ధ సచ్చిదానందైక। సుఖరసంబు।
ప్రత్యగాత్మ స్వరూపంబు। బ్రహ్మమయము
స్వయము వెల్గెడు జ్యోతి ని।శ్చయముగాను॥

ఆత్మానాత్మ వివేకః కర్తవ్యో బంధముక్తయే విదుషా,
తేనైవానందీ భవతి స్వం విజ్ఞాయ సచ్చిదానందమ్ 154

గీ॥ విబుధుఁ డాత్మ కనాత్మకు। భేధ మరయు
బంధ మోక్షంబు నక్షయి ప్ర।పంచమందు।
సచ్చిదానందరూపుని। స్వానుభూతి
తెలిసి యానందవార్ని ధి॥దేలు బుధుఁడు॥

ముంజాదిషీకామివ దృశ్యవర్గా, త్ప్రత్యంచ మాత్మాన మసంగ
మక్రియమ్
వివిచ్య తత్ర ప్రవిలాప్య సర్వం తదాత్మనా తిష్ఠతి య స్స
ముక్తః 155

గీ॥ ముంజ వలిచినఁగన్పట్టు। మోగురీతి
దృశ్యవర్గముఁ దొలఁగింపఁ। దెలియఁబడెడు।
నక్రియుం డవ్యయుఁ డసంగుఁ।డైన యాత్మ
అందు నెలకొని ముక్తుఁడౌ। నతఁడు ధరణి॥

## పంచకోశములు

దేహోఽయ మన్నభవనోఽన్నమయస్తు కోశ, శ్చాన్నేన
జీవతి వినశ్యతి
తద్విహీనః, త్వక్చర్మమాంసరుధిరాస్థి పురీషరాశి ర్నాయం
స్వయం భవితుమర్హతి నిత్యశుద్ధః 156

ఆ.వె॥ అన్నభవము దేహ।మన్నాన జీవించు
నన్న హీనమైన। నంతరించు।
అన్నమయ మిదగుట।నన్న కోశంబంద్రు
అరయు మిదియ సత్తు।టంచునింక॥
మాంసచర్మరుధిర। మలమూత్ర రాశియౌ
తనువు నాత్మ యనుట।తగదు శిష్య॥

పూర్వం జనేరపి మృతేరపి నాయమస్తి,
జాతక్షణః క్షణగుణోఽ నియతస్వభావః,
నైకో జడశ్చ ఘటవత్ప్రతిదృశ్యమానః,
స్వాత్మా కథం భవతి భావ వికారవేత్తా 157

గీ॥ లేదు పుట్టక పూర్వము। లేదు మరణ
మునకుమీదట పురుషున। కనఘ! తనువు।
క్షణిక మనియతగుణభావ। సంయుతమ్ము
జడమనేక ముమృద్ఘట। సదృశమట్టి॥
తనువు భావజ్ఞుఁడగునాత్మ। యనుటయెట్లు?॥

పాణిపాదాదిమాన్ దేహో నాత్మా వ్యంగోఽపి జీవనాత్,
తత్తచ్ఛక్తే రనాశాచ్చ న నియమ్యో నియామకః 158

గీ॥ కాలుసేతులు నితరయం।గములు గలుఁగ
కలుఁగకున్నను జీవించ॥గలుఁగుఁ దనువు॥
అంతమాత్రానఁ దను వాత్మ। యనగ నగునె?
శాసితము తను వాత్మత।చ్ఛాసకమ్ము॥

దేహతద్ధర్మతత్కర్మతదవస్థాదిసాక్షిణః।,
స్వత ఏవ స్వతస్సిద్ధం తద్వైలక్షణ్య మాత్మనః 159

శల్యరాశి ర్మాంసలిప్తో మలపూర్ణోఽతికశ్మలః,
కథం భవే దయం వేత్తా స్వయ మేతద్విలక్షణః 160

గీ॥ ధర్మకర్మంబులందవ స్థలనుసాక్షి,
తానుగ విలక్షణుం డాత్మ। తనువునకును।
మాంసమయ శల్యమలమాత్ర।మలినదేహ
మరయఁగ విలక్షణుండగు।నాత్మ యగునె?॥

త్వఙ్మాంసమేదోస్థిపురీషరాశా వహంమతిం మూఢజనః కరోతి,
విలక్షణః వేత్తి విచారశీలో నిజస్వరూపం పరమార్థభూతమ్ 161

గీ॥ చర్మ మేదోపురీషాస్థి। శల్యమాంస
మయశరీరంబు నే నను। మదిని మూఢుఁ
డాత్మ భిన్నుఁడు తనువున। కనుచు విజ్ఞుఁ
డాత్మ రూపముఁ దనలోన। నరయుచుండు॥

దేహోఽహ మిత్యేవ జడస్య బుద్ధి ర్దేహే చ జీవే విదుష స్త్వహంధీః,
వివేకవిజ్ఞానవతో మహాత్మనో బ్రహ్మాహ మిత్యేవ మతిః
సదాత్మనః 162

గీ॥ దేహమును నేనని తలంచుఁ। దెలివిహీనుఁ
డేననుచు జీవు దేహంబు। నెంచు బుధుఁడు,
బ్రహ్మమే నేనని తలంచు। భావమునను
విమలమతి మహాత్ముఁడగు వి।వేకపరుడు॥

అత్రాత్మ బుద్ధిం త్యజ మూఢబుద్ధే త్వఙ్మాంస
మేదోఽస్థిపురీషరాశౌ,
సర్వాత్మని బ్రహ్మణి నిర్వికల్పే, కురుష్వ శాన్తిం పరమాం
భజస్వం 163

గీ॥ చర్మ మేదోపురీషాస్థి।శల్యమాంస,
మయశరీరంబు నేనను।మతిని మాని।
నిత్య సర్వాత్మ బ్రహ్మంబు। నిర్వికల్ప,
నే ననుచు నెంచి శాంతి సు।ఖించు బుధుఁడు॥

దేహేన్ద్రియాదావసతి భ్రమోదితాం, విద్వా నహన్తాం న జహాతి
యావత్,
తావన్న తస్యాస్తి విముక్తివార్తా, ప్యస్త్వేష
వేదాన్తనయా న్తదర్శి 164

గీ॥ భ్రమను దేహము నేననుభావనమును,
సర్వమును వీడు విజ్ఞుఁడుసాత్త్వికతను।
వీడక యదెంత వేదాంతవేత్తయైన
ముఁదలనొందడు భవబంధముక్తికొరకు॥

ఛాయాశరీరే ప్రతిబింబగాత్రే, యత్స్వప్నదేహే హృది
కల్పితాంగే,
యథాఽఽత్మబుద్ధి స్తవ నాస్తి కాచి, జీవచ్ఛరీరే చ తథైవ
మాఽస్తు 165

శా॥ ఛాయాదేహము బింబగాత్రము నిఁకన్।స్వప్నాంతరం బైనదా
కాయంబున్ హృదయాబ్జకల్పనకృతాం।గంబున్ మనంబం దెటుల్।
నా యాత్మంచుఁదలంచమో యటులనే। నానావికారాళిచే,
హేయంబౌ తను వాత్మయం చనకుమా।యీ జాగరూకస్థితిన్॥

దేహాత్మధీ రేవ నృణామసద్ధియాం, జన్మాదిదుఃఖప్రభవస్య బీజమ్।
యత స్తత స్త్వం జహి తాం ప్రయత్నాత్, త్యక్తే తు చిత్తే న
పునర్భవాశా 166

అ.వె॥ తనువు నాత్మయంచుఁ।దలఁచు నసద్బుద్ధి
జన్మమృత్యుదుఃఖ।చయమున కిల।
బీజ మట్టి బుద్ధి।విడువుము యత్నించి
విడువఁ దెగెడు భవము।వినుము కుఱ్ఱ!

కర్మేన్ద్రియైః పంచభి రంచితోఽయం ప్రాణో
భవేత్ప్రాణమయస్తు కోశః,
యే నాత్మవానన్నమయోఽన్నపూర్ణా, ప్రవర్తతేఽసౌ
సకలక్రియాసు॥ 167

గీ॥ ఐదు కర్మేంద్రియంబులు నమరఁ గలిసి
ప్రాణమగుఁ బ్రాణకోశము ప్రతిదినమ్ము
నన్న భరితమగుట నగు నన్న కోశ
మాత్మవంతము సర్వ క్రియాత్మకంబు॥

నైవాత్మాఽపి ప్రాణమయో వాయువికారో,
గన్తాఽఽగన్తా వాయువద న్తర్బహిరేషః,
యస్మాత్కించి త్క్వాపి న వేత్తీమనిష్టం,
స్వం వాఽన్యం వా కిఞ్చన నిత్యం పరతన్త్రః 168

గీ॥ వాయువికృతులనొప్పెడు ప్రాణకోశ
మాత్మ కాదది పరతంత్ర మనవరతము
శ్వాస గాదది, స్వపరవిచక్షణమ్ము
లేని దిష్ట మయిష్టంబు లేనిదగుట॥

జ్ఞానేంద్రియాణి చ మనశ్చ మనోమయ స్స్యాత్
కోశో మమాహ మితి వస్తువికల్పహేతుః, 169
సంజ్ఞాది భేదకలనా కలితో బలీయాం
స్తత్పూర్వకోశ మభిపూర్య విజృంభతే యః

గీ॥ ప్రాణకోశమును విజృంభ పరచినించి,
సౌంజ్ఞభేద ప్రకల్పనా సంయుతమయి
మఱియు జ్ఞానేంద్రియంబులు మానసమను
కోశమై నేను వాదను కొవెడు భ్రాంతి

పంచేంద్రియైః పంచభిరేవ హోతృభిః
ప్రచీయమానో విషయాజ్యధారయా,
జాజ్వల్యమానో బహువాసనేన్ధనైః
మనోమయాగ్ని ర్దహతి ప్రపంచమ్ 170

గీ॥ పంచ జ్ఞానేంద్రియ మహాగ్ని। పంచకంబు
విషయ ఘృతధార హృదయాగ్ని। వ్రేల్చి వివిధ।
వాసనేంధనములఁ జేయఁ। బ్రజ్వరిల్లి
చెలఁగి హృదయాగ్ని భస్మంబు। సేయు జగతి॥

న హ్యస్త్యవిద్యా మనసోఽతిరిక్తా
మనో హ్యవిద్యా భవబన్ధహేతుః,
తస్మిన్వినష్టే సకలం వినష్టం
విజృంభతేఽస్మి న్సకలం విజృంభతే 171

గీ॥ మనసు కన్నను మించిన। మాయ లేదు,
మానసావిద్య భవబంధ। మహితహేతు।
వది నశించిన జగమెల్ల। నంతరించు,
చెలఁగెనా మతి సకలవి। జృంభణమగు॥

స్వప్నేఽర్థశూన్యే సృజతి స్వశక్త్యా
భోక్త్రాదివిశ్వం మన ఏవ సర్వమ్,
తథైవ జాగ్రత్యపి నో విశేష
స్తత్సర్వ మేతన్మనసో విజృంభణమ్ 172

గీ॥ స్వయముగ మది సృజించెడు। స్వప్న జగము,
జాగృతస్థితి వే రనఁ। జనునె మనకు।
కార్యకారణకర్తృసం। కలితవిశ్వ
మంతయును మానసికకార్య। మరయ ననఘ॥

సుషుప్తికాలే మనసి ప్రలీనే, నైవాస్తి కిఞ్చి త్సకలప్రసిద్ధేః,
అతో మనఃకల్పిత ఏవ పుంస, స్సంసార ఏతస్య న
వస్తుతోఽస్తి 173

గీ॥ మనసు విలయము దానగు। మానితముగ,
పురుషుని సుషుప్త్యవస్థ సం। పూర్ణముగను।
భవము నిజముగ మానసో।ద్భవముగాన,
కలుఁగ దది వాస్తవము మది। కల్గకున్న॥

వాయునా నీయతే మేఘః పునస్తేనైవ నీయతే,
మనసా కల్ప్యతే బంధో మోక్షస్తేనైవ కల్ప్యతే 174

గీ॥ పవనవేగము గ్రమ్మెడి।వారిదములు
తొలఁగెడు ప్రభంజనముల। త్రోపువడుచు।
మదిని గల్పనఁగల్గెడు। మహితబంధ
ములు తొలఁగు మదికల్పించు। మోక్షమునకు॥

దేహాది సర్వవిషయే పరికల్ప్య రాగం
బధ్నాతి తేన పురుషం పశువద్గుణేన,
వైరస్య మత్ర విషవత్సువిధాయ పశ్చా
దేనం విమోచయతి తన్మన ఏవ బంధాత్ 175

గీ॥ దేహమాదివిషయములఁదిరుగు మనసు
రాగమును గూర్చి పశువును।రజ్జుకరణి।
మనుజు బంధించుచున్నది;।మరల నదియె
విషయవిముఖతఁగూరిచి। విషమున వలె
బంధనము లూడ్చు, చిత్తము।బాగుచేసి॥

తస్మాన్మనః కారణ మస్య జన్తోః, బన్ధస్య మోక్షస్య వా విధానే,
బన్ధస్య హేతుః మలినం రజోగుణైః, మోక్షస్య శుద్ధం
విరజస్తమస్కమ్ 176

గీ॥ బంధమోక్షములకు నీ ప్రపంచమందు,
మనసు హేతు వికరజస్తమ మలినమగు।
మనసు బంధనహేతువు। మానితముగ।
మోక్షహేతువు నిర్మలబుద్ధి యనఘ॥

వివేకవైరాగ్యగుణాతిరేకా చ్ఛుద్ధత్వమాసాద్య మనోవిముక్త్యై,
భవత్యతో బుద్ధిమతో ముముక్షో, స్తాభ్యాం దృఢాభ్యాం
భవితవ్యమగ్రే

గీ॥ సద్వివేకము, వైరాగ్య। సంపదనిల
బుద్ధి, పరిశుద్ధమయ్యెడు। మోక్షమొదవు।
బుద్ధిమంతులౌ మోక్షకాములకు భువిని
ప్రబలమొనరింపవలయు నీ। భావసముల॥

మనో నామ మహావ్యాఘ్రో విషయారణ్య భూమిషు,
చరత్యత్ర న గచ్ఛంతు సాధవో యే ముముక్షవః 178

మనః ప్రసూతే విషయానశేషాన్, స్థూలాత్మనా
సూక్ష్మతయా చ భోక్తుః,
శరీరవర్ణాశ్రమజాతిభేదాన్ గుణక్రియా హేతు
ఫలాని నిత్యమ్ 179

గీ॥ మానసంబను బెబ్బులి।మరంగి తిరుగు
విషయవన భూమిఁజొరరాదు। విబుధవరులు।
మోక్షకాంక్షాపరాయణుల్। బుధవరేణ్య।
జాతివర్ణాశ్రమశరీరః సహజభేద
ములను గుణకర్మకారణ।ముల ఫలముల,
స్థూల సూక్ష్మ తనువులకు। శోభనముగ
భోక్తయగునట్టి జీవాత్మ। భోగమునకు॥
మనసు కల్పించు విషయాల। మహితవిధిని॥

అసంగచిద్రూప మముం విమోహ్య
దేహేంద్రియ ప్రాణగుణై ర్నిబధ్య,
అహంమమేతి భ్రమయ త్యజస్రం
మనస్స్వకృత్యేషు ఫలోప భుక్తిషు 180

గీ॥ నిత్య నిస్సంగ చిద్రూప। నిర్మలాత్మ
మోహితు నొనర్చి మదిఁ గృత్యములు ఫలము-ల।
ప్రాణదేహేంద్రియగుణని।బద్ధుఁ జేసి
నేను నా దను భావన నించు। భ్రాంతి॥

అధ్యాసదోషా త్పురుషస్య సంసృతి
రధ్యాసబంధ స్త్వముసైవ కల్పితః,
రజ స్తమోదోషవతో ఽవివేకినో,
జన్మాదిదుఃఖస్య విదానమేతత్ 181

గీ॥ కలుఁగుఁ బురుషుని కధ్యాస। నిలను భవము,
బంధ మధ్యాస మనసు క।ల్పనము సేయు।
మది రజ స్తమ గుణగణ। మలినమగుట,
మూఢజన దుఃఖముల కది। మూలమనఘ॥

అతః ప్రాహుర్మనోఽవిద్యాః పణ్డితా స్తత్త్వదర్శినః,
యేనైవ భ్రామ్యతే విశ్వం వాయునేవా భ్రమండలమ్ 182

గీ॥ విమల తత్త్వార్థ విదులగు। విబుధవరులు,
మానసము నం ద్రవిద్యయు। మాయ యంచు।
నంబుదచయంబుఁ గర్షించు। ననిలమట ల,
మాయ భ్రమింపఁ జేసెడు। మహిఁ జగతి॥

తన్మనశ్శోధనం కార్యం ప్రయత్నేన ముముక్షుణా,
విశుద్ధే సతి చైతస్మి న్ముక్తిః కరఫలాయతే 183

గీ॥ అట్టి మానస శోధనం। బనెడుఁ గార్య
మవసరంబు ముముక్షుల। కవనియందు।
మనసు పరిశుద్ధమైనట్టి। మాన్యులకును
ముక్తి కరతలామలకంబు। పుణ్యచరిత॥

మోక్షైకసక్త్యా విషయేషు రాగం, నిర్మూల్య సంన్యస్య చ
సర్వకర్మ,
సచ్ఛ్రద్ధయా యః శ్రవణాదినిష్ఠో రజస్స్వభావం స ధునోతి
బుద్ధేః॥ 184

గీ॥ విషయతతియందురాగము। విడిచి జగతి
సర్వకర్మలఁజక్కఁగ। సన్యసించి।
సకల శ్రవణాది నిష్ఠల। శ్రద్ధఁగల్గి
మోక్షకాంక్షాభిరతుఁడగు। బుధవరుండు॥
రాజసవిదూర భావుఁడౌ। రమ్యబుద్ధి॥

మనోమయో నాపి భవేత్పరాత్మా హ్యాద్యన్తవత్త్వాత్పరిణామి
భావాత్,
దుఃఖాత్మకత్వా ద్విషయత్వహేతోః ద్రష్టా హి దృశ్యాత్మతయా
న దృష్టః 185

గీ॥ ధరమనోమయకోశమాద్యంత వంత
మరయఁబరిణామి, సంతాపకరము విషయ।
హేతువగుటఁ జిదాత్మగ। నెన్నరాదు
ద్రష్ట దృశ్యంబులొకటని। తలఁచరాదు॥

బుద్ధిఃబుద్ధీన్ద్రియైస్సార్ధం సవృత్తిః కర్తృలక్షణః,
విజ్ఞానమయకోశ స్స్యా త్పుంస స్సంసారకారణమ్, 186

గీ॥ బుద్ధి, వృత్తి, బుద్ధీంద్రియములును గూడి,
జ్ఞానకోశము, కర్తృలక్షణ యుతమ్ము।
పురుషునికి జ్ఞానకోశము భువనమందు
కారణము మహాఘోర సంసారమునకు॥

అనువ్రజచ్చిత్ప్రతిబింబశక్తిః, విజ్ఞానసంజ్ఞః ప్రకృతేర్వికారః,
జ్ఞానక్రియావానహమిత్యజస్రం దేహేంద్రియాదిష్వభిమన్యతే
భృశమ్ 197

గీ॥ అరయు విజ్ఞానమయకోశ మనుసరించు
నాత్మ ప్రతిబింబశక్తి యనంతమైన
జ్ఞానసంజ్ఞక ప్రకృతి వికారయుతము
జ్ఞానవంతుఁడఁ గర్మిష్ఠినే ననియెడు
తనువు నింద్రియాదులం బ్రేమఁగనెడు నెపుడు॥

అనాదికాలోఽయ మహంస్వభావో, జీవస్సమస్తవ్యవహారవోఢా,
కరోతి కర్మాణ్యపి పూర్వవాసనః పుణ్యాన్యపుణ్యాన్యపి
తత్ఫలాని॥ 198

గీ॥ అఖిల వ్యవహార దక్షుఁడనాదికాల,
జీవుఁ డాత్మ స్వభావుఁడై చేయు నెల్ల
కర్మములఁ బూర్వవాసనఁగలిగి; పాప
పుణ్యఫలముల భుజియించు భోక్త యతఁడు॥

భుక్తే విచిత్రాస్వపి యోనిషు వ్రజ
న్నాయాతి నిర్యాత్యధ ఊర్ధ్వ మేషః,
అస్యైవ విజ్ఞానమయస్య జాగ్ర,
త్స్వప్నాద్యవస్థా స్సుఖదుఃఖభోగః 199

గీ॥ పుట్టి బహువిధ యోనులం। బూర్వకర్మ
ఫలము భోగించు జీవుండు। భవమునందు।
స్వర్గనరకములకు మధ్య।సంచరించు
జ్ఞానకోశస్థుం డిల నవ।స్థా త్రయమున॥
సుఖము దుఃఖములను బొందు। సుమతి వినుము॥

దేహాది నిష్ఠా శ్రమ ధర్మ కర్మగుణాభిమానస్సతతం మమేతి,
విజ్ఞానకోశోఽయ మితి ప్రకాశః ప్రకృష్టసాన్నిధ్యవశాత్పరాత్మనః
అతో భవత్యేష ఉపాధిరస్య యదాత్మధీస్సంసరతి భ్రమేణ॥ 190

గీ॥ తనువు, గుణముల, నాశ్రమ। ధర్మములను
నిత్య కర్మల నావని। నిరత మెంచు।
జ్ఞానకోశము పరమాత్మ। సన్నిధాన
వశ మమిత కాంతివంతము,। భ్రాంతిచేత॥
నాత్మబుద్ధిని జరియించు।నట్టి జ్ఞాన
కోశమాత్మ కుపాధియౌ౦॥ గువలయంబు॥

యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృది స్ఫురత్యయంజ్యోతిః।
కూటస్థ స్స న్నాత్మా కర్తా భోక్తా భవత్యుపాధిస్థః॥ 191

గీ॥ జ్ఞానకోశమ్ముం బ్రాణము। మానసమ్ము
జ్యోతియై వెల్గుం గూటస్థ।శుద్ధుండాత్మ।
జ్ఞానకోశ ముపాధిగం।గల్గు కతన
కర్తగను భోక్తగను దానె।కానుపించు॥

స్వయం పరిచ్ఛేద ముపేత్య బుద్ధేస్తాదాత్మ్యదోషేణ పరం మృషాత్మనః
సర్వాత్మక స్సన్నపి వీక్షతే స్వయం స్వతః పృథక్త్వేన మృదో ఘటానివ 192

గీ॥ బుద్ధితాదాత్మ్యదోషముఁ।బొందినట్టి
స్వీయ పరిచ్ఛేదమును జేసి। సకలజగము।
సర్వభూతాత్మకుండును।స్వాత్మయైన
పరుఁ డగోచరుఁడై నటి। బ్రహ్మమునకు॥
నవ్యముగ నెంచు మానవు।డవనియందు
ఘటము మృత్తిక వేరను। కరణి శిష్య !॥

ఉపాధిసంబంధవశా త్పరాత్మా హ్యుపాధిధర్మా ననుభాతి తద్గుణః,
అయోవికారా నవికారి వహ్ని వత్సదై కరూపోఽపరస్స్వభావాత్ ।93

గీ॥ హృదిని నెలకొన్న కతమున।హృదయధర్మ
ములను గొనియెడుఁ బరమాత్మ। బుధవరేణ్య !
వహ్ని గొనునట్లయోఖండ। భావములను
తాను దదుపాధి ధర్మాలఁ। దాల్చు ననఘ

భ్రమేణా ప్యన్యథా వాఽస్తు జీవభావః పరాత్మనః,
తదుపాధే రనాదిత్వా న్నానాదే ర్నాశ ఇష్యతే ।94

గీ॥ బ్రహ్మమున నిల జీవభావముఁ।దెలియు
భ్రమయొ వేరొకభావమో।వరగుణాఢ్య !
జీవుని కనాదిగ నుపాధి।చెప్పఁబడుట
నాశ మెట్లౌ నుపాధి య। నాదియగుట

అతోఽస్య జీవభావోఽపి నిత్యో భవతి సంసృతిః,
న నివర్తేత తన్మోక్షః కథం మే శ్రీగురో వద

గీ॥ జీవుని కనాదిగ నుపాధి। చెప్పఁబడుట,
భవము జీవుఁడు నిత్యమున్।బరగుదురన।
భవనివృత్తియు మోక్షము।పడయు టెటులు ?
కరుణఁదెల్పుమె నాకు శ్రీ। గురువరేణ్య !

సమ్యక్పృష్టం త్వయా విద్వ న్నావధానేన తచ్ఛృణు,
ప్రామాణికీ న భవతి భ్రాన్త్యా మోహితకల్పనా 196

గీ॥ పల్కితివిలెస్సగానిష్ట। పండితాఢ్య!
సావధానుండవై వాదు। సరళబోధ।
నమ్ము వినుమయ్య, ప్రామాణి।కమ్ము గాదు
భ్రాంతి మోహిత చిత్తుని।భావనమ్ము॥

భ్రాంతి వినా త్వసంగస్య నిష్క్రియస్య నిరాకృతేః,
న ఘటేతార్థ సమ్బన్ధో నభసో నీలతాదివత్ 197

గీ॥ నిత్య నిస్సంగుఁడై నట్టి। నిష్క్రియునకు,
వస్తు సంబంధముండదు। భ్రాంతిలేక।
గగనమునఁ దోచు నీలిమ।కరణిఁగనఁగ
భ్రాంతి జీవత్వ మగుపించు। బ్రహ్మమందు॥

స్వస్య ద్రష్టుర్నిర్గుణ స్యాక్రియ స్య
ప్రత్యద్బోధానందరూపస్య బుద్ధేః,
భ్రాన్త్యా ప్రాప్తో జీవభావో న సత్యో
మోహాపాయె నాస్త్యవస్తుస్వభావాత్ 198

గీ॥ నిర్గుణుఁడు చిదానందుడు। నిష్క్రియుండు
జ్ఞానతేజుఁడు నిత్యుఁడు। సర్వసాక్షి।
ప్రత్యగాత్మస్వరూపుఁడు। భ్రాంతిచేతఁ
బడయు జీవభావము; వా స్త।వమునఁ గాదు।
వాస్తవముగాని మోహమ్ముఁ బాసినంత
బ్రహ్మమందున జీవభా।వనము లేదు॥

యావద్భ్రాన్తి స్తావదేవాస్య సత్తా మిథ్యా జ్ఞానోజ్జృంభితస్య
ప్రమాదాత్,
రజ్జ్వాం సర్పో భ్రాన్తికాలీన ఏవ భ్రాన్తే ర్నాశే నైవ
సర్పోఽపి తద్వత్ 199

గీ॥ భ్రాంతివలనఁ గలుగు జీవ। భావసత్త
మిథ్యయగు వస్తు జ్ఞానము। మెరుఁగులేను।
భ్రాంతి రజ్జును ద్రాచను। భావనమ్ము
పాయు మనుజుని తల।పున। భ్రాంతి చెరగ।
బ్రహ్మమున జీవభావము, పాయు ననఘ :
మాయఁగల్గిన వి భ్రాంతి। మాసిపోవ॥

అనాదిత్వ మవిద్యాయాః కార్యస్యాపి తథేష్యతే,
ఉత్పన్నాయాంతు విద్యాయా మావిద్యక మనాద్యపి 200

గీ॥ కొంచుదు రనాదిగా జీవ।కార్యమునరు,
లె ట్లవిద్య ననాదిగ। నెంతురిలను।
విద్య యుత్పన్నమైన న।విద్య శిష్య :
అంతమగు నిశ్చయముగ న।నాదియయ్యు॥

ప్రబోధే స్వప్నవత్సర్వం సహమూలం వినశ్యతి,
అనాద్యపీదం నో నిత్యం, ప్రాగభావ ఇవ స్ఫుటమ్ 201

గీ॥ అంతయు నవిద్య జ్ఞానంబు। నంతరించు,
స్వప్నమట్లు సమూలము।సొంతముగను।
నిత్య మదికా దనాదిగా।నిల్చి।కూడ
ప్రాగభావము రీతి ప్ర।పంచమందు॥

అనాదేరపి విధ్వంసః ప్రాగభావస్య వీక్షితః,
యద్బుద్ధ్యుపాధిసమ్బన్ధా త్పరికల్పిత మాత్మని 202

జీవత్వం న తతోఽన్యత్తు స్వరూపేణ విలక్షణమ్,
సమ్బన్ధః స్వాత్మనో బుద్ధ్యా మిథ్యా జ్ఞాన పురస్సరః 203

గీ॥ ప్రాగభావమునను బుద్ధ్యు।పాధివలన
నాత్మఁ గల్పిత జీవం బ।నాదియయ్యె।
నశ్వరం బాత్మ యొకటి య। నశ్వరంబు।
స్వాత్మ కన్యంబు జీవ భా।వనము లేదు॥

భువి మృషజ్ఞానమునఁ జేసి। బుద్ధితోడ
నాత్మ కొదవెను సంబంధ। మనఘ! వినుము॥

వినివృత్తిర్భవే త్తస్య సమ్యక్ జ్ఞానేన నాన్యథా,
బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానం సమ్యక్ జ్ఞానం శ్రుతేర్మతమ్ 204

గీ॥ జీవభావ నివృత్తి ని।శ్శేషముగను,
చక్కని జ్ఞాన మబ్బుట। సంభవమ్ము।
కాని యదసాధ్య మన్యథా;। జ్ఞానమనిన,
వేదమతము, బ్రహ్మాత్మైక। విజ్ఞతనఘ!॥

తదాత్మానాత్మనో సమ్యగ్వివేకో నైవ సిద్ధ్యతి,
తతో వివేకః కర్తవ్యః ప్రత్యగాత్మసదాత్మనోః 205

గీ॥ బ్రహ్మమొకఁ డను సత్యమౌ। ప్రబలమైన
జ్ఞాన మొనగూడు సదసద్వి।చారమునను।
ప్రత్యగాత్మ సదాత్మ భా।వనము నరయు
నవ్వివేకము కర్తవ్య। మనఘ వినుము॥

జలం పఙ్కవ దత్యంతం పంకాపాయే జలం స్ఫుటమ్
యథా భాతి తథాత్మాఽపి దోషాఽభావే స్ఫుటప్రభః 206

అసన్నివృత్తే తు సదాత్మనా స్ఫుటం ప్రతీతి రేతస్య
భవేత్ప్రతీచః,
తతో నిరాపః కరణీయ ఏవ సదాత్మన స్సాధ్వహ
మాదివస్తునః 207

గీ॥ పంకమును దేర్చ జలమగుఁ బ్రస్ఫుటమ్ము,
దోషమేగంగ బ్రహ్మము తోచునటులె
సచ్చిదాత్మ స్ఫురించు నసన్నివృత్తి,
జీవభావమునుండి ప్రసిద్ధమగును॥
ఆత్మ నహమాది వస్తువులందునుండి
ఎడము సేయంగ బ్రహ్మము సెరుఁగనగును॥

అతో నాయం పరాత్మా స్యాద్విజ్ఞాన మయ శబ్దభాక్,
వికారిత్వా జ్జడత్వాచ్చ పరిచ్ఛిన్నత్వ హేతుతః
దృశ్యత్వా ద్వ్యభిచారిత్వా న్నాఽనిత్యో నిత్య ఇష్యతే 208

గీ॥ జ్ఞానమయకోశనామ, వికారయుతమ,
సత్తు జడమును దృశ్యంబు చంచలంబు
నింక భిన్నత్వ హేతు వదెంచి చూడ
నన్యము బ్రహ్మమునకు ననాదియయ్యు॥
బ్రహ్మమనఁ గాదు దానిని భ్రాంతిచేత॥

ఆనంద ప్రతిబింబచుంబిత తను ర్వృత్తి స్తమోజ్జృంభితా
స్యాదానందమయః ప్రియాదిగుణకః స్వేష్టార్థ లాభోదయః,
పుణ్యస్యానుభవే విభాతికృతనామానంద రూపస్స్వయం
భూ త్వా నందతి యత్ర సాధు తనుభృ న్మాత్రః ప్రయత్నం
వినా 209

శా॥ ఆనంద ప్రతిబింబ చుంబిత తను। వ్యాపారమై తామస
ధ్వానోజ్జృంభితమై క్రియాది గుణక। స్వార్థేష్ట లాభోదయం।
బానం దాఖ్యకకోశమై స్వయముగా। నానందకోశంబుగా
నానందించెడు దేహి దేహమునఁ గాంబు ం బ్రయత్నంబుగన్॥

ఆనందమయ కోశస్య సుషుప్తౌ స్ఫూర్తిరుత్కటా,
స్వప్నజాగరయో రీష దిష్ట సందర్శనాదినా 210

గీ॥ స్ఫూర్తి యానందమునకు సు।షుప్తి మెండు,
ఇష్ట సందర్శనంబున। నిహమునందు।
స్వప్న జాగరణంబుల। స్వల్పముగను,
తోచు నానందకోశంబు। దురితదూర !॥

నైవాయమానందమయః పరాత్మా,
సోపాధిక త్వాత్ప్రకృతే ర్వికారాత్,
కార్యత్వ హేతోః సుకృత క్రియాయాః
వికారసంఘాతసమాహితత్వాత్ 211

గీ॥ కలుఁగుట నుపాధిఁ బ్రకృతి వి। కారములను,
సుకృత కార్యత్వ హేతువై। శోభిలుటను,।
నేను నా దనెడి వికార। నికరముండ
నరయ నానందమయకోశ।మాత్మ గాదు॥

## పంచకోశ విలక్షణుండు - పరమాత్మ

పంచానామపి కోశానాం నిషేధే యుక్తితః శ్రుతేః,
తన్నిషేధావధి స్సాక్షీ బోధరూపోఽవశిష్యతే 212

గీ॥ వేదములయందు శాస్త్రోక్త।వివరణముల
పంచకోశనిషేధమ్ము। పలుకఁబడియె।
పంచకోశనిషేధంబు।బ్రహ్మ మొకఁడె
జ్ఞానరూపుఁడు సర్వార్థ।సాక్షి మిగులు॥

యోఽయమాత్మా స్వయంజ్యోతిః పంచకోశవిలక్షణః,
అవస్థాత్రయసాక్షీ సన్ నిర్వికారో నిరంజనః,
సదానందః స విజ్ఞేయః స్వాత్మత్వేన విపశ్చితా॥ 213

గీ॥ పంచకోశవిలక్షణ త్వప్రసిద్ధ
మైన యాత్మ స్వయంజ్యోతి। యమలినుండు।
నిత్యసచ్చిదానందుఁడు। నిర్వికారుఁ
డతఁడవస్థాత్రితయసాక్షి। యద్వయుండు,॥
బ్రహ్మ। మాత్మత్వవేద్యుండు। ప్రాజ్ఞులకిల॥

మిథ్యాత్వేన నిషిద్ధేషు కోశేష్వేతేషు పంచసు,
సర్వాభావం వినా కిఞ్చిన్న పశ్యామ్యత్ర హే గురో,
విజ్ఞేయం కిము వస్త్వస్తి స్వాత్మనాఽఽత్ర విపశ్చితా 214

గీ॥ జగము మిథ్య యనుటచే।సత్స్వరూప
కోశపంచక మేగెను।లేశమైనఁ।
గానకుంటిని శూన్యము।కన్న గురుఁడ।
సద్వివేకంబు నాత్మవి।చారణమున॥
కలుగు నెయ్యది కాంచంగ। జ్ఞానులకును॥

సత్యముక్తం త్వయా విద్వన్నిపుణోఽసి విచారణే,
అహమాదివికారాస్తే తద భావోఽయ మప్యను 215

సర్వే యేనానుభూయన్తే యస్స్వయం నానుభూయతే,
తమాత్మానం వేదితారం విద్ధి బుద్ధ్యా సు సూక్ష్మయా 216

గీ॥ సత్యమును బల్కినాడవు। సద్విచార
నిపుణ ! బుధవర ! నాదియు। నేను వసెడు।
వికృతులును వాని లేమియు। విశదముగను
ఎవనిచే ననుభూతంబు। లెవఁ డనుభవ॥
మున కవేద్యుఁడు పరమాత్మ। మూలపురుషుఁ
డతని సునిశితబుద్ధితో।నరయు మయ్య॥

తత్సాక్షికం భవేత్తత్తత్ యద్యద్యేనానుభూయతే,
కస్యాప్యననుభూతార్థే సాక్షిత్వం నోపయుజ్యతే 217

గీ॥ అనుభవించు నతఁడె దాన।కగును సాక్షి,
అనుభవాగోచరంబగు।నట్టిదాని।
కుందురే సాక్షులెందైన। నుర్వియందు ?
విశదముగ విన్మ నా బోధ। విబుధవర్య॥

అసౌ స్వసాక్షికో భావో యతః స్వేనాను భూయతే,
అతః పరం స్వయం సాక్షా త్ప్రత్యగాత్మా న చేతరః 218

గీ॥ సర్వభావానుభవసాక్షి। సచ్చిదాత్మ,
ఆత్మ భావానుభూతికి। నతఁడె సాక్షి।
ప్రత్యగాత్మకు సాక్షాత్తు। బ్రహ్మమునకు
నితరముండడు సాక్షియిం। కెటుల గల్గు॥

## జగము మిథ్యయను విచారము, ఆత్మస్వరూప నిరూపణ బ్రహ్మ సత్యం జగన్మిథ్య సూత్రీకరణము

జాగ్రత్స్వప్న సుషుప్తిషు స్ఫుటతరం యోఽసౌ సముజ్జృంభతే
ప్రత్యగ్రూపతయా సదాహ మహమి త్యన్తః స్ఫురన్నైకధా,
నానాకార వికార భాగిన ఇమా న్పశ్య న్నహంధీముఖాన్
నిత్యానందచిదాత్మనా స్ఫురతి తం విద్ధి స్వమేతం హృది 219

గీ॥ ప్రత్యగాత్మస్వరూపమ్ము। ప్రస్ఫుటముగ,
స్వప్నజాగ్రత్సుషుప్తుల। స్వాతిశయము।
నేను నేనని నిత్యము। నెగడు నెవఁడు
సాక్షియై వివిధవికార। సంయుతమగు॥
బుద్ధ్యహంకారయుత కాయ।ము నిలఁ గనుచు,
సచ్చిదానందరూపుఁడై। సతతము హృది।
ద్యోతకంబగు బ్రహ్మంబు। జ్యోతినాత్మ
నే ననుచు మది నెరుఁగుమా। నిశ్చయముగ॥

ఘటోదకే బింబిత మర్కబింబ మాలోక్య మూఢో రవి మేవ
మన్యతే,
తథా చిదాభాస ముపాధి సంస్థం భ్రాన్త్యా హమిత్యేవ
జడోఽభిమన్యతే 220

గీ॥ కమల మిత్రుని బింబంబు। ఘటజలంబుఁ
గాంచి బింబము రవిగ భా।వించు మూఢు।
నటుల జీవుఁ జిదాభాసుఁ।డౌ నుపాధి
యుతుని నే నని భ్రమ జడుం।డూహ సెంచు॥

ఘటం జలం తద్గతమర్కబింబం విహాయ సర్వం
వినిరీక్ష్యతేఽర్కః,
తటస్థ ఏత త్త్రి తయావభాసకః స్వయంప్రకాశో విదుషా యథా
తథా॥ 221

గీ॥ ఘట జలమునర్కబింబము। గాక నభము
వెల్గు సూర్యుని గుర్తించు। విబుధు విధము।
తనువు బుద్ధిని ప్రతిబింబ।మును వెలుంగఁ
జేయు సాక్షి స్వయంజ్యోతి। ధీయుతుండు॥
గను విలక్షణముగ నాత్మ। ననఘచరిత।

దేహం ధియం చిత్ప్రతి బింబ మేవం
విసృజ్య బుద్ధౌ నిహితం గుహాయామ్,
ద్రష్టార మాత్మాన మఖండబోధం,
సర్వ ప్రకాశం సదసద్విలక్షణమ్ 222

నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం
అన్తర్బహిశ్శూన్య మనన్య మాత్మనః,
విజ్ఞాయ సమ్యఙ్నిజరూప మేత,
త్పుమా న్వి పాప్మా వి రజో విమృత్యుః 223

గీ॥ విడిచి తనుబుద్ధి చిత్ప్రతి।బింబములను
బుద్ధి యను గుహ నివసించు। పురుష, సాక్షి,।
జ్ఞానరూపుని, యాత్మ, న।ఖండ తేజు,
పరుని సదసద్విలక్షణుఁ। బ్రభుని నిత్యు।
సూక్ష్మ సర్వోవగతు, శాంతు। శుద్ధ సత్త్వ
నాత్మ నంతర్బహిశ్శూన్యు। నద్వితీయు।
పాపరహితుని రాజస। బాహ్యుఁ దెలిసి
మృత్యుసంసార జలనిధి। మీరు నరుఁడు॥

విశోక ఆనందఘనో విపశ్చి, త్స్వయం కుతశ్చి న్న బిభేతి కశ్చిత్,
నాన్యోఽస్తి పన్థా భవబంధముక్తేః వినా స్వతత్త్వావగమం ముముక్షోః 224

గీ॥ శోకరహితసదానంద।శోభితుండు
భయవిరహితుఁడు మరియు వి।పశ్చితుఁడగు।
మోక్షకామికి భవబంధ। మోక్షమునకు
ఆత్మతత్త్వావగమమున। కన్యమైన॥
మార్గముండెనె మహిలోన। మాన్యచరిత?॥

బ్రహ్మాభిన్నత్వవిజ్ఞానం భవమోక్షస్యకారణమ్,
యేనాద్వితీయ మానన్దం బ్రహ్మ సమ్పద్యతే బుధైః 225

క౦॥ బ్రహ్మమభిన్నంబనియెడు
బ్రహ్మానందప్రదమగు। బ్రజ్ఞానంబున్।
బ్రహ్మత్వ మొదవు బుధులకు
బ్రహ్మద్వయ మనుటచేత। భవమోక్షమగున్॥

బ్రహ్మభూతస్తు సంసృత్యై విద్వా న్నావర్తతే పునః,
విజ్ఞాతవ్య మతస్సమ్య గ్బ్రహ్మా భిన్నత్వ మాత్మనః 226

గీ॥ బ్రహ్మమైనట్టి సద్బుధ।వరుఁడు శిష్య !
మాయభవమునఁ బడుటకు। మరలరాడు॥
ఆత్మ బ్రహ్మమున క భిన్న।మంచు నెఱుఁగ
వలయు లెస్సగ బుధునకు। భవముగడువ !॥

సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, విశుద్ధం పరం స్వతస్సిద్ధమ్,
నిత్యానందైకరసం పరం స్వతస్సిద్ధం నిరన్తరం జయతి 227

క౦॥ సత్యము జ్ఞాన మనంతము,
ప్రత్యగ భిన్నంబు పరము। బ్రహ్మము, సిద్ధం।
బత్యంతశుద్ధ మఖిలము,
నిత్యానందైకరసము। నిర్వ్వరంబున్॥

సదిదం పరమాద్వైతం స్వస్మా దన్యస్య వస్తునోఽభావాత్,
న హ్యన్యదస్తి కించిత్సమ్యక్ పరమార్థతత్త్వబోధదశాయామ్॥
228

గీ॥ వాస్తవమున ననన్యమై వరలు నాత్మ
బ్రహ్మసద్రూపుఁడు పరమాద్వైతుఁ డనఘ।
ఆత్మ తత్త్వావబోధనమందు దశను
లేశ మేని చిదాత్మకు లే దితరము॥

యదిదం సకలం విశ్వం నానారూపం ప్రతీత మజ్ఞానాత్,
తత్సర్వం బ్రహ్మైవ ప్రత్యస్తాశేషభావనాదోషమ్ 229

గీ॥ తొలఁగ నానావిధంబులౌ దోషచయము,
వివిధరూపాల నొప్పుచు విశ్వమనఁగ।
నజ్ఞతను సంప్రతీతమై నట్టిజగము
సర్వమును బ్రహ్మమయమగు సరళవచన॥

మృత్కార్యభూతోఽపి మృదో న భిన్నః
కుమ్భోఽస్తి సర్వత్ర తు మృత్స్వరూపాత్,
న కుమ్భరూపం పృథగస్తి కుమ్భః కుతో మృషా కల్పితనామ
మాత్రః 230

కం॥ మట్టిని నిర్మిత కుంభము
మట్టికి నన్యంబుగాదు మహినెందైనన్।
మట్టియుఁ గుంభము వేరను,
టెట్టులు పృథఁగల్పితంబులీ భేదంబుల్॥

కేనాపి మృద్భిన్నతయా స్వరూపం
ఘటస్య సందర్శయితుం న శక్యతే,
అతో ఘటంః కల్పిత ఏవ మోహాత్
మృదేవ సత్యం పరమార్థభూతమ్ 231

గీ॥ ఘటము మృత్తిక వేరనఁ గలుగుటకును,
సాధ్య మెవరికి నవిశాల। జగమునందు।
ఘటము కల్పితరూపంబు।గాని నిజము
మృత్తికయ పరమార్థమం।చెరుఁగు మయ్య॥

సద్బ్రహ్మకార్యం సకలం సదైవ,
తన్మాత్ర మేతన్న తతోఽ న్యదస్తి,
అస్తీతి యో వక్తి న తస్య మోహో
వినిర్గతో నిద్రితవత్ప్రజల్పః 232

గీ॥ బ్రహ్మమునఁజేసి నది యెల్ల। బ్రహ్మమె యగు
బ్రహ్మమున కన్యమొకఁడు భా।వమ్ము లేదు।
బ్రహ్మకన్యము గలదని। పలుకువాఁడు
మోహమున మున్గి నిద్దుర। మొరుగువాఁడు॥

బ్రహ్మైవేదం విశ్వమిత్యేవ వాణీ, శ్రౌతీ బ్రూతేఽథర్వనిష్ఠా వరిష్ఠా,
తస్మా దేతద్బ్రహ్మ మాత్రం హి విశ్వం నాధిష్ఠా నాద్భిన్నతాఽఽరోపితస్య 233

గీ॥ బ్రహ్మమే విశ్వమంచును। బ్రస్ఫుటముగ
పల్కుచున్న దథర్వణ। వాణి గాన।
బ్రహ్మమున కధిష్ఠాన ప్ర।పంచమునకు
బ్రహ్మ మన్యము గాదు స।ర్వంబు బ్రహ్మ॥

సత్యం యది స్యా జ్జగదేతదాత్మనా
న తత్త్వహాని ర్నిగమాప్రమాణతా,
అసత్యవాదిత్వమ పీశితు స్స్యాన్నైత త్త్రయం సాధు హితం మహాత్మనామ్ 234

చం॥ చతురత బ్రహ్మవిశ్వమని। సత్యమనంగ జగమ్ము దాననౌ
శ్రుతులకు వప్రమాణత యనూనృత దోషము ద్వైవవాదికిన్,
వితరణ తత్త్వహాని, యను। విజ్ఞుల మెచ్చని మూడు దోషముల్
హితమతి మిథ్య యీ జగతి। యింతకు సత్యము బ్రహ్మ మొక్కటే।

ఈశ్వరో వస్తుః తత్త్వజ్ఞో న చాహం తేష్వవస్థితః,
న చ మత్స్థాని భూతానిత్యేవ వ్యబీక్లవత్॥ 235

గీ॥ భూతములు లేవు నాయందు। భూతములను
నేను లే నను సత్యంబు। నిశ్చయంబు॥
ఎరిగి వస్తు తత్త్వంబు మ। హేశ్వరుండు
పల్కె యీ రీతి నియమించెఁ। బ్రస్ఫుటముగ॥

యది సత్యం భవేద్విశ్వం సుషుప్తా వుపలభ్యతే,
య న్నోపలభ్యతే కించి దతోఽసత్స్వప్నవన్మృషా 236

గీ॥ సత్యమగు నేని విశ్వంబు। సకలగతుల
అంద కెట్లుండెడు సుషుప్తి।యందు జగము।
స్వప్న మట్లుగ క్షణికమై। సమయు జగము
సత్తు నశ్వర మది యెట్లు। సత్యమగును॥

అంతః పృథక్నాస్తి జగత్పరాత్మనః
పృథక్ప్రతీతిస్తు మృషాగుణాహితత్,
అరోపితస్యాఽపి కి మర్థవత్తాఽధిష్ఠాన మాభాతి తథా భ్రమేణ॥ 237

గీ॥ గగనమునఁదోచు నీలిమ। కరణి నిత్య,
బ్రహ్మమందున సర్వ ప్రపంచకమగు।
విశ్వమారోపితంబయి ।వెలయుచుండు,
వేరుగా నుండె నని బ్రహ్మ।విశ్వమునకు॥
పల్కువారుంద్రు జనులందు। భ్రాంతిఁగాని
విశ్వముండదు బ్రహ్మకు। వేరుగాను॥

భ్రాన్త స్య య ద్య ద్భ్రమతః ప్రతీతమ్
బ్రహ్మైవ త త్తద్ర జతః హి శుక్తిః,
ఇదంతయా బ్రహ్మ సదైవ రూప్యతే
త్వారోపితం బ్రహ్మణి నామమాత్రమ్ 238

గీ॥ రజత మని ముత్యమును భ్రాంతిఁ। జూచునట్లు,
భ్రమను భ్రాంతుఁడు దర్శించు। భావమెల్ల।
బ్రహ్మమే యగు నన్య భా।వమ్ము గాదు,
తోచు విశ్వంబు సద్రూపు।తోచు బడియె।
బ్రహ్మమందు నారోపిత। భావనంజె॥

అతః పర బ్రహ్మ సదాఽద్వితీయం, విశుద్ధ విజ్ఞానఘనం
నిరఞ్జనమ్,
ప్రశాన్త మాద్యన్త విహీన మక్రియం నిరన్తరానన్దరస
స్వరూపమ్ 239

గీ॥ ఆది మధ్యాంత రహిత స।దద్వితీయ,
విమల విజ్ఞాన ఘనుఁడు ని।ర్వివరుఁ డాత్మ।
సచ్చిదానందరసమయ। శాంతరూప,
బ్రహ్మ మక్రియుఁ డమల ప।రాత్పరుండు॥

నిరస్త మాయాకృత సర్వభేదం నిత్యం సుఖం నిష్కల
మప్రమేయమ్,
అరూప మవ్యక్త మనాఖ్య మవ్యయం జ్యోతిస్స్వయం కించి
దిదం చకాస్తి 240

గీ॥ విగత మాయాకలిత సర్వ। భేదభావ,
నిత్యమానందరూపము। నిష్కళంక।
మవ్యయం బప్రమేయ మ।నాఖ్యకమ్ము,
ఆత్మ నిత్యస్వయం జ్యోతి। యద్వితీయ।
మరయ రూప విరహిత మ।వ్యక్త మద్ది।
విమలతేజంబు జగమెల్ల। వెల్గుచుండె॥

జ్ఞాతృజ్ఞేయజ్ఞాన శూన్య మన న్తం నిర్వికల్పకమ్,
కేవలాఖణ్డ చిన్మాత్రం పరం బ్రహ్మ విదుర్బుధాః 241

గీ॥ జ్ఞానము జ్ఞేయము మరియు। జ్ఞాతలేని
నిర్వికల్ప మనంతంబు। నిత్యమైన।
కేవలాఖండ చిన్మాత్ర, కీర్తిత పర
బ్రహ్మ, పురుషు నెఱుఁగుదురు। ప్రాజ్ఞు లిలను॥

అహేయ మనుపాదేయం మనోవాచామగోచరమ్,
అప్రమేయ మనాద్య న్తం బ్రహ్మ పూర్ణం మహన్మహః 242

గీ॥ వాఙ్మనముల కగోచర। బ్రహ్మ మనఘ।
అప్రమేయం బహేయమ।నాద్యన న్త
మద్వితీయము పూర్ణం బ।హంబు। బ్రహ్మ
మరయు ననుపాద్య మవ్యయ। మమలచరిత॥

## తత్త్వ మస్యాది మహావాక్య విచారము

తత్త్వం పదా ఖ్యామ భిధీయమానయో-
ర్బ్రహ్మాత్మనో శ్శోధితయో ర్యదీత్థమ్,
శ్రుత్యా తయో స్తత్త్వమసీతి సమ్య
గేకత్వమేవ ప్రతిపాద్యతే ముహుః 243

గీ॥ తత్త్వమని యెడి పదములఁ దలఁచఁబడుచు
నాత్మపరమాత్మ శోధనఁ। బమరఁజేసి।
తత్త్వమసి యను వేద తా।త్పర్యమునను
సమ్య గేకత పలు మార్లు। చాటఁబడియె॥

ఐక్యం తయోర్లక్షితయో ర్న వాచ్యయో, ర్నిగద్యతేఽన్యోన్య
విరుద్ధ ధర్మిణోః,
ఖద్యోత భాన్వో రివ రాజభృత్యయోః కూపాంబురాశ్యోః
పరమాణుమేర్వోః 244

గీ॥ మిణుగురులలోని రవిలోని। మెరు పొకండె,
జలధిఁ, గూపములం గల। జలమొకండె।
ధరణిపతియును భృత్యులు।న్నరులె కనిన,
అణువుమేరువులను వస్తు।వరయ నొకటె॥
కలుఁగు వ్యతిరేక ధర్మాల। గణన మాని
కాంతు రైక్యత వగుణముఁ। గలుఁగఁజూచి।
ఐక్యతను ధర్మవైరుధ్య। మరయకుండ
జీవ బ్రహ్మాత్మలకు నట్లె। చెప్పుదు రిల॥

తయో ర్విరోధోఽయముపాధికల్పితో, న వాస్తవః కశ్చిదుపాధి
రేషః,
ఈశ స్త మాయామహదాది కారణం జీవస్య కార్యం శ్రుణు
పంచకోశమ్ 245

ఏతా ఉపాధీ పరజీవయో స్తయో, స్సమ్యఙ్నిరాసేన పరో న
జీవః,
రాజ్యం నరేంద్రస్య భటస్య ఖేటక స్తయో రపోహే న భటో
న రాజా 246

గీ॥ తారతమ్య ముపాధి భేదమునఁ గల్గె
వా స్తవమునఁ గా దీశ్వరో।పాధివలనఁ।
గల్గె మాయమహత్తులు। గారణముగ
జీవకార్యము పంచకో।శములు విన్మ॥
బ్రహ్మకును జీవున కుపాధిఁ। బాపి చూడ
బ్రహ్మమను జీవుఁడను భేద। భావ మేగు।
రాజు రాజ్యమ్ము భటుని కు।గ్రామ మేగ
భటుఁడు రాజను భేదభా।వమ్ము లేదు?॥

అథాత ఆదేశ ఇతి శ్రుతిస్స్వయం నిషేధతి బ్రహ్మణి
కల్పితం ద్వయమ్,
శ్రుతిప్రమాణానుగృహీతబోధా త్తయోర్నిరాసః కరణీయ ఏవ 247

గీ॥ విను శ్రుతి 'అథాతఆదేశ।' యనుచు నిందు
బ్రహ్మమందునఁ గల్పితో।పాధియుగముఁ।
దా నిషేధించెఁ దదను।గ్రహానుసార
జ్ఞానమున నిరసించు మ।హ్వాని వనఘ।"
నేదం నేదం కల్పితత్వాన్న సత్యం రజ్జౌ దృష్టవ్యాళవ
త్స్వప్నవచ్చ,
ఇత్థం దృశ్యం సాధుయుక్త్యా వ్యపోహ్య జ్ఞేయః పశ్చాదేకభావ
స్తయో ర్యః 248

గీ కాదు కాదిది యంచుఁద।ర్కమునఁజూడఁ
గలుఁగ దెన్నఁడు సత్యంబు। గల్పితములు।
భ్రాంతి సర్పమువలెఁదోచు। త్రాడుకరణి
స్వప్నమం దగుపించు దృ।శ్యంబులీల॥
భ్రాంతికల్గిన యట్టియా।భాసకములు
యుక్తిదృశ్యముఁ బోగొట్టి। యుర్వియందు।
జీవబ్రహ్మైక్యభావనఁ జిత్తగించ
వలెను బ్రాజ్ఞుల కిలలోనఁ। బండితాఢ్య॥

తతస్తు తౌ లక్షణయా సులక్ష్యౌ తయో రఖండైకరసత్వ సిద్ధయే,
నాలం జహత్యా న తథాఽజహత్యా కిం తూభయార్థాత్మిక
యైవ భావ్యమ్ 249

గీ తత్త్వమన నది లక్షణ।దర్శితంబు,
సచ్చిదానందరస సిద్ధి।సాధనంబు।
జహతిచే నజహతిచే న।సాధ్యమయ్యు
సాధ్య ముభయార్థభావన। సాధుచరిత॥

స దేవదత్తోఽయ మితీహ చైకతా, విరుద్ధ ధర్మాంశ మపాస్య
కథ్యతే,
యథా తథా తత్త్వమ సీతి వాక్యే విరుద్ధధర్మా నుభయత్ర
హిత్వా॥ 250

గీ॥ దేశకాలాది భిన్నత।దెలిసి యునిక
నితఁడె యీ దేవదత్తుఁడం। చెఱుఁగునట్లు।
కలుఁగు ప్రత్యర్థి భావాలఁ।గాంచి మరల
తత్త్వమసి యను నైక్యతం। దలఁచవలయు॥

సంలక్ష్య చిన్మాత్రతయా సదాత్మనో రఖండభావః పరిచీయతే
బుధైః,
ఏవం మహావాక్యశతేన కథ్యతే, బ్రహ్మాత్మనో
రైక్యమఖండభావః 251

గీ॥ ఎఱిఁగి చిన్మాత్రతను జీవు। నీశు నొకట,
బుధు లఖండైకభావము।।బొందువారు॥
వాక్యశతకముచే నిర్వి।వాదముగను,
బ్రహ్మ కాత్మకు నైక్యత।పలుఁకఁబడెడు॥

అస్థూల మిత్యేత దసన్నిరస్య, సిద్ధం స్వతో వ్యోవ దప్రతర్క్యమ్,
యతో మృషామాత్ర మిదం ప్రతీతం, జహీహి యత్స్వాత్మతయా
గృహీతమ్
బ్రహ్మాహమిత్యేవ విశుద్ధ బుద్ధ్యా, విద్ధి స్వమాత్మాన
మఖండబోధమ్ 252

గీ॥ ఆకసమువలె తర్కాని కందనట్టి,
సత్స్వతస్సిద్ధమైనట్టి సకల జగము
వదలి యస్థూలమంచును బ్రహ్మము నీక
నాత్మతాదృష్టిఁ దనరు మిథ్యాజగంబు॥
విడువు మాత్మావబోధన వెలయఁగాంచి
బ్రహ్మమే నను నిర్మల భావనంబు
నాత్మబోధము స్వయముగ నందుమయ్య

మృత్కార్యం సకలం ఘటాది సతతం మృణ్మాత్ర మేవాహితం,
తద్వత్సజ్జనితం సదాత్మకమిదం సన్మాత్ర మేవాఖిలమ్,
యస్మాన్నాస్తి సతః పరం కిమపి తత్సత్యం స ఆత్మా స్వయం
తస్మాత్ తత్త్వమసి ప్రశాన్తమమలం బ్రహ్మాద్వయం
యత్పరమ్ 253

గీ॥ మట్టిఁజేసిన కుండలు మన్నె యగును,
సత్త్వజనిత జగంబెల సత్తె యగును
సత్తునకపర నిత్యమౌ సత్య మాత్మ
బ్రహ్మ మమలము శాంత మద్వయము పరము॥
తత్త్వమసి యంచు నెరుఁగు మాత్మ స్వయముగ
తత్త్వజిజ్ఞాస పరిపూర్ణ ధన్యచరిత॥

నిద్రాకల్పితదేశకాలవిషయజ్ఞాత్రాది సర్వం యథా
మిథ్యా తద్వదిహాపి జాగ్రతి జగత్స్వాజ్ఞానకార్యత్వతః,
యస్మాదేవ మిదం శరీర కరణప్రాణాహమాద్యప్యసత్
తస్మాత్తత్త్వమసి ప్రశాన్త మమలం బ్రహ్మాద్వయం
యత్పరమ్॥ 254

గీ॥ నిద్రాకల్పితదేశకాల విషయా। నీకంబు జ్ఞాత్రాది స
ర్వద్రవ్యంబులు మిథ్య యౌనటులుగన్। స్వాజ్ఞాన కార్యత్వతన్।
చిద్రంబౌన హమాది దేహమగు నీ జీవాళయంబందునన్
భద్రా! తత్త్వమసి ప్రశాన్త విమల। బ్రహ్మంబ వీవే సుమా।

జాతి నీతి కుల గోత్ర దూరగం నామరూపగుణదోషవర్జితమ్,
దేశకాలవిషయాతివర్తి యద్బ్రహ్మ తత్త్వమసి
భావయాత్మని 255

గీ॥ జాతి కుల గోత్రములకును। నీతి కెడము,
రూప నామ గుణాదిక। లోపరహితు।
డెవఁడు దేశకాలాతీతుఁ। డెవఁడు పరుఁడు
అట్టి బ్రహ్మంబవీవయుం చరయు మనఘ!
తత్త్వమసి యని నీ వాత్మఁ। దలఁచుమయ్య॥

యత్పరం సకలవాగగోచరం గోచరం విమలబోధచక్షుషః,
శుద్ధచిద్ఘన మనాది వస్తు యద్బ్రహ్మ తత్త్వమసి
భావయాత్మని 256

గీ॥ సకలవాగగోచరము వి। జ్ఞాననేత్ర,
గోచరము శుద్ధచిద్ఘన। ఘోషితంబు।
పరమనాది వస్తువు పర। బ్రహ్మ మెవఁడు,
తత్త్వమసి యని నీ వాత్మఁ। దలచుమయ్య॥

షడ్భిరూర్మిరభిర్యోగి యోగిహృద్భావితంన కరణైర్విభావితమ్,
బుద్ధ్యవేద్య మనవద్యమస్తి యద్బ్రహ్మ తత్త్వమసి
భావయాత్మని 257

గీ॥ ఊర్మిషట్కముతోడను యుక్తమైన
యోగిహృజ్ఞాత మింద్రియా నూహ్యమైన
బుద్ధ్యవేద్యానవద్యంబు పూజితంబు
తత్త్వమసి యంచు బ్రహ్మము దలఁచు మాత్మ॥

భ్రాన్తి కల్పిత జగత్కలాశ్రయం స్వాశ్రయం చ
సదసద్విలక్షణమ్,
నిష్కలం నిరుపమానమృద్ధిమద్బ్రహ్మ తత్త్వమసి భావయాత్మని,

గీ॥ భ్రాన్తిఁగల్పితాశ్రయము ప్రపంచమునకు
ప్రబల సదసద్విలక్షణ స్వాశ్రయంబు
నిరుపమానము పూర్ణంబు నిష్కలంబు
తత్త్వమసి యని బ్రహ్మముఁ దలఁచు మయ్య॥ 258

జన్మవృద్ధి పరిణత్యపక్షయవ్యాధి నాశన విహీన మవ్యయమ్,
విశ్వసృష్ట్యవన విఘాతకారణం బ్రహ్మ తత్త్వమసి
భావయాత్మని 259

గీ॥ పుట్టి పెరుఁగుట, పరిణతి గిట్టుటయును,
వ్యాధిక్షీణములేని నిర్ద్వంద్వ, మఖిల
విశ్వమున కారణము సృష్టి విలయములకు,
తత్త్వమసి, బ్రహ్మ మీవుగఁ దలఁచు మాత్మ॥

అస్తభేద మనపాస్త లక్షణం నిస్తరంగ జలరాశి నిశ్చలమ్,
నిత్యముక్త మవిభక్త మూర్తి యద్బ్రహ్మ తత్త్వమసి
భావయాత్మని 260

గీ॥ న్యస్త భేదంబు నిర్మలా। న్యస్తగుణము,
నిస్తరంగోదధిని బోలి। నిశ్చలమ్ము।
నిత్యముక్త మభాజ్యమ్ము। సత్యమూర్తి,
తత్త్వమసి బ్రహ్మ మీవుగఁ। దలచు మయ్య॥

ఏకమేవ సదనేక కారణం కారణాన్తర నిరాశ కారణమ్,
కార్యకారణవిలక్షణం స్వయం బ్రహ్మ తత్త్వమసి
భావయాత్మని ౨౬౧

గీ॥ ఏకమగు కారణము సత్త। నేకమునకు
కారణాంతర త్యాగంపు, కారణంబు।
కార్యకారణ భిన్నమై। ఘనత నొప్పు
తత్త్వమసి బ్రహ్మ మీవుగఁ। దలఁచు మయ్య॥

నిర్వికల్పక మనల్ప మక్షరం, యత్క్షరాక్షర విలక్షణం పరమ్,
నిత్య మవ్యయసుఖం నిరంజనం బ్రహ్మ తత్త్వమసి
భావయాత్మని ౨౬౨

గీ॥ అక్షరం బవ్యయసుఖం బనల్ప మమల,
మక్షరాక్షరములకు వి।లక్షణంబు।
నిర్వికల్పకము పరమ్ము। నిత్యమైన
తత్త్వమసీ, బ్రహ్మ మీవుగ॥దలఁచు మయ్య॥

యద్విభాతి సదనేకధా భ్రమాన్నామ రూపగుణవిక్రియాత్మనా,
హేమవ త్స్వయ మవిక్రియం సదా బ్రహ్మ తత్త్వమసి
భావయాత్మని ౨౬౩

గీ॥ భ్రాన్తి నానావికారవి। భాసితంబు
వివిధ గుణరూపనామసం। వేద్య మగుచు,
పసి।డివలె నిర్వికారమై। పరఁగునట్టి
తత్త్వమసి బ్రహ్మమను చాత్మఁ।దలఁచు మయ్య॥

యచ్ఛకాస్త్యవపరం పరాత్పరం ప్రత్యగేకరస మాత్మ లక్షణమ్,
సత్యచిత్సుఖమనన్తమవ్యయం బ్రహ్మ తత్త్వమసి
భావయాత్మని 264

గీ॥ ప్రత్యగేకాత్మపరము పరాత్పరమ్ము
అవ్యయము సచ్చిదానంద మనితరమ్ము॥
అమల మనవద్య మఖిలం బనన్తమైన
తత్త్వమసి బ్రహ్మమీవంచుఁ దలఁచు మయ్య॥

ఉక్తమర్థ మమ మాత్మని స్వయం భావయ ప్రథితయుక్తిభి
ర్ధియా,
సంశయాది రహితం కరాంబువ త్తేన తత్త్వనిగమో
భవిష్యతి 265

గీ॥ బ్రహ్మమునుగూర్చి నేఁబల్కు భావములను
యుక్తితోడను సద్బుద్ధి యుక్తుఁడవయి
సంశయవిరహితుండవై సంయమించ,
తత్త్వసారము నీ కరతలజలమ్ము॥

స్వం బోధమాత్రం పరిశుద్ధ తత్త్వం విజ్ఞాయ సంఘే
నృపవచ్చ సైన్యే,
తదాశ్రయ స్స్వాత్మని సర్వదా స్థితో విలాపయ బ్రహ్మణి
విశ్వజాలమ్ 266

గీ॥ నృపుని పిల్పునఁ గుర్తించు రీతిగాను
జ్ఞానరూపుని పరిశుద్ధు సత్త్వరూపు
నాత్మ గుర్తించి ఎల్లప్పు డాశ్రయించి
నిరతము స్వాత్మచింతన నిలిచియుండి
విలయమొనరించు బ్రహ్మంబు విశ్వము నిక
పరమసద్గుణశోభిత బ్రహ్మతేజ॥

బుద్ధౌ గుహాయాం సదసద్విలక్షణం, బ్రహ్మాస్తి సత్యం పర
మద్వితీయమ్,
తదాత్మనా యోఽత్ర వసేద్గుహాయాం పునర్న
తస్యాంగగుహాప్రవేశః 267

గీ॥ బ్రహ్మసత్యంబు సదసద్విలక్షణుండు
అద్వితీయుండు బుద్ధి గుహాలయుండు,
ఎరుంగు తాదాత్మ్యత నెవండు। బరంగు గుహను
దేహగుహంజొచ్చు టతనికిం దిరిగి లేదు॥

## వాసనాత్రయము

జ్ఞాతే వస్తున్యపి బలవతీ వాసనాఽనాదిరేషా
కర్తా భోక్తా ప్యహమితి దృఢా యాఽస్య సంసారహేతుః,
ప్రత్యగ్దృష్ట్యాఽఽత్మని నివసతా సాఽపనేయా ప్రయత్నాత్
ముక్తిం ప్రాహుస్తదిహ మునయో వాసనా తానవం యత్ 268

గీ॥ బ్రహ్మవస్తువు నెఱింగియు। బ్రస్ఫుటముగ
నేనె కర్తను భోక్తను। నేనె యనెడు।
భావము దృఢమౌ హేతువు। భవమునకును,
ప్రబలము ననాది యైనట్టిం వాసనలను॥
ఆత్మదృష్టిని యాత్మస్థుండై సతతము,
యత్నశీలతం దొలంగద్రోయుంగవలయు॥
ముక్తివాంఛించుచు నిల ముముక్షుజనుల
వాసనానాశనమ్మును వాస్తవముగ।
మోక్షమందుదు రిరముగ। మునిజనములు॥

అయం మమేతి యో భావో దేహాక్షాదా వనాత్మని,
అధ్యాసోఽయం నిరస్తవ్యో విదుషా స్వాత్మ నిష్ఠయా 269

గీ॥ ఆత్మగా నట్టి దేహాదు లందు గలుఁగు
నేను నా దను భావముఁ। నిశ్చయముగ।
భ్రాంతిజనితము। జ్ఞానులు। స్వాత్మనిష్ఠ
విడువవలయును దానిని। విబుధవర్య॥

జాత్వా స్వం ప్రత్యగాత్మానం బుద్ధితద్వృత్తిసాక్షిణమ్,
సోఽహ మిత్యేవ సద్వృత్త్యాఽనాత్మన్యాత్మని మతిం జహి

గీ॥ బుద్ధి, తద్వృత్తి, సాక్షియుఁ బురుషుఁడైన
ప్రత్యగాత్మను దెలియుము। ప్రస్ఫుటముగ।
సోఽహమనియెడు సద్వృత్తి। దేహమాద్య
నాత్మవస్తుల విడువుమా। యాత్మయద్ధి॥

లోకానువర్తనం త్యక్త్వా త్యక్త్వా దేహానువర్తనమ్,
శాస్త్రానువర్తనం త్యక్త్వా స్వాధ్యాసాపనయం కురు 271

గీ॥ స్వస్వరూపావబోధనా। జ్ఞానమునను
లోకు లరిగెడి మార్గంబుఁ।బోక యింక
దేహశాస్త్రానుసారులౌ। తెరవుల విడి
వదలుమా దేహమే నను। భ్రాంతి శిష్య॥

లోకవాసనయా జన్తోశ్శాస్త్రవాసనయాఽపి చ,
దేహవాసనయా జ్ఞానం యథావాన్నైవ జాయతే 272

గీ॥ దేహవాసనచేఁగాని। తిరిగి లోక
వాసనను గాని యింకశాస్త్ర। వాసనమున
ప్రాణులకు జ్ఞానమరయ న।ప్రాప్యమనుచు
తెలియుమా పండితవరేణ్య। తెల్లముగను॥

సంసారకారాగృహమోక్షమిచ్ఛో రయోమయం పాదనిబద్ధ
శృఖలంమ్,
వదన్తి తజ్ఞాః పటువాసనాత్రయం యోఽస్మాద్విముక్త
స్సముపైతి ముక్తిమ్ 273

గీ॥ సారహీనమైనట్టి సం।సారమనెడు
కఠినకారాగృహంబునఁ।గనలునట్టి।
మోక్షకామికి శృంఖల।మ్ములుపటుతర
వాసనాత్రయం బందురు।వరలి బుధులు॥
వితరణాన్వితమతులగు। విబుధ వరుల
వాసనాత్రయ ముక్తియే। భవవిముక్తి॥

జలాది సమ్పర్కవశాత్ప్ర భూతదుర్గన్ధధూతా గురుదివ్యవాసనా,
సఙ్ఘర్షణేనైవ విభాతి సమ్యగ్విధూయమానే సతి బాహ్యగన్ధే 274

ఆ.వె॥ తడియుజలముననగరుఁ।దాల్చు దుర్గంధమ్ము
నగరుసహజగంధ। మణగుటొప్పు।
నలుప మరలనచట।గలుఁగు సుగంధంబు।
తొలఁగిపోవదాని। తొలిగుణమ్ము॥

అన్తశ్శ్రితానన్త దురన్తవాసనాధూళీవిలిప్తా పరమాత్మవాసనా,
ప్రజ్ఞాతి సంఘర్షణతో విశుద్ధా ప్రతీయతే
చన్దనగంధవత్స్ఫుటమ్॥ 275

గీ॥ అంతరంగపు వాసన।లనెడిదూళి
బ్రహ్మవాసనలను గ్రమ్ము॥ బ్రవిమలతర।
ప్రజ్ఞ యనియెడి రాపిడిఁ।బ్రస్ఫుటమగు
నలుపఁ నొదవు చందనసుగం।ధమ్ము మాడ్కి

అనాత్మవాసనాజాలై స్తిరోభూతాత్మవాసనా,
నిత్యాత్మనిష్ఠయా తేషాం నాశే భాతి స్వయం స్ఫుటమ్ 276

గీ॥ దేహవాసన నరునకుఁ। దీవ్రమైన
నాత్మవాసన నెల్లెడ। నావరించు।
నిత్యమగు నాత్మనిష్ఠ వి।నిర్మలమయి
ఆత్మవాసన భాసించు। నన్ని దిశల॥

యథా యథా ప్రత్యగ వస్థితం మన స్తథా తథా ముఞ్చతి
బాహ్యవాసనామ్,
నిశ్శేష మోక్షే సతి వాసనానా మాత్మానుభూతిః
ప్రతిబంధశూన్యా 277

గీ॥ మనసు బ్రహ్మంబునందు ని।మగ్నమైన
బాహ్యవాసన నరులను। బాయుచుండు।
వాసనలచేతఁ బూర్తిగా। వదలఁబడిన
యట్టి యాత్మానుభూతి ని।రంతరమ్ము॥

## అధ్యాసాపనయము

స్వాత్మన్యేవ సదా స్థిత్వా మనో నశ్యతి యోగినః,
వాసనానాం క్షయశ్చాతః స్వాధ్యాసాపనయం కురు 278

గీ॥ ఆత్మ నిరతము నెలకొన్న। యట్టి మనసు,
క్రమముగ నశించు యోగుల। కమరికగను।
వాసనాత్రయనాశము వలన నీవు
ఆత్మభ్రాంతిని విడనాడు।మయ్య విబుధ॥

తమో ద్వాభ్యాం రజస్సత్త్వాత్ సత్త్వం శుద్ధేన నశ్యతి,
తస్మాత్ సత్త్వ మవష్టభ్య స్వాధ్యాసాపనయం కురు 279

గీ॥ సత్త్వరాజసములఁ దామ। సగుణమణగు,
సత్త్వమున రాజసగుణమ్ముఁ సమసిపోవు।
సత్త్వగుణ మణగెడు శుద్ధ। సత్త్వమునను
త్రిగుణములు నేను శుద్ధసా। త్త్వికతవలన॥
శుద్ధ సత్త్వంబు నూతగా। శోభిలుచును
ఆత్మ భ్రాంతిని విడనాడు। మయ్య విబుధ॥

ప్రారబ్ధం పుష్యతి వపురితి నిశ్చిత్య నిశ్చలః,
ధైర్యమాలంబ్య యత్నేన స్వాధ్యాసాపనయం కురు 280

ఆ॥ పూర్వకర్మఫలము పోషించు దేహంబు
ననుచు నిశ్చయించి। యచల బుద్ధి।
ధైర్యమూని యత్న। తత్పర చిత్తంబు
నాత్మ భ్రాంతి వీడు। మయ్య విబుధ॥

నాహం జీవః పరం బ్రహ్మేత్యతద్వ్యావృత్తి పూర్వకమ్,
వాసనావేగతః ప్రాప్తస్వాధ్యాసాపనయం కురు 281

గీ॥ ధర నసద్వస్తువుల నిరా। కరణసేసి,
నేను జీవుడఁ గానని। నిర్మలుండు।
నిత్యుఁడౌ పరబ్రహ్మగ। నిశ్చయించి,
వాసనావేగమునఁజేసి। ప్రాప్తమైన॥
ఆత్మ భ్రాంతిని విడనాడు। మయ్య విబుధ॥

శ్రుత్యా యుక్త్యా స్వానుభూత్యా జ్ఞాత్వా సార్వాత్మ్య మాత్మనః,
క్వచిదాభాసతః ప్రాప్త స్వాధ్యాసాపనయం కురు 282

ఆ.వె॥ వేదములను శాస్త్ర। విహిత వాక్యంబుల,
స్వానుభవముఁ జేసి। సర్వమునను।
వ్యాప్త బ్రహ్మ నెరిఁగి। యాభాస ప్రాప్తమౌ,
ఆత్మ భ్రాంతి వీడు। మయ్య విబుధ।

అనాదాన విసర్గాభ్యా మీషన్నాస్తి క్రియా మునేః,
తదేకనిష్ఠయా నిత్యం స్వాధ్యాసాపనయం కురు 283

గీ॥ త్యాగమవరి గ్రహముల కన్యంబులైన,
కర్మములు లేవు మునులకుఁ గాన నింక
నిరత మింకఁ దదేకమౌ నిష్ఠతోడ,
నాత్మ భ్రాంతిని విడనాడు మయ్య విబుధ॥

తత్త్వమస్యాది వాక్యోత్థ బ్రహ్మాత్మైకత్వబోధతః,
బ్రహ్మణ్యాత్మత్వ దార్ఢ్యాయ స్వాధ్యాసాపనయం కురు 284

గీ॥ తత్త్వమసి మొదలగు వాక్య దర్శితమగు,
బ్రహ్మ మాత్మయు నొకటను భావనంబు
బ్రహమం దాత్మతను దృఢ పరచుటకును
నాత్మ భ్రాంతిని విడనాడు మయ్య విబుధ॥

అహంభా వస్య దేహేఽస్మి న్నిశ్శేషావిలయావధి,
సావధానేన యుక్త్యాఽఽత్మా స్వాధ్యాసాపనయం కురు 285

గీ॥ మేనిలో నహం భావమ్ము మిగులకుండ,
నాశమగుదాక నాత్మలో నయముమీర,
సావధానత యుక్తిచే స్వాత్మనిష్ఠ
నాత్మ భ్రాంతిని విడనాడు మయ్య విబుధ॥

ప్రతీతి ర్జీవజగతో స్స్వప్నవద్భాతి యావతా,
తావన్నిరంతరం విద్వన్ స్వాధ్యాసాపనయం కురు 286

గీ॥ జగమునందున జీవముల్ స్వప్నమట్లు,
భాసితములగునందాక బ్రహ్మమందు
నిల్పి నిరతము మది నాత్మ నిష్ఠతోడ
నాత్మ భ్రాంతిని విడనాడు మయ్య విబుధ॥

## దేహాభిమానమును విడచుట

నిద్రాయాః లోకవార్తాయాః శబ్దాదేరపి విస్మృతేః,
క్వచిన్నావసరం దత్వా చిన్తయాత్మాన మాత్మని 287

గీ॥ నిదురకును లోకవార్తకు। నిస్వనాది
విషయ సంఘమునకుగాని। విస్మృతికిని।
కొంచె మవకాశమేనియుఁ। గుదుర నీక
నాత్మలో చింతనముసేయు। మాత్మఁగూర్చి॥

మాతాపిత్రోర్మలోద్భూతం మలమాంసమయం వపుః,
త్యక్త్వా చండాలవద్దూరం బ్రహ్మీభూయ కృతీభవ 288

గీ॥ తల్లిదండ్రుల మలము నుద్భవమునొందు,
హేయ మలమాంసమయమగు। కాయమునకు।
దూరమగుచుఁ జండాలునిఁ। దొలఁగు విధము
బ్రహ్మమువయి కృతార్థతఁ। బడయుమయ్య॥

ఘటాకాశం మహాకాశ ఇవాత్మానం పరాత్మని,
విలాప్యాఖండభావేన తూష్ణీం భవ సదా మునే 289

గీ॥ గగనమందు ఘటాంతరా।కాశమువలె
నాత్మ లీనంబుఁ బరమాత్మ। యందొనర్చి।
బ్రహ్మము నఖండ భావముఁ। బొరఁజూచి
మౌనివై విలసిల్లుమా। మాన్యచరిత॥

స్వప్రకాశ మధిష్ఠానం స్వయం భూయ సదాత్మనా,
బ్రహ్మాండమపి పిణ్డాండం త్యజ్యతాం మలభాణ్డవత్ 290

గీ॥ స్వప్రకాశంబు స్వయముగ। స్వాత్మతోడ
సర్వమున కధిష్ఠానము। సంతతమ్ము
తానెయై త్యజియించెడు। దనువు జగము
మలభరాసహ్యభాండము।మాడ్కి శిష్య॥

చిదాత్మని సదాఽఽనందే దేహారూఢా మహంధియమ్,
నివేశ్య లిఙ్గ ముత్సృజ్య కేవలో భవ సర్వదా 291

గీ॥ సతత మానందరూపుఁడౌ। సచ్చిదాత్మ
దేహమున నిబిడమయి సు।స్థిరతనుండు।
నే ననెడి బుద్ధి దృఢముగ। నిల్పి లింగ
దేహమువిడచి యిఁకనద్వి।తీయుఁడవయి॥
ఆత్మరూపంబు సర్వదా।యలరుమయ్య॥

యత్రైష జగదాభాసో దర్పణా_నః పురం యథా,
తద్బ్రహ్మాఽహమితి జ్ఞాత్వా కృతకృత్యో భవిష్యసి 92

గీ॥ ఏ పరబ్రహ్మమందువ। నెల్ల జగము
దర్పణాంతఃపురభ్రాంతి। దర్శితమగు।
నట్టి బ్రహ్మంబు నెరుఁగంగ। నహమటంచు
నగుదు కృతకృత్యుడవు నిశ్చ।యముగ నీవు॥

యత్సత్యభూతం నిజరూపమాద్యం చిదద్వయానంద మరూప
మక్రియమ్,
తదేత్య మిథ్యావపు రుత్సృజైతత్ శైలూషవ ద్వేష ముపాత్త
మాత్మనః 293

గీ॥ స్వస్వరూపుండు నాద్యుండు। సత్యభూత
మద్వయానంద చిద్రూపుఁ। డక్రియుండు।
రూపరహిత పరబ్రహ్మ।లోన నెరిఁగి
వేషము నటుండురంగము। వెడలివిడచు
విధముఁ దనువును ధరణిని। విడువవలయు॥

సర్వాత్మ నా దృశ్యమిదం మృషైవ నైవాహమర్థః
క్షణికత్వదర్శనాత్,
జానామ్యహం సర్వమితి ప్రతీతిః కుతోఽహమాదేః క్షణికస్య
సిద్ధ్యేత్ 294

గీ॥ క్షణికత నహంకారంబు।సత్యమగుట,
నీక్షణాత్మకమగు విశ్వ।మెల్ల మిథ్య।
క్షణికమౌ నహంకారా ద్య। సత్యములకు,
సర్వమెరుఁగుదు నేనను। జ్ఞాన మెటుల॥
సాధ్యమయ్యెడు,ఁదెలియు మ।సాధ్యమంచు॥

అహంపదార్థ స్త్వహ మాదిసాక్షీ, నిత్యం సుషుప్తావపి
భావదర్శనాత్,
బ్రూతే హ్యజో నిత్య ఇతి శ్రుతి స్స్వయం తత్ప్రత్యగాత్మా
సదసద్విలక్షణః 295

గీ॥ ఆత్మ యహమాది వస్తుల। కఖిలసాక్షి,
నిత్యముగ దర్శితంబగు। నిద్రనైన।
శ్రుతులు స్వయముగ నిత్యుం డ। జుండనియెడు
ప్రత్యగాత్మయె సదసద్వి। లక్షణుండు॥

వికారిణాం సర్వవికారవేత్తా, నిత్యావికారో భవితుం సమర్హతి,
మనోరథః స్వప్నసుషుప్తిషు స్ఫుటమ్, పునః పునః
దృష్టమసత్త్వ మేతయోః 296

గీ॥ అంతరంగ వికారంబు।లరయువాఁడు
సతతనిర్వికారుండన। సన్నుతుండు।
స్వప్నము సుషుప్తివాంఛన। సత్త్వదృష్టి।
సారెసారెకు దర్శించు। సంస్ఫుటముగ॥

అతోఽ భిమానం త్యజ మాంసపిండే, పిండాభిమానిన్యపి
బుద్ధి కల్పితే,
కాలత్రయాబాధ్య మఖండబోధం జ్ఞాత్వా స్వమాత్మాన
ముపైహి శాన్తిమ్ 297

ఆ॥ అహమునందుఁ గాయ। మందభిమానంబు
మానవలయు నయ్య। మాన్యచరిత!
మూడుకాలములను। బోధస్వరూపుఁడౌ,
సత్యతేజు నెఱిఁగి। శాంతిఁ గనుము॥

త్యజాభిమానం కులగోత్రనామ రూపాశ్రమే ష్వార్ద్రశవాశ్రితేషు,
లింగస్య ధర్మానపి కర్తృతాదీ స్త్యక్త్వా భవాఖండ
సుఖస్వరూపః 298

గీ॥ వదలు మభిమానమును। గోత్ర వర్ణయుక్త
భావనామాశ్రమార్ద్రశ।వంబునందు।
మానుమా లింగధర్మాభి।మానము నిఁక
కమ్మఖండ సుఖ స్వరూ।పమ్ము శిష్య॥

## అహంకారము

సన్త్యన్యే ప్రతిబంధాః పుంస స్సంసారహేతవో దృష్టాః,
తేషామేవం మూలం ప్రథమవికారో భవత్యహంకారః 299

గీ॥ తొలివికారము, మూలము। దుస్తర భవ,
హేతు వరయ నహంకార।మిఁకను నన్య।
ములగు ప్రతిబంధకములు। మోక్షమునకు,
పురుషునకుఁగల్గు నెరుఁగుము। పుణ్యచరిత॥

యావ త్స్యా త్స్వస్య సంబంధోఽ హంకారేణ దురాత్మనా,
తావన్న లేశమాత్రాఽపి ముక్తి వార్తా విలక్షణా 300

అహంకారగ్రహా న్ముక్త స్స్వరూప ముపపద్యతే,
చన్ద్రవద్విమలః పూర్ణ స్సదానందః స్వయంప్రభః 301

గీ॥ తన కహంకార బంధము। తనరుచుండ
లేదు మోక్షము నరునకు। లేశమైన।
విడువ నహ మను గ్రహ మాత్మ। విధుని దాన
సచ్చిదానంద నిర్మల। స్వప్రకాశ॥
పూర్ణమగు నాత్మరూపము।బొందు నరుఁడు॥

యో వా పురే సోఽహ మితి ప్రతీతో
బుద్ధ్యా ప్రక్లృ ప్తస్తమసాఽతిమూఢయా,
తస్యైవ నిశ్శేషతయా వినాశే
బ్రహ్మాత్మభావః ప్రతిబంధ శూన్యః 302

గీ॥ దేహపురమునఁ బరఁగుచు। సోఽహమనఁగ
తామసగుణంబు మూఢతఁ। దనరునట్టి।
బుద్ధిపాలితుఁడై నట్టి। పురుషునకును
బుద్ధి నశియించినంత సం।పూర్ణముగను॥
బంధరహితము బ్రహ్మాత్మ। భావనమగు॥

బ్రహ్మానందనిధి ర్మహాబలవతాఽహంకారఘోరాహినా
సంవేష్ట్యాత్మని రక్ష్యతే గుణమయైశ్చణ్డై స్త్రిభిర్మ స్తకైః,
విజ్ఞానాఖ్యమహాసినా శ్రుతిమతా విచ్ఛిద్య శీర్షత్రయం
నిర్మూల్యాహిమిమం నిధిం సుఖకరం ధీరోఽనుభోక్తుం క్షమః 303

గీ॥ ప్రబలమగు నహంకృతి యను। బన్నగంబు,
మూడుగుణముల తలలను। మొనసియుండు।
బ్రహ్మసౌఖ్యంబనంగను। బరఁగు నిధిని
కాచుచుండెడు జుట్టి త్రికాలములను॥
శ్రుతిమతంబగు విజ్ఞాన। ఘుటికిచేత,
త్రిగుణనామక శీర్షముల్। ద్రెళ్ళనేయ।
సుకరముగ ధీరునికి నిల। శుద్ధ సత్త్వ
సచ్చిదానంద ధామము। సంక్రమించు॥

యావద్వా యత్కించిద్విష దోషస్ఫూర్తి రస్తి చేద్దేహే,
కథ మారోగ్యాయ భవే త్తద్వ దహంతాఽపి యోగినో
ముక్త్యై 304

ఆ.వె॥ విషము లేశమైన। వెలయుచో దేహంబు,
స్వస్థ తెటులు దొరఁకు। వ్యాధి తొలఁగి।
మోక్షమెటులఁగల్గు। మునుల కహంకృతి,
తొలఁగకున్న యెడలఁ। దోయజాక్ష॥

అహమోఽత్యన్త నివృత్త్యా తత్కృత నానావికల్ప సంహృత్యా,
ప్రత్యక్తత్త్వ వివేకా దిద మహమస్మీతి విన్దతే తత్త్వమ్ 305

గీ॥ అంతరించిన నహంకారమంతయు నిఁక,
నితరమైన వికారంబు। లెల్ల దొలఁగఁ।
బ్రత్యగాత్మ స్వభావము। బాగుగఁగన,
బ్రహ్మ మే వను భావన। ప్రస్ఫుటమగు॥

అహంకారే కర్త వ్య హమితి మతిం ముఞ్చ సహసా
వికారాత్మ న్యాత్మప్రతిఫలజుషి స్వస్థితి ముషి,
యదధ్యాసా త్ప్రాప్తా జని మృతి జరా దుఃఖ బహులా,
ప్రతీచ శ్చిన్మూర్తే స్తవ సుఖతనో స్సంసృతి రియమ్ 306

గీ॥ వివిధ వికృతుల నాత్మ బింబితమగుటను
ఆత్మగౌరవ మటగారి। యంతరించ।
కర్త నేనను భావన। కలుఁగు నిహము
అట్టి దురహంకృతిని మాను। మనషు ః రయము॥
ఏ యహంకారమందున। నెసఁగు భ్రాంతి,
జనన మరణ జరాదుఃఖ। సంయుతమగు।
భవము సంప్రాప్త మగును జీ।ద్భావునకును,
అట్టి దురహంకృతిని మాను। మనషు ః రయమె॥

సదైకరూపస్య చిదాత్మనో విభో, రానందమూర్తే రనవద్యకీర్తేః,
నైవాన్యథా క్వాప్యవికారిణ స్తే వినాఽహ మధ్యాస మముష్య
సంసృతిః 307

గీ॥ విభుఁడు చిద్రూపుఁ డనవద్య। విమలకీర్తి
అద్వయానందమూర్తి స।దాఖ్యకాత్మ।
నిర్వికారుఁడవైనట్టి। నీకు జగతి,
నే ననెడి భ్రాంతి సంసృతి। నిశ్చయముగ॥
కలుఁగ దంతకు నన్యమౌ। కారణమ్ము
మృత్యుసంసారమునకు గ్ర।హించ ధరణి॥

తస్మాదహంకార మిమం స్వ శత్రుం భోక్తు ర్గళే
కణ్టకవ త్ప్రతీతమ్,
విచ్ఛిద్య విజ్ఞాన మహాసినా స్ఫుటం, భుఙ్క్ష్వాత్మ సామ్రాజ్య
సుఖం యథేష్టమ్ 308

గీ॥ భోక్త కంఠము నిరికిన। ముల్లువోలె
నాత్మశత్రు వహంకార। మట్టిదాని।
జ్ఞానఖడ్గాన ఖండించి। సరభసమున,
నాత్మ సామ్రాజ్య సౌఖ్యము। ననుభవించు॥

తతోఽహ మాదేర్వినివ_ర్త్య వృ_త్తిం, సంత్య_క్తరాగః
పరమార్థలాభాత్,
తూష్ణీం సమాస్స్వాత్మ సుఖానుభూత్యా పూర్ణాత్మనా బ్రహ్మణి
నిర్వికల్పః 309

గీ॥ తొలుత నహమాది వృత్తులఁ। దొలఁగఁద్రోసి,
రాగమును వీడి పరమార్థ। లాభమునను।
నిర్వికల్ప పరబ్రహ్మ। నిండుమనసు
నిష్క్రియత్వముఁ జెలఁగుచు నిశ్చలముగ॥
ఆత్మసౌఖ్యానుభూతి నీ।వాత్మఁ గనుమ॥

సమూల కృత్తోఽపి మహానహం పున
ర్వ్యుల్లేఖిత స్స్యాద్యది చేతసా క్షణమ్,
సంజీవ్య విక్షేపశతం కరోతి
నభస్వతా ప్రావృషి వారి దో యథా 310

గీ॥ మూలమునకు నహంకృతి। పూర్ణముగను
త్రుంచఁబడినంత మరల జ।నించు మదిని।
ఊహ యొదవిన క్షణమందె। యుద్భవమగు
ననిల కర్షిత ప్రావృట్ప।యోదముటుల॥

నిగృహ్య శత్రో రహమోఽవకాశః క్వచిన్న దేయో
విషయానుచింతయా,
స ఏవ సంజీవనహేతు రస్య ప్రక్షీణజంబీరతరో రివాంబు 311

గీ॥ నిగ్రహించి యహంకృతి। నిరవకాశ
ముగను జేయంగవలయును। ముఖ్యముగను।
నిలుపఁగోరిన మనసును। నిశ్చలముగ
విషయచింతన గూడదు। వీసమైన॥

నీరసించిన నిమ్మకు। నీరమట్లు
మృతుల కిల సంజీవని। హితవు విధము।
విషయచింతన మదిఁజేయు। విబుధవర్య
ప్రభవమగు నహంకారము। ప్రబలమగును॥

## కర్మ పరిత్యాగము - జీవన్ముక్తి

దేహాత్మనా సంస్థిత ఏవ కామీ విలక్షణః కామయితా కథం స్యాత్,
అతోఽర్థ సంధాన పరత్వమేవ భేదప్రసక్త్యా భవబంధహేతుః 312

గీ॥ దేహమందున వెలకొని।శిరముగాను
విషయవాంఛాపరుండయి। వెలయునరుఁడు।
బ్రహ్మ మెట్లగు విషయులం పటుఁడుగాగ,
బేద దృష్టిని విషయసఁ। ప్రీతి।గలుఁగ॥
నిలను భవబంధహేతువౌ। నెల్లరకును॥

కార్యప్రవర్ధనా ద్బీజప్రవృద్ధిః పరిదృశ్యతే,
కార్యనాశా ద్బీజనాశ స్తస్మాత్కార్యం నిరోధయేత్ 313

గీ॥ కృత్యసంవృద్ధి బీజప్ర।వృద్ధి కల్గుఁగు।
కార్యనాశంబు బీజ వి।కల్పమగును।
కాన విషయార్థ మొనరించు। కార్యములను
యుక్తము పరిపూర్ణంబుగ। నుజ్జగించు॥

వాసనావృద్ధితః కార్యం కార్యవృద్ధ్యా చ వాసనా,
వర్ధతే సర్వథా పుంస స్సంసారో న నివర్తతే 314

గీ॥ విషయవాసన గార్యంబు। వృద్ధినొందు
వాసనయుఁ గార్యవృద్ధి వి।వర్ధితమగు।
సర్వవిధములఁ బుడమి సం।సారమిటుల
నెడతెగకయుండుఁ బురుమిని। కెల్లపుడును॥

సంసారబంధవిచ్ఛిత్త్యై తద్ద్వయం ప్రదహే ద్యతిః,
వాసనావృద్ధి రేతాభ్యాం చిన్తయా క్రియయా బహిః 315

గీ॥ చింతనంబునఁ, గార్యంబుచేత నెదుగు,
వాసనలు గాన భవబంధపాశముడువ
వాసనల వాని వృత్తులవరుసఁజేసి
దగ్ధమొనరింప లెస్సగఁదగు యతులకు॥

తాభ్యాం ప్రవర్ధమానా సా సూతే సంసృతి మాత్మనః,
త్రయాణాం చ క్షయోపాయ స్సర్వావస్థాసు సర్వదా 316

సర్వత్ర సర్వత స్సర్వం బ్రహ్మమాత్రావలోకనైః,
సద్భావవాసనాదార్ఢ్యా త్తత్త్రయం లయ మశ్నుతే 317

గీ॥ వర్ధితంబగు దృఢతర వాసనలను
సిద్ధమగును సంసారంబు జీవుని కిల
క్షయమొనర్పగ వృత్తివా సనలభవము
మూడవస్థలయందను ముఖ్యమంచు॥
నరయు, నంతట, నన్ని వేళలను ధృతిగ
సర్వమును బ్రహ్మమనియెడి సత్యదృష్టి
సత్త్వవాసనాబలమున సంస్కృతమయి,
వృత్తి, వాసన, భావములు విలయమగును॥

క్రియానాశే భవేచ్చింతానాశోఽ స్మాద్వాసనాక్షయః,
వాసనాప్రక్షయో మోక్ష స్సా జీవన్ముక్తి రిష్యతే 318

గీ॥ చింత నశియించుఁగర్మ నశించినంత,
వాని లయమున నశియించు వాసనలును
మోక్షమనఁగ సకలవాస నాక్షయంబు
అనఘ! యదియె జీవన్ముక్తి యని యెరుఁగుము॥

సద్వాసనాస్ఫూర్తి విజృంభణే సతిహ్యసౌ విలీనా
త్వహమాది వాసనా,
అతి ప్రకృష్టాఽప్య రుణ ప్రభాయాం విలీయతే సాధు యథా
తమిస్రా 319

గీ॥ కారు చీకట్లు సూర్య ప్ర।కాశమునను
నమసిపోయెడి రీతిని। స త్త్వకాంతి।
మదిని యహమాది వాసనల్। మాసిపోవు
నాత్మజిజ్ఞాసువునకు నో।యమలచరిత!

తమ స్తమః కార్య మనర్థజాలం న దృశ్యతే సత్యుదితే దినేశే,
తథాఽద్వయానంద రసామభూతౌ నైవా స్తి బంధో న చ
దుఃఖగంధః 320

గీ॥ చీకటియుఁ జీకటులఁగూడుఁ। జెడుగు లన్ని
సూర్యు డుదయించినంతట। శూన్యమగును।
అద్వయానంద మహితర। సానుభూతి
లేదు బంధము దుఃఖము।లేదు శిష్య!

దృశ్యం ప్రతీతం ప్రవిలాపయన్స్వయం, సన్మాత్రమానందఘనం
విభావయన్,
సమాహితస్సన్ బహిరంతరం వా, కాలం నయేథా స్సతి
కర్మబంధే 321

గీ॥ ప్రవిలయముగాగ దృశ్యము। భావమందు
సచ్చిదానందమూర్తిని। స్వాంతముఁగని।
కట్టువడక బాహ్యంతర। కర్మబంధ
ములకు కాలము గడుపుమో। బుధవరేణ్య!

ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్యః కదాచన,
ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్బ్రహ్మణస్సుతః 322

గీ॥ బ్రహ్మనిష్ఠఁ బ్రమత్తతఁ బడయఁదగదు,
బ్రహ్మనిష్ఠఁ బ్రమత్తుఁడై। వరలుటన్న।
మృత్యువేయగు నంచును। సత్య మిదని
పల్కె భగవానుఁడైనట్టి। బ్రహ్మసుతుఁడు॥

## బ్రహ్మనిష్ఠ - అప్రమత్తత

న ప్రమాదాద నర్థోఽన్యో జ్ఞానిన స్స్వస్వరూపతః,
తతో మోహ స్తతోఽహంధీ స్తతో బంధ స్తతో వ్యథా 323

గీ॥ తలఁచఁగా నిలలోఁ బ్రమాదమున కన్న
బ్రహ్మనిష్ఠున కొండన ర్థమ్ము లేదు।
దాన మోహము బుద్ధిని। దాన నహము
దాన బంధమ్ము దుఃఖము। దానఁ గలుఁగు॥

విషయాభిముఖం దృష్ట్వా విద్వాంసమ పి విస్మృతిః,
విక్షేపయతి ధీదోషై ర్యోషా జారమివ ప్రియమ్ 324

యథా ప్రకృష్టం శైవాలం క్షణమాత్రం న తిష్ఠతి,
ఆవృణోతి తథా మాయా ప్రాజ్ఞం వాఽపి పరాఙ్ముఖమ్ 325

గీ॥ కాంతచూపులు సోకంగఁ। గలఁతఁజెందు
ప్రియుని నెమ్మనము విధమ్ము। నయముగాను।
విషయసంఘాభిముఖుఁడగు। విజ్ఞు మనము
విస్మృతి గలుఁగు బుద్ధియు। విచలితమగు॥
క్షణమునను జుట్టుముట్టెడి। శైవలమన
మాయ ప్రాజ్ఞునిఁదృటిలోఁ బ్రమత్తుఁజేయు॥

లక్ష్యచ్యుతం చేద్యది చిత్తమేష ద్బహిర్ముఖం సన్నివతే
తత స్తతః,
ప్రమాదతః ప్రచ్యుత కేళికన్దుక స్సోపానపఙ్క్తౌ పతితో యథా
తథా 326

గీ॥ లక్ష్యవిచ్యుతిఁ జిత్తము।రయముగాను
బ్రహ్మసంగతి విడివడి। పతనమగును।
మెట్లఁజే జారిపడినట్టి। మేలుబంతి
చివరి మెట్టును దృటిలోనఁ। జేరినట్లు॥

విషయే ష్వావిశ చ్చేతస్సంకల్పయతి తద్గుణాన్,
సమ్యక్సంకల్పనా త్కామః కామా త్పుంసః ప్రవర్తనమ్ 327

గీ॥ మనసు విషయాది సంఘము। మరఁగినంత,
గలుఁగువాని గుణమ్ములు। కల్పనమున
కల్పనంబునఁ గల్గెడుఁగామ మింకఁ।
గామము ప్రవృత్తి నరునకు। గల్గుననఘ!

తత స్స్వరూపవిభ్రంశో విభ్రష్టస్తు పతత్యధః,
పతితస్య వినా నాశం పునర్నారోహ ఈక్ష్యతే 328

గీ॥ ఆత్మరూప విభ్రంశుఁడై।నట్టివాఁడు
పతితుఁడై నాశమొందెడు। వాని కింక।
లేచి స్వాధీనచిత్తుఁడై। రీతిగాను
మరల బ్రహ్మంబుఁ గను టను। మాటలేదు॥

అతః ప్రమాదాన్న పరోఽస్తి మృత్యుః వివేకినో బ్రహ్మవిదో
సమాధౌ।
సమాహితః సిద్ధిముపైతి సమ్యక్సమాహితాత్మా భవ
సావధానః 329

గీ॥ తలఁచ సాధనలో బ్రమాదమునకంటె
నితరముగ మృత్యువన్నది। యెటనులేదు।
చక్కగా నప్రమత్తత। సాధనమున
బ్రహ్మవిదుఁడౌ వివేక నంపన్ను నికిల॥
మానితంబుగ సిద్ధి సమాధినాదవుఁ
గాన సావధానుఁడ వీవుగమ్ము శిష్య॥

## జీవన్ముక్తుడు - దృశ్య నిరాకరణము

సంకల్పం వర్జయే త్తస్మాత్ సర్వానర్థస్యకారణమ్,
జీవతో యస్య కైవల్యం విదేహే చ న కేవలః,
యత్కించి త్పశ్యతో భేదం భయం బ్రూతే యజుశ్రుతిః 330

గీ॥ అన్ని చెడుగుల కారణంబైనయట్టి
తలఁపుఁ, గోరిక విడనాడఁదగవు శిష్య।
అరయ నెవఁడు జీవన్ముక్తుఁ డతఁడు తనువు
విడిచి పరమాత్మ తానగుఁగడకు ననఘ !॥
భేదభావము గనినంత। భీతికల్గు
నంచు బల్కు యజుర్వేదమనఘ వినవొ॥

గీ॥ యదా కదా వాఽపి విపశ్చిదేష బ్రహ్మణ్యనంతేఽ
ప్యణుమాత్రభేదమ్,
పశ్యత్యథాఽముష్య భయం తదైవ యద్వీక్షితం భిన్నతయా
ప్రమాదాత్ 331

గీ॥ కారణం బెయ్యదైనను। గల్పనమున,
నణువు మాత్రమె యైన ననంతునందు।
నెంచభేదముఁ జింతన। నెన్నఁడైనఁ
బ్రాజ్ఞునికి నిల భవభయ। బాధ లొదవు॥

శ్రుతిస్మృతిర్న్యాయ శతైర్నిషిద్ధే దృశ్యేఽత్ర యః
స్వాత్మమతిం కరోతి।
ఉపైతి దుఃఖోపరి దుఃఖజాతం నిషిద్ధకర్తా స మలిమ్లుచో
యథా ॥ ३३२

గీ॥ శ్రుతులు శాస్త్రముల్ న్యాయము। క్షుణ్ణముగను
దృశ్య విశ్వ నిషేధముం। దెల్పుచుండ।
నెవఁడు నేనంచు దర్శించు। నీ జగమును
దొంగవలె నాతఁడొందెడు। దుఃఖములను॥

సత్యాభిసంధానరతోఽవి ముక్తో మహత్త్వ మాత్మీయ ముపైతి
నిత్యమ్.
మిథ్యాభిసంధానరతస్తు నశ్యేత్ దృష్టం తదే తద్యదచౌర
చౌరయోః ॥ ३३३

గీ॥ చోరులకు నన్యులకు నగు। తీరుఁబట్టి
మిధ్యజగద భిరతులకు। మృత్యుగుహయు।
నిరత సత్యాభిరతులకు। నిత్యమైన
వరమమాహాత్మ్యమయు బ్రహ్మ।పదము దొరకు॥

యతి రసదనుసంధిం బంధహేతుం విహాయ
స్వయ మయమహ మస్మీ త్యాత్మదృష్ట్యైవ తిష్ఠేత్,
సుఖయతి నను నిష్ఠా బ్రహ్మణి స్వానుభూత్యా
హరతి పరమవిద్యా కార్యదుఃఖం ప్రతీతమ్ ३३४

గీ॥ ఇలను సంయమి భవబంధ। హేతువైన,
జగము నే నను మోహంబుఁ। జక్క వీడచి।
బ్రహ్మ మే నను భావము। స్వయము గాంచి,
ఆత్మదృష్టిని బ్రహ్మంబు। నధివసించి॥

స్వానుభూతి నచంచల। బ్రహ్మనిష్ఠ,
నిర్మలానందమున నుండు। నిత్యముగను।
నిశ్చలంబుగఁ బరమాత్మ। నిల్పి పరమ
మాయఁ గల్గెడు దుఃఖమ్ము। మాన్పు ననఘ॥

బాహ్యానుసంధిః పరివర్ధయే త్ఫలం, దుర్వాసనామేవ తత
స్తతోఽధికామ్,
జ్ఞాత్వా వివేకైః పరిహృత్యబాహ్యం, స్వాత్మాను సంధిం విదధీత
నిత్యమ్ 335

గీ॥ వర్ధితంబగు నట్టి దు।ర్వాసనంబు
బాహ్యదృశ్యాభిరతిఁ గల్గు। ఫలము ధరణి।
విడువ బాహ్యజగమ్ము వి।వేకమునను
స్వాత్మసంధాన మొనరింప।వలెను శిష్య!

బాహ్యే నిరుద్ధే మనసః ప్రసన్నతా, మనః ప్రసాదే పరమాత్మ
దర్శనమ్,
తస్మిన్ సుదృష్టే భవబంధనాశో, బహిర్నిరోధః పదవీ
విముక్తేః 336

గీ॥ బాహ్య దృశ్య నిరోధంబు।వలన మనసు,
సుప్రసన్నత నొందెడు;। సుప్రసన్న।
మనము పరమాత్మఁ గాంచెడు। మానితముగ;
దాన భవ బంధ నాశంబు। తథ్యమట్టి॥
బాహ్య విలయంబె సన్ముక్తి। పదము శిష్య!॥

కః పండిత స్సన్ సదసద్వివేకీ, శ్రుతిప్రమాణః పరమార్థదర్శీ,
జానన్హి కుర్యా దశతోఽవలంబం, స్వపాతహేతో శ్శిశువ
న్ముముక్షుః 337

గీ॥ వేద విజ్ఞాన ఖని, తత్త్వ విదుఁడు, విమల,
మోక్ష నిరతుఁడు నిత్యస త్పుణ్య వ్రతుఁడు
పండితుండు వివేక సంపన్నుఁ డెవఁడు,
పతన హేతు వటంచును బ్రస్ఫుటముగ
తెలిసి తెలిసియు నభిరతి దృశ్యఁజగతిఁ
బట్టుకొను నల్పబుద్ధియై బాలునివలె ?॥

దేహాది సంసక్తమతో న ముక్తి, ర్ముక్తస్య దేహాద్యభిమత్య భావః,
సుప్తస్య నో జాగరణం న జాగ్రతః స్వప్న స్తయోర్భిన్న గుణాశ్రయత్వాత్ 338

గీ॥ జాగృతస్థితి లేనటు ల్స్వప్నమందు
జాగృతిం స్వప్నముండని సరశిఁ జూడ
భిన్నగుణధర్మ యుక్తులౌ పేర్మికతన
మోక్షమందరు దేహాది మోహయుతులు॥
పుడమి దేహాదులందున మోహమ్రయ
ముక్తునకుఁ గల్గ దెన్నఁడు బుధవరేణ్య॥

అన్తర్బహిః స్వం స్థిరజంగమేషు జ్ఞాత్వాఽఽత్మనాఽధారతయా విలోకయ,
త్యక్తాఖిలోపాధి రఖండరూపః పూర్ణాత్మనా యః స్థిత ఏష ముక్తః 339

సర్వాత్మనా బంధవిముక్తి హేతుః స్సర్వాత్మ భావాన్న పరోఽస్తి కశ్చిత్,
దృశ్యాగ్రహే సత్యుదపద్యతేఽసౌ సర్వాత్మ భావోఽస్య సదాత్మ నిష్ఠయా 340

గీ॥ జంతు జాలంబులందును। జడములందు,
వ్యాప్తమై యొప్పుచును బహిరంతరములు।
ఆత్మ కాధారభూతుం డ।టంచుఁ దెలిసి,
జగతి నెల్ల యుపాధులఁ। జక్కవిడిచి॥
ఆత్మ పరిపూర్ణభావు న। నంతరూపుఁ
నందు నలరారు ముక్తుఁడై।నట్టి ఘనుఁడు॥

గీ॥ దృశ్యస్యాగ్రహణం కథం ను ఘటతే దేహాత్మనో తిష్ఠతో
బాహ్యార్థానుభవప్రసక్త మనసస్తత్ప్రక్రియాం కుర్వతః,
సంన్యస్తాఖిల ధర్మకర్మ విషయై ర్నిత్యాత్మనిష్ఠాపరైః
తత్త్వజ్ఞైః కరణీయమాత్మని సదాఽఽనన్దేచ్ఛుభి ర్యత్నతః 341

గీ॥ విషయలంపటితంబయి। వెలయు మనసు,
దేహ మే నను భావము। స్థిరముగఁ గని।
దేహవృత్తుల నెల్లప్డుఁ। దిరుఁగుచుండి
ఎట్టు దృశ్యనిషేధమ్ము। నెంచఁ గలుఁగు ?॥
సకలకర్మంబు ధర్మంబు। సన్యసించి
విషయసంఘమునందు వి।రక్తిఁజెంది।
ఆత్మనిష్ఠాపరుండయి। యాత్మ తత్త్వ
జ్ఞానియై సచ్చిదానంద। కామి యగుచు॥
యత్నశీలతతో నిత్య। మాత్మయందు
రహి నొనర్చెడు దృశ్య ని।రాకరణము॥

## సమాధి

సర్వాత్మ సిద్ధయే భిక్షోః కృత శ్రవణ కర్మణః,
సమాధిం విదధా త్యేషా శాంతో దాంత ఇతి శ్రుతిః 342

గీ॥ శ్రుతిపరాయణు లైనట్టి। శోధకులగు
నాత్మ తత్త్వార్థ జిజ్ఞాసు।లగు నరులకు।
శమద మాదిక సాధన। సంయుతునకు
శ్రుతియె నియమించెను సమాధి। సులభమనగ॥

ఆరూఢశ క్తే రహమో వినాశః క ర్తుం న శక్య స్సహసాఽపి
పణ్డితైః,
యే నిర్వికల్పాఖ్య సమాధి నిశ్చలా స్తాన న్తరాఽన న్త భవా
హి వాసనాః, 343

గీ॥ గాటమగు నహంకారము। వాటముగను
గాదు శక్యము నాశంబు। గలుఁగఁజేయ।
పండితులకైన, రయముగ। భావమందు
నిర్వికల్ప సమాధిని। నిశ్చలతను॥
వరలు వారల దెవ్వరో। వారి వీడి
వాసన వ్రాతము లనంత। వాహినులుగఁ॥
బుట్టుచున్న వి యల్పుల। ముంచుటకయి॥

అహంబుద్ధ్యైవ మోహిన్యా యోజయిత్వాఽఽ వృతే ర్బలాత్,
విక్షేపశ క్తిః పురుషం విక్షే పయతి తద్గుణైః 344

గీ॥ ప్రబల విక్షేపశ క్తి యా।వరణబలము
మోహద మగు నహంకార। బుద్ధితోడఁ।
కూర్చి రాగాది గుణముల। క్షోభ పెట్టు
పురుషు నిల రాజసగుణమ్ము। పూన్కితోడ॥

విక్షేపశ క్తి విజయో విషమో విధాతుం, నిశ్శేష మావరణశ క్తి
నివృ త్త్యభావే,
దృగ్దృశ్యయోః స్ఫుటపయో జలవద్విభాగే, నశ్యే త్తదాఽఽవరణ
మాత్మని చ స్వభావాత్ 345

గీ॥ పూర్తిగా నావరణశక్తిఁ। బోనణపక,
గెలువ విక్షేపశక్తిని। గ్లిష్టతరము।
క్షీర నీర విభేదపు। తీరుగ నిల,
దృశ్యదృగ్భేద వివరముఁ। దెలిసినంత
జ్ఞానమున సదసద్వివే।కమ్ము కలుఁగ
విడచు నావృతగుణము వి।వేకవంతు॥

నిస్సంశయేన భవతి ప్రతిబంధ శూన్యో
విక్షేపణం న హి తదా యది చేన్మృషార్థే,
"సమ్యగ్వివేకః స్ఫుటబోధజన్యో,
విభజ్య దృగ్దృశ్య పదార్థ తత్త్వమ్
భినత్తి మాయాకృత మోహబన్ధం
యస్మా ద్విముక్తస్య పున ర్న సంసృతిః" 346

గీ॥ మిథ్య జగమందు నాసక్తి। మృగ్యమైన,
బంధమోక్షము తథ్యము। ప్రస్ఫుటమ్ము।
జ్ఞాన జనిత వివేకము। చక్కగాను,
దృశ్య దృగ్విభజనమును। దీర్చ వస్తు।
తత్త్వము నెరింగి మాయచేఁ।దగుటబంధ
ఛేదనము సేయ ముక్తులు। లేదు భవము॥

పరావరైకత్వ వివేక వహ్ని ర్దహత్య విద్యాగహనం హ్యశేషమ్,
కిం స్యాత్పునస్సంసరణస్య బీజమద్వైత భావం
సముపేయుషోఽస్య 347

గీ॥ బ్రహ్మమును జీవుఁ డొకఁ డను।బ్రస్ఫుటమగు
జ్ఞానదావాగ్ని మాయవ।నమ్ముఁగాల్చు।
జీవ బ్రహ్మైక్యతాభావ। చిత్తునందు
మరల సంసార బీజమః। మొలచు నెట్లు !॥

ఆవరణస్య నివృత్తి ర్భవతి చ సమ్యక్పదార్థ దర్శనతః,
మిథ్యాజ్ఞాన వినాశ స్తద్వద్విక్షేప జనితదుఃఖ నివృత్తిః 348

ఆ.వె॥ చక్కగ నిజ వస్తు। సందర్శనంబుచే,
మాయ తెరలు తొలఁగు।మనుజులకును।
మిథ్య యెరుక తొలఁగ।మిగులఁ జంచలమగు,
రాగజనితదుఃఖ।మేగు ననఘ

ఏత త్త్రితయం దృష్టం సమ్యగ్రజ్జు స్వరూప విజ్ఞానాత్,
తస్మా ద్వస్తుస తత్త్వం జ్ఞాతవ్యం బంధముక్తయే విదుషా 349

గీ॥ రజ్జురూపం బెరుంగుట। లయ మగు నిల,
సర్పభావము జ్ఞానమ్ము। సంక్రమించు।
ఆవరణ, భ్రాంతి త్రిగుణమ్ము। లనెడి మూడు
జ్ఞాన సంప్రాప్తి సాంతము। సమసిపోవు॥
గాన వస్తు విజ్ఞానంబుఁ। గాంచవలయు
బంధ మోక్షాభిరతులగు। పండితులకు॥

అయోఽగ్ని యోగాదివ సత్సమన్వయాత్
మాత్రాది రూపేణ విజృంభతే ధీః,
తత్కార్య మేత త్త్రితయం యతో మృషా
దృష్టం భ్రమ స్వప్న మనోరథేషు॥ 350

గీ॥ నిప్పుగూడిన యినుమట్లు। నిత్యుఁడైన
బ్రహ్మసంయుతమగు బుద్ధి। శ్రవణమాది।
మాత్రరూపము వెల్గెడు। మానితముగ
భ్రాంతి, స్వప్న, మనోరథః భావములనఁ॥
బరఁగు మూడును మిథ్యా।ప। భావజములు,
బుద్ధి కార్యము లివి మూడు। బుధవరేణ్య॥

తతో వికారాః ప్రకృతేరహమ్ముఖాః,
దేహావసానా విషయాశ్చ సర్వే।
క్షణేఽన్యథా భావితయా హ్యమీషాం,
అసత్త్వ మాత్మా తు కదాఽపి నాఽన్యథా॥ 351

గీ॥ కాన నన్యథా భావిత। క్షణికములగు
ప్రకృతిఁగల యహంకారాది। వికృతులెల్ల।
తనువుతో నంతములగు మా।త్రాచయమ్ము
సత్సదృశ్యములు, పంతత। సత్యమాత్మ॥

నిత్యాద్వయాఖండ చిదేకరూపో, బుద్ధ్యాది సాక్షీ సదసద్విలక్షణః,
అహంపదప్రత్యయలక్షితార్థః ప్రత్యక్సదాఽఽనందఘనః
పరాత్మా 352

గీ॥ అద్వయాఖండ పరమాత్మ। యహ మనియెడు
సంజ్ఞ లక్షితార్థయుతుండు। సత్యతేజుఁ।
డఖిల బుద్ధ్యాది సాక్షి య। నంతుఁడు పద
సద్విలక్షణుఁ డేకుఁడు। సత్త్వకాంతి॥
వ యుండుఁడు చిద్రూపు డానంద।మయుఁడు ఘనుఁడు॥

ఇత్థం విపశ్చి త్సదసద్విభజ్య, నిశ్చిత్య తత్త్వం నిజబోధ
దృష్ట్యా,
జ్ఞాత్వా స్వమాత్మాన మఖండబోధం, తేభ్యో విముక్తః
స్వయమేవ శామ్యతి 353

గీ॥ పండితుం డిట్లు సదసద్వి। భజన సేసి,
ఆత్మ తత్త్వావబోధము। స్వాత్మ నెరిఁగి।
జ్ఞాన తేజస్విఁ బరమాత్మ। నేనె యంచు
మోహదములౌ నహంకార। దేహముల వి।
ముక్తుఁడై స్వయముగ శాంతిఁ।బొందు ననఘ॥

అజ్ఞాన హృదయగ్రన్థే ర్నిశ్శేష విలయ స్తదా,
సమాధినాఽవికల్పేన యదాఽద్వైతాత్మ దర్శనమ్ 354

గీ॥ నిర్వికల్ప సమాధిని। నిత్యుఁడై వ
అద్వితీయాత్మ దర్శనమైన యపుడు।
ఇలను బురుషుని యజ్ఞాన। హృదయగ్రంధి
విలయమగును బూర్ణంబుగ। విబుధవర్య॥

త్వమహ మిద మితీయం కల్పనా బుద్ధిదోషాత్
ప్రభవతి పరమాత్మ న్యద్వయే నిర్విశేషే,
ప్రవిలసతి సమాధా వస్య సర్వో వికల్పో
విలయన ముపగచ్ఛేద్వస్తు తత్త్వావధృత్యా॥ 355

గీ॥ త్వమహమిద మను గల్పనఁ। దారతమ్య,
బుద్ధిదోషముచేతను। బుట్టుచుండు।
నిర్విశేషాద్వయబ్రహ్మ। నిఖిలకాంతి,
వస్తు తత్త్వావధారణ।వలన బుద్ధి॥
దోష మేగు సమాధి ని।శ్శేషముగను॥

శాన్తో దాన్తః పరముపరతః క్షాన్తియుక్త స్సమాధిం
కుర్వ న్నిత్యం కలయతి యతిః స్వస్య సర్వాత్మభావమ్,
తేనా విద్యాతిమిరజనితాన్ సాధు దగ్ధ్వా వికల్పాన్
బ్రహ్మకృత్యా నివసతి సుఖం నిష్క్రియో నిర్వికల్పః 356

గీ॥ శాన్తుఁడు పరమోపరతుఁడు। దాన్తుఁడై స
క్షమయుతుండు సమాధి ని।శ్చలమనంబు।
తనదు సర్వాత్మభావంబుఁ। దానెరుంగు
అట్టి పరమాత్మ భావము।నలరు కతన
అజ్ఞతాజన్య భ్రాంతుల। సాంతముగను
దగ్ధమొనరించి పరమాత్మ। తత్పరుఁడయి।
నిర్వికల్పుండు నిశ్చల। నిష్క్రియుఁడగు
బ్రహ్మమై పదానందాను। భవముపొందు॥

సమాహితా యే ప్రవిలాప్య బాహ్యం శ్రోత్రాది చేతః స్వమహం చిదాత్మని,
త ఏవ ముక్తా భవపాశబంధై ర్నాన్యే తు పారోక్ష్య కథాభిధాయినః 357

గీ॥ విషయముల నింద్రియంబుల, విబుధవర్య!
చిత్తమును నాది నేనను చింతనమును
జెరచి పూర్తిగ నెవ్వరు చిన్మయాత్మ
నిత్యము వినిశ్చలాత్ములై నిలుచువారు
బ్రహ్మరూపులు భవబంధ రహితు లితర
జను లముక్తు లసత్కథా శ్రవణరతులు॥

ఉపాధి భేదా త్స్వయమేవ భిద్యతే, చోపాధ్యపోహే స్వయమేవ కేవలః,
తస్మా దుపాధే ర్విలయాయ విద్వా, న్వసే త్సదాఽకల్ప సమాధి నిష్ఠయా 358

గీ॥ వివిధమైన యుపాధుల వెలయుఁగాన
బ్రహ్మ మగుపించుభేద భావంబుతోడ
సకలమౌ నుపాధుల వినాశనమువలన
నిర్వికల్ప సమాధిని నిలుచు బుధుఁడు॥

సతి సక్తో నరో యాతి సద్భావం హ్యేక నిష్ఠయా,
కీటకో భ్రమరం ధ్యాయ న్భ్రమరత్వాయ కల్పతే 359

గీ॥ బ్రహ్మమునఁ దదేకాసక్తిఁ బరఁగు నరుఁడు,
బ్రహ్మనిష్ఠను బ్రహ్మత్వ పదమునొందు
భ్రమరమును గీటకముఁదత్పరత గాంచి
భ్రమరమగుటకు నర్హతఁ బడయు విధము॥

క్రియాన్తరాసక్తి మపాస్య కీటకో ధ్యాయన్నలిత్వం హ్యలిభావ
మృచ్ఛతి,
తథైవ యోగీ పరమాత్మ తత్త్వం ధ్యాత్వా సమాయాతి తదేక
నిష్ఠయా 360

గీ॥ భ్రమదరూపము ధ్యానించి। భావమందు
కీటకము నిష్క్రియాసక్తిఁ। దేటియగును।
తత్పరుండయి పరమాత్మ। తత్త్వమందు
బ్రహ్మరూపంబు యోగితాఁ।బడయు చుండు॥

అతీవసూక్ష్మం పరమాత్మ తత్త్వం న స్థూలదృష్ట్యా ప్రతిపత్తు
మర్హతి,
సమాధినాఽత్యన్తసుసూక్ష్మ వృత్త్యా, జ్ఞాతవ్యమార్యై రతిశుద్ధ
బుద్ధిభిః 361

గీ॥ ఆత్మతత్త్వం బమితసూక్ష్మ।మైన దనఘ,
స్థూలదృష్టి కొకింతయుఁ। జూడరాదు।
శుద్ధ బుద్ధులౌ నార్యులు। సూక్ష్మవృత్తి
బ్రహ్మము సమాధిఁగందురు। భాగ్యధనులు॥

యథా సువర్ణం పుటపాక శోధితం
త్యక్త్వా మలం స్వాత్మగుణం సమృచ్ఛతి,
తథా మనస్సత్త్వరజస్తమోమలం
ధ్యానేన సన్త్యజ్య సమేతి తత్త్వమ్। 362

గీ॥ మలినమును వీడి తన గుణ।మహిమ మెరయు
పుటమువెట్టఁగ శుద్ధమౌ। పుత్తడివలె
త్రిగుణమలినము ధ్యానంబుఁ। దెగిన మనసు
బ్రహ్మరూపముఁ దానొంది। ప్రజ్వరిల్లు॥

నిర_న్తరాభ్యాస వశా_త్తది త్థం, పక్వం మనో బ్రహ్మణి లీయతే
యదా,
తదా సమాధి స్సవికల్పవర్జిత స్స్వతోఽద్వయానంద రసాను
భావకః 363

గీ॥ సంతతాభ్యాసపక్వమౌ। స్వాంత మెపుడు
బ్రహ్మమందు విలీనమై। ప్రభలఁజల్లు।
నప్పు డద్వయానంద ర। సానుభవము
నిర్వికల్ప సమాధిని। నిత్య మొందు॥

సమాధినాఽనేన సమ_స్త వాసనా గ్రంథే ర్వినాశోఽఖిలకర్మనాశః,
అ_న్తర్బహిస్సర్వత ఏవ సర్వదా స్వరూపవిస్ఫూ_ర్తి రయత్న
తస్స్యాత్ 364

గీ॥ సర్వవాసనా గ్రంధి నా।శమున నఖిల,
కర్మనాశనము సమాధిఁ। గల్గుచుండు।
త_త్త్వ విస్ఫూ_ర్తి సర్వత్ర। దానఁగలుఁగు
న ప్రయత్నత సర్వత్ర। యనఘ ! వినుము॥

శ్రుతే శ్శతగుణం విద్యా న్మననం మననాదపి,
నిదిధ్యాసం లక్షగుణ మన_న్తం నిర్వికల్పకమ్ 365

గీ॥ శ్రవణమునకంటె మననము। శతగుణంబు,
మననమునకు నిదిధ్యాస। మనిన లక్ష।
రెట్లు మేలగును, సమాధి। లెఖ్ఖలేని
యంత శ్రేష్ఠం బటంచు నీ। వరయుమయ్య॥

నిర్వికల్పక సమాధినా స్ఫుటం, బ్రహ్మ త_త్త్వ మవగమ్యతే
ధ్రువమ్,
నాన్యథా చలతయా మనోగతేః ప్రత్యయా_న్తరవి మిశ్రితం
భవేత్ 366

గీ॥ బ్రహ్మతత్త్వావబోధన। ప్రస్ఫుటమగు
నిర్వికల్ప సమాధిలో। నిశ్చయముగ,।
నన్యథా మది చంచలం। బగుటచేత
నవ్య భావసమ్మి శ్రితం।బగును మనసు॥

అత స్స మాధత్స్వ యతేన్ద్రియ స్సదా, నిరంతరం శాంతమనాః
ప్రతీచి,
విధ్వంసయా ధ్వా న్త మనాద్య విద్యయాఽఽవృతం తదేకత్వ
విలోకనేన 367

గీ॥ సతత మింద్రియ సంఘమ్ము। సంయమించి,
శాంతచి త్తంబుతోడ ని।రంతరంబు।
అంతరాత్మ మనంబున। నట్టె నిల్పి,
బ్రహ్మముఁ దదేక చి త్తంబు। బాగుగఁగన॥
నజ్ఞతాతిమిరం బెల్ల। నంతరించు॥

## సాధన వైరాగ్యము

యోగస్య ప్రథమద్వారం వాఙ్నిరోధో ఽపరిగ్రహః,
నిరాశా చ నిరీహా చ నిత్యమేకా న్త శీలతా 368

గీ॥ ఇన్ద్రియా పరిగ్రహము ని।రీహము నిఁక
నిత్యయేకాంత నై రాశ్య। నియమములను।
వాగ్నిరోధంబు ప్రథమమౌ।ద్వారముం డు
యోగులకు గమ్య సిద్ధికి। యోగపథము॥

ఏకాంతస్థితి రింద్రియోపరమణే హేతుర్దమశ్చేతస
స్సంరోధే కరణం శమేన విలయం యాయా దహంవాసనా,
తేనానన్దరసానుభూతి రచలా బ్రాహ్మీ సదాయోగిన
స్తస్మాచ్చి త్తనిరోధ ఏవ సతతం కార్యః ప్రయత్నా న్మునేః 369

అ.వె॥ ఇంద్రియోపరతికి। హేతు వేకాంతంబు,
దమము చిత్త నియతిఁ।దగుకరణము।
శమముచే నశించు। సొంతమహంకార
వాసనలు లభించు। బ్రహ్మవశము॥

గీ॥ నిత్య సచ్చిదానందంబు। నిశ్చయముగ
అచల పరిపూర్ణ సౌఖ్య ర।సానుభూతి।
యోగివరునికి సిద్ధించు। నుర్వియందుఁ
గాన చిత్తనిరోధంబు। ఘన మునులకు॥
యత్నశీలత నొనరింపఁ।దగును శిష్య॥

వాచం నియచ్ఛాత్మని తం నియచ్ఛ
బుద్ధౌ ధియం యచ్ఛ చ బుద్ధి సాక్షిణి,
తం చాపి పూర్ణాత్మని నిర్వికల్పే
విలాప్య శాంతిం పరమాం భజస్వ 370

గీ॥ వాక్కు నియమించి యాత్మచే। వారిజాక్ష!
ఆత్మ బుద్ధిని దిరముగ। నమరనిమ్ము।
బుద్ధి నిల్పుము సాక్షిని। బుధవరేణ్య!
సాక్షి పరిపూర్ణబ్రహ్మంబు। నైక్యపరచి॥
పరమశాంతి ధామంబును। బడయుమయ్య॥

దేహప్రాణేన్ద్రియమనో బుద్ధ్యాదిభి రుపాధిభిః,
యైర్యై ర్వృత్తే స్సమాయోగ స్తత్తద్భావోఽస్య యోగినః 371

గీ॥ తనువు, ప్రాణేంద్రియంబులు। మనసుబుద్ధి,
మొదలగు నుపాధులం దెందు।మెదలు నాత్మ।
యోగి కావృత్తులందు సం।యుక్తుఁడగుట
భావచాంచల్య మొదవెడుఁ। బండితాఢ్య!॥

తస్మి వృత్త్యా మునే స్సమ్యక్ సర్వోప రమణం సుఖమ్,
సందృశ్యతే సదానందరసాను భవ విప్లవః 372

గీ॥ చిత్త వృత్తులఁ దొలఁగించి! శీఘ్రగతిని
మునులు సర్వోప రతి సుఖ!మ్ములను బడసి!
సచ్చిదానందరససింధు! జలక సౌఖ్య
స్ఫురణ మొందెడు సత్యార్థ! సాధనంబు॥

అన్తస్త్యాగో బహిస్త్యాగో విరక్తస్యైవ యుజ్యతే,
త్యజత్యం తర్బహిస్సంగం విరక్తస్తు ముముక్షయా 373

గీ॥ అరయ బాహ్యంతర త్యాగ!మవనియందు
తగవు వైరాగ్యధనునకు, దానివలన!
మోక్షగామి విరక్తి స! మూలముగను
తగులు విడచు బాహ్యముల నం!తరములందు॥

బహిస్తు విషయైస్సంగం తథాఽన్త రహమాదిభిః,
విరక్త యేవ శక్నోతి త్యక్తుం బ్రహ్మణి నిష్ఠతః 374

ఆ.వె॥ బాహ్య విషయములను! బ్రబడిలెడు నాసక్తి,
నంతరంగ వాస!నాది సంగ!
మును బరిత్యజించి! మోదంబునందుట,
బ్రహ్మనిష్ఠుఁడైన! వానికిఁ దగు॥

వైరాగ్యబోధౌ పురుషస్య పక్షివత్
పక్షౌ విజానీహి విచక్షణ త్వమ్!
విముక్తి సౌధాగ్రలతాధిరోహణం
తాభ్యాం వినా నాన్యతరేణ సిద్ధ్యతి 375

గీ॥ జ్ఞాన వైరాగ్యము లను ఋక్షములు రెండు
అనఘ; తెలియుము పురుష వి।హంగమునకు।
మోక్షసౌధాగ్రగలత నెక్కఁ।బోవుటకును
అండజమున కసాధ్యమా। రెండు లేక॥

అత్యంత వైరాగ్య వతస్సమాధి స్సమాహితస్యైవ దృఢప్రబోధః,
ప్రబుద్ధతత్త్వస్య హి బంధ ముక్తి ర్ముక్తాత్మనో నిత్య
సుఖానుభూతిః 376

గీ॥ మిగుల వైరాగ్యము సమాధి। మెదలకుండు,
ఘనున కొనగూడు దృఢమగు। జ్ఞాన ధనము।
బోద్ధలకు నిల భవబంధ। ముక్తి కలుఁగు
ముక్తునికి నిత్యసౌఖ్యాను।భూతి యొదవు॥

వైరాగ్యాన్న పరం సుఖస్య జనకం పశ్యామి వశ్యాత్మనః,
తచ్చే చ్ఛుద్ధతరాత్మబోధ సహితం స్వారాజ్య సామ్రాజ్యధుక్,
ఏతద్ద్వార మజస్రము క్తియువతే ర్యస్మా త్త్వ మస్మాత్పరం
సర్వత్రాస్పృహయా సదాత్మని సదా ప్రజ్ఞాం కురు శ్రేయసే 377

గీ॥ బుధవరేణ్య! వైరాగ్య స।త్ఫలమునకును
కలుఁగ దితరము సుఖజన।కమ్ము ధరణి।
అట్టి వైరాగ్య మమలత। రాత్మబోధ,
సంయుతం బాత్మ సామ్రాజ్య। చక్రదాయి.॥

ముక్తి కాంతా పరిష్వంగ।మునకు ద్వార
మగుట వైరాగ్య మిఁకఁ బర।మాత్మయందు।
ప్రజ్ఞఁ గూర్చుము సన్ముక్తి। పథము కొరకు,
సర్వవస్తు విరక్తిని। జక్రజేసి॥

ఆశాం ఛిన్ధి విషోపమేషు విషయేష్వేషైవ మృత్యోః కృతిః
త్యక్త్వా జాతికులాశ్రమే ష్వభిమతం ముఞ్చాతిదూరా త్క్రియాః,
దేహాదావసతి త్యజాత్మధిషణాం ప్రజ్ఞాం కురుష్వాత్మని
త్వం ద్రష్టా స్యమనోఽసి నిర్ద్వయపరం బ్రహ్మాసి
యద్వస్తుతః 378

గీ॥ విషసదృశమగు విషయాశ। విడువుమయ్య।
విషయవాంఛలు సంసార। వికృతులయ్య।
కులము జాతిని ధర్మముఁ। గూర్చి విడచి,
కర్మముల దూరమొనరించి। కాయమందు॥

నేను నా దను బుద్ధిని।మాని ప్రజ్ఞ
నాత్మ నే నను భావన। నలరుమయ్య।
ద్రష్ట వమనస్కుఁడవిఁక వా స్తవము నీవు
అద్వయు బ్రహ్మమను పర।మాత్మ వీవు॥

## ధ్యానము

లక్ష్యే బ్రహ్మణి మానసం దృఢతరం సంస్థాప్య బాహ్యేంద్రియం,
సంస్థానే వినివేశ్య నిశ్చలతను శ్చోపేక్ష్య దేహే స్థితిమ్,
బ్రహ్మాత్మైక్య ముపేత్య తన్మయతయా చాఖణ్డ వృత్త్యానిశం
బ్రహానంద రసం పి బాత్మని ముదా శూన్యైః
కిమన్యైర్భ్రమైః॥ 379

గీ॥ బ్రహ్మలక్ష్యముగ మది స్థి।రముగ నిల్పి,
ఇంద్రియంబులఁ దమచోట్ల। నిముడఁజేసి।
తనువు నిశ్చలముగ నిల్పి। తత్పరతను,
దేహభావ ముపేక్షించి। దృఢముగాను॥

బ్రహ్మమే నను భావనఁ। బరవశించి,
సచ్చిదానంద రసపాన। సక్తుఁడగుచు
సంతతము బ్రహ్మరూపముఁ। సంతసించు
వాని కన్యంబు శూన్యము। పండితాఢ్య!॥

అనాత్మ చింతనం త్యక్త్వా కశ్మలం దుఃఖకారణమ్,
చిన్తయాత్మాన మానందరూపం యన్ముక్తి కారణమ్ 380

గీ॥ మోహదము దుఃఖసరసికి। మూలమగు న
నాత్మచింతన విడనాడి। యాత్మలోన।
మోక్షకారణమగు బ్రహ్మ। మోదభావ
మైన పరమాత్మఁ జింతించు। మనవరతము॥

## ఆత్మజ్ఞానము, అద్వైతము

ఏషస్స్వయం జ్యోతిరశేషసాక్షీ విజ్ఞానకోశో విలసత్యజస్రమ్,
లక్ష్యం విధాయైన మసద్విలక్షణ మఖండవృత్త్యాఽఽ
త్మతయాఽనుభావయ 381

గీ॥ జ్ఞాననిలయము నిశ్శేష। సర్వసాక్షి
అనవరతము విరాజిల్లు। నాత్మజ్యోతి।
లక్ష్యముగ నిలిపి యసద్వి। లక్షణుని య
ఖండసద్వృత్తి భోగించఁ। గరము తగవు॥

ఏత మచ్ఛిన్నయా వృత్త్యా ప్రత్యయాన్తరశూన్యయా,
ఉల్లేఖయ న్విజానీయా త్స్వస్వరూపతయా స్ఫుటమ్ 382

గీ॥ ఈ యఖండ సంవృత్తిచే। నెంచి మదిని,
ప్రత్యయాంతరశూన్యమౌ। బ్రహ్మమందు।
స్వస్వరూపానుభవముచేఁ। బ్రస్ఫుటముగ,
నరయువలయును శిష్య! పరాత్మరూపు॥

అత్రాత్మత్వం దృఢీకుర్వ న్నహమాదిషు సంత్యజన్,
ఉదాసీనతయా తేషు తిష్ఠేత్ స్ఫుటఘటాదివత్ 383

గీ॥ బ్రహ్మమందాత్మ తను దృఢ। పరచి సకల
వికృతుల నిరతిచే వీడి। విశ్వమందు।
ఓడుబోసిన కుండయుఁ। దుండునట్టి
కడు నుదాసీనదృష్టిచేఁ। గాంచవలయు॥

విశుద్ధ మన్తఃకరణం స్వరూపే నివేశ్య సాక్షిణ్యవబోధమాత్రే,
శనైః శనై ర్నిశ్చలతా ముపానయ న్పూర్ణం స్వమేవాను
విలోకయే త్తతః 384

గీ॥ నిర్మలాంతః కరణమును। నిత్యసాక్షి
జ్ఞానరూపముఁగూరిచి। స్వస్వరూప।
మందుఁ గ్రమముగ నిశ్చలం।బౌ మనంబు
పూర్ణ సర్వాంతరాత్మ రూ।పుఁ గనవలయు॥

దేహేన్ద్రియ ప్రాణమనోఽహమాదిభి స్స్వాజ్ఞాన క్లృప్తై రఖిలై
రుపాధిభిః,
విముక్త మాత్మాన మఖండరూపం పూర్ణం మహాకాశ
మివావలోకయేత్ 385

గీ॥ ప్రాణమానస దేహేన్ద్రి।యాహమాది
స్వాజ్ఞతాజనితోపాధి। కగుచునెడము।
ఆత్మపరిపూర్ణునాకస। మటులఖండ
రూపు సర్వాంతఁరాత్ము చి।ద్రూపుఁగనుము॥

ఘటకలశకుసూలసూచి ముఖ్యై ర్గగన ముపాధి శతై ర్విముక్త
మేకమ్,
భవతి స వివిధం తథైవ శుద్ధం పరమహమాది విముక్త
మేకమేవ 386

గీ॥ గగనమెట్లు ఘటకుసూల। కలశమాది
వివిధమగు నుపాధులవీడి। వెలుఁగు నేక।
త, నటులె విశుద్ధ పరమాత్మ। తదహమాది
వికృతులనువీడియేకత। వెల్గు శిష్య !॥

బ్రహ్మాది స్తంబపర్యన్తా మృషామాత్రా ఉపాధయః,
తతః పూర్ణం స్వమాత్మానం పశ్యేదేకాత్మనా స్థితమ్ 387

గీ॥ బ్రహ్మ మొదలు దృణము పర్యంతముగ ను
పాధులిల మిథ్యగాఁదోచుఁ। బరమ బ్రహ్మ।
మేకుఁడై యాత్మఁదిరముగ। నెసగునట్టి
జ్ఞానరూపుని బరిపూర్ణుఁ। గాంచవలయు॥

యత్ర భ్రాంత్యా కల్పితం తద్వివేకే
తత్తన్మాత్రం నైవ తస్మాద్విభిన్నమ్,
భ్రాంతే ర్నాశే భాతి దృష్టాహితత్త్వం
రజ్జుస్తద్వ ద్విశ్వమాత్మ స్వరూపమ్.

గీ॥ భ్రాంతి కల్పితమగువస్తు। భావన పద,
సద్విచారంబుఁగనవచ్చు। సత్యమునిఁక।
తెలియు, భిన్నత్వమరుగును। దొలఁగ భ్రాంతి
పామనెడు భ్రాంతి రజ్జునఁ। బాయువిధము॥

బ్రహ్మమున భ్రాంతియౌ విశ్వ। భావనంబు
భ్రాంతి తొలఁగిన నేగుఁ బ్రపంచమందు।
బ్రహ్మరూపమె భాసించుఁ। బ్రస్ఫుటముగ॥
ఆత్మరూపంబుతో నలరారుచుండ॥

స్వయం బ్రహ్మ స్వయం విష్ణు స్స్వయమింద్ర స్స్వయం శివ,
స్వయం విశ్వమిదం సర్వం స్వస్మా దన్యన్న కించన 389

గీ॥ తానె వాక్పతి, తా విష్ణు। తానె శివుఁడు
తానె యింద్రుఁడు సర్వము। దాని జగము।
అరయ బ్రహ్మంబునకునిల। నన్యమొండు
లేదటంచు నెరుంగమా। వేదవిదుర॥

అన్త స్స్వయంచాపి బహిస్స్వయం చ
స్వయం పురస్తా త్స్వయమేవ పశ్చాత్,
స్వయం హ్యవాచ్యాం స్వయముప్యుదీచ్యాం,
తథోపరిష్టా త్స్వయమ ప్యధస్తాత్ 390

గీ॥ తానెలోనుండు వెలుపలఁ। దానెయుండు
తానె తూరుపుపడమర। తానె దక్షి।
ణమ్ము నుత్తరమనియెడు। నాల్గుదిశలు,
పైనఁ గ్రిందయుఁ బరిపూర్ణ। బ్రహ్మమనఘ॥

తరఙ్గఫేన భ్రమ బుద్బుదాది సర్వం స్వరూపేణ జలం యథా తథా,
చిదేవ దేహాద్యహమన్త మేత త్సర్వం చిదే వైకరసం విశుద్ధమ్ 391

గీ॥ అలలు, ఫేనము, సుడి, బుద్బు।దాదులెల్ల
జలముదాఁగొను రూపసం। చయముగాదె।
తనువు మొదలహంకారము। దాఁక సర్వ
మరయసచ్చిదానంద ర।సాత్మకమ్ము॥

సదేవేదం సర్వం జగదవగతం వాఙ్మనసయోః
సతోఽన్య న్నాస్త్యేవ ప్రకృతిపరసీమ్ని స్థితవతః,
పృథక్కిం మృత్స్నాయాః కలశఘటకుంభాద్యవగతం
వదత్యేష భ్రాన్త స్త్వమహమితి మాయామదిరయా 392

గీ॥ సత్యమే తోచుచున్నది। జగమనంగ
వాఙ్మవంబులకవగత।పడుతెఱఁగు।
సత్పదార్థ మనన్యంబు। సర్వప్రకృతి
సర్వప్రకృతికిఁ బరమగు। సత్పదార్థ॥
మునకు లేదన్యమీజగ।మ్ము వితరణము,

కడవ కలశము కుంభము। ఘటముగరగ॥
మట్టికితరములనఁదోచు। మాడ్కినిలను
మాయమధు పానమత్తుని। మనసు భ్రాంతి॥
నీవునేనని యెడుభేద। భావమొదవు॥

క్రియాసమభిహారేణ యత్ర నాన్యదితి శ్రుతిః,
బ్రవీతి ద్వైతరాహిత్యం మిథ్యాధ్యాసనివృత్తయే ౩౭

గీ॥ ద్వైతరాహిత్యమునునిర్వి।వాదముగ
మృషయయిన భ్రాంతి నిట నివా।రించుటకును।
పలుఁకు వాక్క్రియామేళనం।బులనుజేసి
ఆత్మ కన్యంబులేదని।యంచు శ్రుతులు॥

ఆకాశవన్నిర్మల నిర్వికల్ప నిష్పందన నిర్వికారమ్,
అన్తర్బహిశ్శూన్య మనన్త మద్వయం స్వయం పరబ్రహ్మ
కిమస్తి బోధ్యమ్ ౩౮

గీ॥ నిర్మలము నిర్వికల్పంబు। నిశ్చలంబు,
ఆకసమువలె నవికారి। యపరిమితము।
బాహ్యమునకంతరమునకు। భావశూన్య
మద్వితీయంబనంతమై। యాత్మవెలయు,॥
స్వయముగా పరబ్రహ్మమై। జగతియందు,
కలుఁగునెట్లన్యమిట్లని। తెలిసికొనఁగ॥

వక్తవ్యం కిము విద్యతేఽత్ర బహుధా బ్రహ్మైవ జీవ స్స్వయమ్,
బ్రహ్మైత జ్జగ దాతతం ను సకలం బ్రహ్మాద్వితీయం శ్రుతేః,
బ్రహ్మైవాహమితి ప్రబుద్ధమతయ స్సంత్యక్తబాహ్యాః స్ఫుటం,
బ్రహ్మీభూయ వసంతి సన్తతచిదానన్దాత్మనైవ ధ్రువమ్ 395

గీ॥ పల్క నేముండె జీవమే। బ్రహ్మమైన,
బ్రహ్మమే జగమునఁబరి। వ్యాప్తుఁడగుడు॥
బ్రహ్మమద్వయమంచును।బల్కు శ్రుతులు,
బ్రహ్మమే నేనటంచనఁ। బ్రస్ఫుటముగ॥

బాహ్యసంస్మృతి విడనాడి। ప్రాజ్ఞులు పర
జ్ఞానకాంతి నివాతితా। జ్ఞానులగుచు।
బ్రహ్మమై సచ్చిదానంద। భావస్ఫూర్తి,
నిశ్చలతనుండిరననది। నిశ్చయమ్ము॥

జహి మలమయకోశేఽహంధియోత్థాపితాశాం
ప్రసభ మనిలకల్పే లింగదేహేఽపి పశ్చాత్
నిగమగదిత కీర్తిం నిత్యమానందమూర్తిం
స్వయ మితి పరిచీయ బ్రహ్మరూపేణ తిష్ఠ 396

గీ॥ మొదట మలమయకోశము। న్వదలుమయ్య,
తలఁపున హమా। వికృతాశది దొలఁగుమయ్య।
వాయుసదృశలింగ తనువు। వదలుమయ్య
నిగమసత్కీర్తితానంద। నిత్యమూర్తి॥
నేననెడి భావనమ్ముచే। నిశ్చయముగ,
బ్రహ్మరూపము స్థిరముగ। బడయుమయ్య॥

శవాకారం యావద్భజతి మనుజ స్తావదశుచిః,
పరేభ్య స్స్యాత్క్లేశో జననమరణవ్యాధినిలయః,
యదాఽఽత్మానం శుద్ధం కలయతి శివాకారమచలం
తదా తేభ్యో ముక్తో భవతి హి తదాహ శ్రుతిరపి 397

గీ॥ మోహయుతుఁడిలశవరూప। దేహమందు
అశుచి కడుదుఃఖ కారణం।బన్యులకును।
జననమరణ రోగములకు। సదనమతఁడు,
ఎపుడుచల శివాత్మకునిగ। నెరుఁగుఁదనను॥
అపుడె సంసారబంధము।లతని విడచు,
నను బోధించుచున్నవి ।యన్ని శ్రుతులు

స్వాత్మన్యారోపి తాశేషాభాసవస్తు నిరాసతః,
స్వయమేవ పరం బ్రహ్మ పూర్ణ మద్వయ మక్రియమ్ 398

గీ బ్రహ్మమున భావితమగు నా। భాసవస్తు,
చయ నిరాకరణంబుచే। జగతినంత।
నిష్క్రియుండు బరిపూర్ణుండు।నిర్ద్వయుండగు
బ్రహ్మమే తానుగానయి ప్రజ్వరిల్లు॥

సమాహితాయాం సతి చిత్తవృత్తౌ పరాత్మని బ్రహ్మణి నిర్వికల్పే,
న దృశ్యతే కశ్చిదయం వికల్పః ప్రజల్పమాత్రః పరిశిష్యతే
తతః 399

గీ॥ నిర్వికల్పుని బరమాత్మ। నిరతముగను
చిత్తవృత్తిని నెలకొల్పఁ।దిరముగాను।
ఇంచుకైన వికల్పంబు। నెరుఁగముమది
మాటమాత్రమునకుఁగల్గుఁ॥ జోటదగుట॥

అసత్కల్పో వికల్పో౽యం విశ్వ మిత్యేకవస్తుని,
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః 400

గీ॥ ఏకుఁడగు బ్రహ్మమందున। నెంచిచూడ
విశ్వమగు మిధ్య।లేదను। విధమునొప్ప
నిర్వికార నిరాకా।ర నిర్విశేష
బ్రహ్మమందున భేదంబుఁ। బల్కనగునె॥

ద్రష్టృదర్శనదృశ్యాది భావ శూన్యైకవస్తుని,
నిర్వికారే నిరాకారే నిర్విశేషే భిదా కుతః॥ 401

గీ॥ ద్రష్ట, దృశ్యమ్ము మఱియును। దర్శనమను
భావరహితైక పరమాత్మ। వస్తువైన।
నిర్వికార నిరాకార। నిర్విశేష
బ్రహ్మమందెట్లు భేదము। పల్కనగును?॥

కల్పార్ణవ ఇవాత్యంత పరిపూర్ణైకవస్తుని,
నిర్వికారే నిరాకారే నిర్విశేష భిదా కుతః 402

గీ॥ విలయ కాలసముద్రపు। విధమునొప్పి
అపరిమిత పరిపూర్ణైక।మైనయట్టి।
నిర్వికార నిరాకార। నిర్విశేష
బ్రహ్మమందెట్లు బేదము। పల్కనదును?॥

తేజసీవ తమో యత్ర ప్రలీనం భ్రాన్తి కారణమ్,
అద్వితీయే పరే తత్త్వే నిర్విశేషే భిదా కుతః 403

గీ॥ భ్రాంతి కారణమగు మాయ। బ్రహ్మముఁగన
విలయమగుఁ గాంతిఁజీకట్లు। వెడలునట్లు।
అద్వితీయుఁడు బరతత్త్వ। మైన యట్టి
బ్రహ్మమందెట్లు భేదము। వల్కనగును?॥

ఏకాత్మకే పరే తత్త్వే భేదవార్తా కథం వసేత్,
సుషుప్తౌ సుఖమాత్రాయాం భేదః కేనావలోకితః 404

గీ॥ ఎంచఁ బరమాత్మ తత్త్వమం। దేకుఁడనుచు
వసతియెట్లుండు భేదభావమునకందు।
సుఖమెరూపంబుగాగ సుషుప్తినుఁడి
బ్రహ్మమందున భేదంబుఁ। బల్కనెవఁడు॥

న హ్యస్తి విశ్వం పరతత్త్వబోధా త్సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే,
కాలత్రయే నాప్యహి రీక్షితే గుణే న హ్యమ్బుబిన్దు
ర్మృగతృష్ణికాయామ్ 405

గీ॥ త్రాడుఁగన్గొనఁబామను। భ్రాంతియెట్లు
కలుఁగదెన్నండునిలను ద్రి। కాలములను।
ఎండమావులలో జలం। బుండనట్లు
నిర్వికల్ప పరబ్రహ్మ। నిత్యమూర్తి॥
పరమతత్త్వమెరుఁగ విశ్వభ్రాంతిలేదు॥

మాయమాత్ర మిదం ద్వైత మద్వైతం పరమాత్మనః,
ఇతి బ్రూతే శ్రుతి స్సాక్షా త్సుషుప్తావనుభూయతే 406

గీ॥ ద్వైతభావంబవిద్యా ప్రకాశమనఘ!
సద్విచారమ్మ నద్వైత జ్ఞానమొదవు
ననుచు ఘోషించుచున్నవి మనకు శ్రుతులు,
అనుభవంబగు మనకున య్యది సుషుప్తి॥

అనన్యత్వ మధిష్ఠానా దారోప్యస్య నిరీక్షితమ్,
పణ్డితై రజ్జుసర్పాదౌ వికల్పో భ్రాన్తిజీవనః 407

గీ॥ భ్రాంతి జీవనముగ భువిఁ బరఁగుకతన
రజ్జుసర్పాది వివిధ వర్ప్యలను జూడ
భువినధిష్ఠానమునకంటె బుధజనంబు
గందురారోప్యమందు నానన్తగుణము॥

చిత్తమూలో వికల్పోఽయం చిత్తాభావేన కశ్చన
అతశ్చిత్తం సమాధేహి ప్రత్యగ్రూపే పరాత్మని 408

గీ॥ చిత్తమూలంబు గల్పన చిత్తమేగఁ,
గల్పనంబన్నదెందును గానరాదు
కాన నిల్పుముమది నవి కల్పమైన,
ప్రత్యగాత్మ సమాధిని బాగుగాను॥

కిమపి సతతబోధం కేవలానందరూపం,
నిరుపమ మతివేలం నిత్యముక్తం నిరీహమ్,
నిరవధి గగనాభం నిష్కలం నిర్వికల్పం,
హృది కలయతి విద్వాన్ బ్రహ్మ పూర్ణం సమాధౌ 409

గీ॥ జ్ఞానతేజునిఁగేవలా నందరూపు
నిరుపము నిరీహువ్యాపకు నిత్యముక్తు
నిర్వికల్పు నిరవధికు నిష్కలు పరి
పూర్ణ బ్రహ్మంబుసమాధి నుబుధుఁడుగాంచు॥

నిగమవచన సిద్ధం నిత్యమస్మత్ప్ర సిద్ధం,
ప్రకృతి వికృతి శూన్యం భావనాతీత భావమ్,
సమరస మసమానం మానసం బంధదూరం,
హృది కలయతి విద్వాన్ బ్రహ్మపూర్ణం సమాధౌ 410

ఆ.వె॥ నిగమవచన సిద్ధు। నిత్యునాత్మ ప్రసిద్ధు
ప్రకృతి వికృతి శూన్యు। భావదూరు।
సర్వసము నసముని। స్వయమ ప్రమేయుని
పూర్ణ బ్రహ్మము హృది। బుధుండుగనెడు॥

అజర మమర మస్తా భాస వస్తుస్వరూపం
స్తిమితసలిలరాశి ప్రఖ్య మాఖ్యా విహీనమ్,
శమితగుణ వికారం శాశ్వతం శాన్త మేకం,
హృది కలయతి విద్వా న్బ్రహ్మపూర్ణం సమధౌ॥ 411

ఆ.వె॥ అజరు నమరు వాస్త। వాస్తమితాభావు
శాంతజలధి సుప్ర।శస్తు, నామ।
రహితు శాంతు. త్రిగుణ।రహితైకు శాశ్వతు
పూర్ణ బ్రహ్మముహృది। బుధుఁడు గనెడు॥

సమాహితాంతఃకరణ స్స్వరూపే విలోకయాత్మాన మఖండ
వైభవమ్,
విచ్ఛిన్ది బన్ధం భవగన్ధ గన్థితం యత్నేన పుంస్త్వం
సఫలీకురుష్వ 412

గీ॥ తనదురూపాన నిల్పి యం।తఃకరణము
నాత్మవైభపమును బాగ। నవధరింపు।
చేసి భవవాసనాపాశ ఛే।దనంబు
పొందు సఫలత యత్నంబుఁ। బురుషజన్మ॥

సర్వోపాధి వినిర్ముక్తం సచ్చిదానంద మద్వయమ్,
భావ యాత్మానమాత్మస్థం న భూయః కల్పసేఽధ్వనే 413

గీ॥ ప్రవిమలానందు బ్రహ్మ ను।పాధిరహితు,
నాత్మరూపునియాత్మస్థు। నద్వితీయు।
నాత్మఁదిరముగ భావించి। నంతభవము
మరలఁ గల్గను మోక్షసం।పాదనంబు॥

ఛాయేవ పుంసః పరిదృశ్యమాన మాభాసరూపేణ ఫలానుభూత్యా,
శరీర మారాచ్ఛవ వన్నిరస్తం పునర్న సన్ధత్త ఇదం
మహాత్మా 414

గీ॥ భ్రాంతి పురుషచాయగఁ గర్మ।ఫలమువలన,
కానుపించు శవసదృశ। కాయము గడు।
దూరమున విడువఁబడెడుఁ। బ్రోవ,ఁ దిరిగి
అట్టి దేహమును మహాత్ముఁ।డందుకొనడు॥

సతతవిమల బోధానందరూపం సమేత్య,
త్యజ జడమలరూపోపాధిమేతం సుదూరే,
అథ పునరపి నైష స్మర్యతాం వాన్తవస్తు,
స్మరణవిషయభూతం కల్పతే కుత్సనాయ 415

గీ॥ సచ్చిదానంద విమలవి। జ్ఞానరూపుఁ,
డైన పరమాత్మలోన నీ।వైక్యమొంది।
దవ్వుమలభరితోపాధి,। తనువు విడువు,
తనువు మరలస్మరించుట। తగవుగాదు॥
వాన్తియైన పదార్థము। వాంఛగొనుట
సహ్యమే తలంచుటకు న।సహ్యముగద।

సమూల మేతత్పరిదహ్య వహ్నౌ సదాత్మని బ్రహ్మణి నిర్వికల్పే,
తత స్స్వయం నిత్యవిశుద్ధబోధానందాత్మనా తిష్ఠతి విద్వరిష్ఠః 416

గీ॥ ఆత్మరూపా వికల్ప బ్రహ్మాగ్నియందు,
మోహ విభ్రాంతిఁగాల్చి సమూలముగను।
నిత్యశుద్ధ బోధానంద। సత్యరూప
మునఁదిరమ్ముగ నుండెడు। బుధవరుండు॥

## నివృత్తి

ప్రారబ్ధ సూత్ర గ్రధితం శరీరం ప్రయాతు వా తిష్ఠతు గోరివ స్రక్,
న తత్పునః పశ్యతి తత్త్వవేత్తాఽఽనందాత్మని బ్రహ్మణి లీనవృత్తిః 417

కం॥ ప్రారబ్ధ సూత్రకల్పిత
హారంబీతనువదమరు। నమరినఁదెగినన్।
దూరంబగు దేనువు గళ
హారంబటులెరుఁకలేక। యనఘచరితులన్॥
ధీరులు బ్రహ్మలీనమయి
కోరరు కాయంబు మరలఁగువలయమందున్॥

అఖండానంద మాత్మానం విజ్ఞాయ స్వస్వరూపతః,
కిమిచ్ఛ న్కస్య హేతో ర్దేహం పుష్ణాతి తత్త్వవిత్ 418

సంసిద్ధస్య ఫలం త్వేతజ్జీవన్ముక్తస్య యోగినః,
బహిరన్త స్సదానందరసాస్వాదన మాత్మని॥ 419

గీ॥ ఆత్మరూపు సదానందు।నాత్మ నెఱిఁగి
ఎట్టి కోరికఁదనువుఁబోషించు నరుఁడు?
అంతటను సదానంద ర।సానుభూతి
ఫలము జీవన్విముక్తయో।గులకు నిలను॥

వైరాగ్యస్య ఫలం బోధో బోధస్యోపరతిః ఫలమ్.
స్వానన్దానుభవా చ్ఛాన్తి రేషైవోపరతేః ఫలమ్ 420

ఆ.వె॥ ఫలము జ్ఞానమరయ। వైరాగ్యమునకిల,
ఫలము జ్ఞానమునకు।పరతి యింక।
స్వానుభవము శాంతి। సత్ఫలముపరతి
మోక్షసాధన ముముక్షువులకు॥

యద్యుత్తరోత్తరాభావః పూర్వపూర్వం తు నిష్ఫలమ్,
నివృత్తిః పరమా తృప్తిరానందోఽనుపమః స్వతః 421

గీ॥ సాధన, విరక్తి, యుపరతి। జ్ఞానములకు
ఉత్తరార్థంబు లొనగూడ।కున్న యెడల।
నిష్ఫలమ్మగు సాధన। నిరుపమగు
పరమతృప్తి నివృత్తిచేఁ। బడయనగును॥

దుష్టదుఃఖేష్వనుద్వేగో విద్యాయాః ప్రస్తుతం ఫలమ్,
యత్కృతం భ్రాన్తివేళాయాం నానాకర్మ జుగుప్సితమ్
పశ్చాన్నరో వివేకేన తత్కథం కర్తు మర్హతి 422

గీ॥ చెడుగు దుఃఖములఁ గలతఁ।జెందకున్కి,
విద్యచే నొనగూడెడి। విశ్రుతఫలము।
భ్రాంతిఁజేసిన కర్మలఁ। బారఁజూచి,
సలుపునే యసహ్యించియు। జ్ఞాని మరల॥

విద్యాఫలం స్యాదసతో నివృత్తిః
ప్రవృత్తి రజ్ఞాన ఫలంతదీక్షితమ్,
తద్జ్ఞయో ర్యన్మృగతృష్ణికాదౌ
నో చేద్విదాం దృష్టఫలం కిమస్మాత్ 423

గీ॥ జ్ఞాన ఫలితంబరయఁగన। సన్నివృత్తి,
తలఁచెదరు ప్రవృత్తిని యజ్ఞ।తాఫలముగ।
భ్రాంతినిజములఁగల భేద।భావమిలను,
అరయమృగ తృష్ణికాదిన్యా।యములఁగల్గు॥
నట్టి సద సద్వివేచన।మమరకున్న,
వేరు ఫలమేమి యిలఁద త్త్వ। విదులకనఘ॥

అజ్ఞాన హృదయ గ్రస్థే ర్వినాశో యద్యశేషతః,
అనిచ్ఛో ర్విషయః కిన్ను ప్రవృత్తేః కారణం స్వతః 424

గీ॥ అజ్ఞతాహృదయ గ్రంథి। యంతయునిల
నాశమొనరించఁబడివచో। జ్ఞాన ఘురికఁ
గామరహితుని కేరీతిఁ।గల్గెడు నిలఁ,
గారణంబు ప్రవృత్తికిఁ। గలుషదూర॥

వాసనానుదయో భోగ్యే వైరాగ్యస్య తదాఽవధిః,
అహంభావోదయాభావో బోధస్య పరమావధిః,
లీనవృత్తే రనుత్పత్తి ర్మర్యాదోపరతేస్తు సా 425

గీ॥ హద్దు వైరాగ్యసీమ క।వాసనత్వ,
మవధి విజ్ఞానమునకన॥ హంకృతియుఁక।
అరయ గనివృత్తి యునుబున। రావృతియును
అవధి యుపరతి కగునిల। నకలచరిత॥

# జీవన్ముక్తుఁడు

బ్రహ్మాకారతయా సదా స్థిరతయా నిర్ముక్తబాహ్యార్థధీః,
అన్యావేదితభోగభాగ్యకలనో నిద్రాలువద్బాలవత్,
స్వప్నాలోకితలోకవ జ్జగదిదం పశ్యన్క్వచిల్లబ్ధధీ
రాస్తే కశ్చి దనంతపుణ్య ఫలభు గ్ధన్యస్య మాన్యో భువి 426

కం॥ స్థిరముగ బ్రహ్మాకారముఁ
బరఁగెడు ఘనపుణ్యవ్రతుఁడు। బాహ్యార్థములన్।
దొరఁగియు నన్యావేదిత
వరభోగములందు వరలు। బాలకువిధమున్॥

కం॥ అరయును జగమునుగల ని
ద్దురఁగాంచెడి దృశ్యమటులఁ దూగుచు మత్తున్।
ధరనట్టి ధీమతులకున్
అరుదగు గౌరవములొందు। నర్హతగల్గున్॥

స్థిత ప్రజ్ఞో యతి రయం యస్సదానంద మశ్నుతే,
బ్రహ్మణ్యేవ విలీనాత్మా నిర్వికారో వినిష్క్రియః 427

గీ॥ ఆతతస్థిత ప్రజ్ఞుండు। యతివరుండు
బ్రహ్మమందు విలీనమై। బరఁగునాత్మ।
నిర్వికారుఁడు నిత్యుండు। నిష్క్రియుండు
నిత్య సచ్చిదానందుండు। నిర్మలుండు॥

బ్రహ్మాత్మనో శ్శోధిత యో రేక భావావగాహినీ,
నిర్వికల్పా చ చిన్మాత్రా వృత్తిః ప్రజ్ఞేతి కథ్యతే 428

గీ॥ జీవపరమాత్మ శోధనఁ।జేయు వెడల,
రెండు నొకటను సత్యంబు। ఋజువుపడును।
నిర్వికల్ప చిదాత్మక। నియత వృత్తి,
ప్రజ్ఞనాబడు నరణిలోఁ। బండితాఢ్య॥

సుస్థితాఽసౌ భవేద్యస్య స్థిత ప్రజ్ఞస్స ఉచ్యతే,
సా సర్వదా భవేద్యస్య జీవన్ముక్త ఇష్యతే।
యస్య స్థితా భవేత్ప్రజ్ఞా తస్యానందో నిరన్తరః,
ప్రపంచో విస్మృతప్రాయ స్స జీవన్ముక్త ఇష్యతే 429

గీ॥ ఎవని ప్రజ్ఞ స్థిరంబయి। యెసఁగు నెపుడు
సుస్థిత ప్రజ్ఞుఁడనఁగవి। శ్రుతుండు, సతత।
మచల ప్రజ్ఞ జీవన్ముక్తుఁ।డని ప్రతు బుధులు,
అతని యానందమరయ ని।రంతరంబు॥
ఎల్ల ప్రాపంచకంబు వి।స్మృతి మెవనికి
నతని నంద్రు జీవన్ముక్తుఁ।డంచు ధరణి॥

లీన ధీరపి జాగర్తి యో జాగ్రద్ధర్మ వర్జితః,
బోధో నిర్వాసనో యస్య స జీవన్ముక్త ఇష్యతే 430

గీ బ్రహ్మ తత్పర చిత్తుఁడౌ। ప్రవిమల ముని,
సకల ధర్మపరిత్యక్త। జాగృతుండు।
జ్ఞాన మెవనిది నిర్వాస। నంబౌ యట్టి,
అచల ప్రజ్ఞ జీవన్ముక్తుఁ। డంద్రు బుధులు॥

శాన్త సంసార కలనః కలావానపి నిష్కలః,
యస్య చిత్తం వినిశ్చిన్తం స జీవన్ముక్త ఇష్యతే 431

గీ॥ శాంతసంసారకల్లోల।సాగరుండు,
కళల విలసిల్లుచుండి ని।ష్కలుఁడెవండు।
చిత్త మెవ్వని కొప్పు ని।శ్చింతనట్టి
అచల ప్రజ్ఞ జీవన్ముక్తు।డంద్రు బుధులు॥

వర్తమానేఽపి దేహేఽస్మిన్ ఛాయావదను వర్తిని,
అహన్తామమతా భావో జీవన్ముక్తస్య లక్షణమ్ 432

గీ॥ వర్తమానంబు దేహాను।వర్తియగుచు
నీడవలెనంటి తిరిగెడు। నిజప్రవృత్తి।
నేను నాదను భావంబు। లేమి యచల
ప్రజ్ఞుఁడైన జీవన్ముక్తు। లక్షణంబు॥

అతీతాననను సన్ధానం భవిష్యదవిచారణమ్,
ఔదాసీన్యమపి ప్రాప్తం జీవన్ముక్తస్య లక్షణమ్ 433

గీ॥ గతముఁ జింతించి యెన్నఁడుఁ। గలతపడడు,
దలఁచి రాబోవువానికై। తల్లడిలడు।
ప్రాప్తమునకుదాసీనుఁడు। ప్రస్తుతమున
లక్షణమది జీవన్ముక్తు।లకును శిష్య॥

గుణదోష విశిష్టేఽస్మిన్ స్వభావేన విలక్షణే,
సర్వత్ర సమదర్శిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్ 434

ఇష్టానిష్టార్థ సంప్రాప్తౌ సమదర్శిత యాత్మని,
ఉభయత్రా వికారిత్వం జీవన్ముక్తస్య లక్షణమ్॥ 435

బ్రహ్మానన్దరసాస్వాదాసక్త చిత్తతయా యతేః,
అన్తర్బహిర విజ్ఞానం జీవన్ముక్తస్య లక్షణమ్॥ 436

దేహేన్ద్రియాదౌ కర్తవ్యే మమాహంభావ వర్జితః,
ఔదాసీన్యేన యస్తిష్ఠేత్స జీవన్ముక్త లక్షణమ్॥ 437

విజ్ఞాతః ఆత్మనో యస్య బ్రహ్మభావ శ్రుతేర్బలాత్,
భవబన్ధ వినిర్ముక్తస్స జీవన్ముక్త లక్షణః॥ 438

దేహేన్ద్రియేష్వహంభావ ఇదం భావస్తదన్యకే,
యస్య నో భవతః క్వాపి స జీవన్ముక్త ఇష్యతే॥ 439

గీ॥ తనదు గుణదోషముల బ్రహ్మమునకు భిన్న
మైన విశ్వంబు సమదృష్టి।నంతటఁగన।
లక్షణమ్ము జీవన్ముక్తు।లకును శిష్య

కలుఁగున ప్రియాప్రియములంగాంచి సమత॥
ఉభయముల నిర్వికారత। నొప్పుటగును
లక్షణంబు జీవన్ముక్తు।లకును శిష్య॥

నిత్యము నిరంతరంబు వి। నిర్మలమగు
సచ్చిదానంద రసపాన। సక్తచిత్త।
యతులు ప్రాపంచికజ్ఞాన।యుతులు గామి
లక్షణమ్ము జీవన్ముక్తు।లకును శిష్య॥

శ్రుతులయందున గ్రహించి। క్షుణ్ణముగను
బ్రహ్మమేనను సత్యంబుఁ। బ్రస్ఫుటముగ।
భువిని భవపాశబంధ వి।ముక్తుఁడగుట
లక్షణమ్ము జీవన్ముక్తు।లకును శిష్య॥

ఇంద్రియాదులదేహమ్ము। నితరములను
ఇంచుకేనియు మనమున।నెన్నఁడైన।
నేనునాదనుభావము। లేనివాని
నంద్రడు ధరణి జీవన్ముక్తుఁ।డంచు శిష్య॥

న ప్రత్యగ్బ్రహ్మణోర్భేదం కదాపి బ్రహ్మసర్గయోః,
ప్రజ్ఞయా యో విజానాతి స జీవన్ముక్తలక్షణః 440

గీ॥ ప్రత్యగాత్మకు జగతికి। బ్రహ్మమునకు
భేదమును జూడడెవ్వఁడు। వేదశాస్త్ర।
ప్రజ్ఞ, బ్రహ్మము నేనను। వాక్యపటిమ
ప్రాజ్ఞుఁడతఁడు జీవన్ముక్త। లక్షణుండు

సాధుభిః పూజ్యమానేఽస్మిన్ పీడ్యమానేఽపి దుర్జనైః,
సమభావో భవేద్యస్య స జీవన్ముక్తలక్షణః 441

గీ॥ సాధుజనములు పూజలు సల్పిరేని
దుర్జనంబులు బాధింపఁ దొడఁగిరేని
కలుఁగునెల్లప్డు సమదృష్టి జ్ఞానదీప్తి
ప్రాజ్ఞుఁడతఁడు జీవన్ముక్త లక్షణుండు॥

యత్ర ప్రవిష్టా విషయాః పరేరితా నదీప్రవాహా ఇవ వారిరాశౌ,
లీయన్తి సన్మాత్రతయా న విక్రియా ముత్పాదయఁత్యేష
యతిర్విముక్తః॥ 442

గీ॥ ఎత్తివచ్చెడి నదులబ్ధి నిముడునట్లు
విషయచయము ప్రవేశించి విజ్ఞునందు
లీనమగునట్టి సద్రూపుఁడైనయతి వి
ముక్తుఁడవికారుఁడాతఁడు మోహదూర!

విజ్ఞాతబ్రహ్మతత్త్వస్య యథాపూర్వం న సంసృతిః,
అస్తిచేన్న స విజ్ఞాతబ్రహ్మభావో బహిర్ముఖః 443

గీ॥ తెలిసికొన బ్రహ్మతత్త్వముఁ గలుఁగదింక
మొదటనుండిన సంసార మోహమనఘ!
కలిగినదైన సంసారకాంక్ష తిరిగి
బ్రహ్మతత్త్వ విదుఁడుగాడు బాహ్యముఖుఁడు॥

ప్రాచీన వాసనాయోగాదసౌ సంసరతీతి చేత్,
న సదేకత్వవిజ్ఞానా న్మన్దీభవతి వాసనా 444

గీ॥ బ్రహ్మ దత్త్వవి జ్ఞానసంపన్నుని కిల
పూర్వవాసనా సంస్కృతి పొసఁగునన్న।
బ్రహ్మమద్వయుఁడనుభావ బలమువలన
వలచనగనైన వాసనోద్భవములేదు॥

అత్యన్తకాముకస్యాపి వృత్తిః కుంఠతి మాతరి,
తథైవ బ్రహ్మణి జ్ఞాతే పూర్ణానందే మనీషిణః 445

గీ॥ అమిత కాముకునికైన నమ్మపైన
కామవాంఛ యెన్నటికిని గలుఁగనటుల
సచ్చిదానంద పరిపూర్ణ జ్ఞానఖనికి
కలుఁగదిలవృత్తి సంసార కల్పనంబు

## ప్రారబ్ధ ఫలము

నిధిధ్యాసన శీలస్య బ్రహ్మప్రత్యయ ఈర్యతే,
బ్రవీతి శ్రుతిరేతస్య ప్రారబ్ధం ఫలదర్శనాత్। 446

గీ॥ చెప్పవే నిధిధ్యాసన శీలుఁడెరుఁగు
బ్రహ్మతత్త్వము నని శ్రుతుల్ ప్రస్ఫుటముగ
కలుఁగుఁ బ్రారబ్ధమతనికి ఫలముఁగనుట
ననుచు బల్కెడు వేదంబు లమల చరిత॥

సుఖాద్యనుభవో యావత్ తావత్ప్రారబ్ధ మిష్యతే,
ఫలోదయో క్రియా పూర్వో నిష్క్రియో నహి కుత్రచిత్ 447

గీ కలుఁగు సుఖదుఃఖములు పూర్వ కర్మఫలము
ననుసరించి యటంచిల నంద్రుబుధులు।
ఫలము కర్మ సంజనితమై పరఁగ, లేదు
నిష్క్రియునికి బ్రారబ్ధము నిక్కువముగ

అహం బ్రహ్మేతి విజ్ఞానాత్ కల్పకోటిశతార్జితమ్,
సంచితం విలయం యాతి ప్రబోధా త్స్వప్నకర్మవత్ 448

గీ॥ కోటి జన్మల సుకృతంబుఁ। గూడినట్టి,
బ్రహ్మ మేనను జ్ఞానసం।పదను జేసి।
తొలఁగిపోవును బ్రారబ్ధ। ఫలము, నిదుర
లేవఁదొలఁగెడి స్వప్నము। లీఅనఘ

యత్కృతం స్వప్న వేళాయాం పుణ్యం వాపాపముల్బణమ్,
సుప్తోత్థితస్య కిం తత్స్యా త్స్వర్గాయ నరకాయ వా 449

గీ॥ స్వప్నకృతిపాప పుణ్యాల। ఫలము, నిద్ర
లేచినంతటఁ బాయును। లేశమేని।
స్వర్గ నరకంబులకుఁ జనఁ। జనికిరాదు,
లేశమైనఁ బ్రారబ్ధమ్ము। లేదు మునికి॥

స్వ మసంగ ముదాసీనం పరిజ్ఞాయ నభో యథా,
న శ్లిష్యతి చ యత్కించి త్కదాచి ద్భావి కర్మభిః 450

గీ॥ తననుదాసీను, నభమటు। లనభిసంగు
బ్రహ్మమునుగా మనంబున। బాగుగఁగన।
భావి కర్మంబులందు సం।బంధము నిల
బడయుడెన్నఁడు నైనను। బ్రాజ్ఞుఁడనఘ॥

న నభో ఘటయోగేన సురాగంధేన లిప్యతే,
తథాఽఽత్మోపాధియోగేన తద్ధర్మైర్నైవ లిప్యతే 451

గీ॥ కలశ సురగంధ మెన్నడు। గగనసీమ
నంట దవ్విధము నసాత్మ। యవని వివిధ।
మగు నుపాధులఁ గూడెడు। నప్పుడొదవు
ధర్మములు వాని నంటవు। తథ్యముగను॥

జ్ఞానోదయాత్పురాఽఽరబ్ధం కర్మజ్ఞానాన్న నశ్యతి।
అదత్త్వా స్వఫలం లక్ష్యముద్దిశ్యోత్సృష్ట బాణవత్ 452

గీ॥ లక్ష్యమును గూర్చి ముక్తశరమ్ము కరణి
జ్ఞాన మొదవక మున్నుగఁ బూనుకొనిన
కర్మముడుగదు ఫలమునుగడువఁగాదు,
జ్ఞానమొదవిన మాత్రానఁ గర్మ తెగదు॥

వ్యాఘ్ర బుద్ధ్యా వినిర్ముక్తో బాణః పశ్చాత్తుగోమతౌ,
న తిష్ఠతి ఛిన్త్త్యేవ లక్ష్యం వేగే న నిర్భరమ్ 453

గీ॥ వ్యాఘ్రమని యెంచి గోవుపై వదలినట్టి,
శరము, గోవని మరలింప సాధ్యమగునె।
కర్మఫలమును వారింపఁగాదు పూర్వ
ఫలమ వశ్యంబు భోగ్యము ప్రాజ్ఞులకును॥

ప్రారబ్ధం బలవత్తరం ఖలు విదాం భోగేన తస్య క్షయః
సమ్యగ్జ్ఞానహుతాశనేన విలయః ప్రాక్సంచితాగామినామ్,
బ్రహ్మాత్మైక్య మవేక్ష్య తన్మయతయా యే సర్వదా సంస్థితా,
స్తేషాం తత్త్రితయం న హి క్వ చిదపి బ్రహ్మైవ తే నిర్గుణమ్.

గీ॥ ప్రబల ప్రారబ్ధ ఫలము సత్పండితులకు
ననుభవించుట నంతయు నంతరించు
కర్మములు పూర్వసంచితా గాములనఁగ
త్రివిధములని విభాగమ్ము దెలియుమయ్య॥
జ్ఞాన వహ్నిదహించెడు వానినెల్ల॥

గీ॥ తన్మయత నాత్మనద్వైత తత్త్వముఁగని
సంస్థిత ప్రజ్ఞులై యుండు సంయములకు
నిర్గుణబ్రహ్మ మూర్తులై నెగడు కతన,
కర్మ త్రితయంబు ధరలోన గలుఁగ దెపుడు॥

ఉపాధితాదాత్మ్యవిహీన కేవల బ్రహ్మాత్మనైవాత్మని తిష్ఠతో
మునేః,
ప్రారబ్ధ సద్భావకథా న యుక్తా స్వప్నార్థ సంబంధకథేవ
జాగ్రతః 455

గీ॥ మౌనిదేహాద్యుపాధుల। ధ్యానమునిఁక,
కేవల బ్రహ్మరూపంబు। భావమాత్మ।
వెలయు, మౌనికిఁ బ్రారబ్ధ। ఫలముఁబల్క
స్వప్న వృత్తాంతమట్లు న।సంగతంబు।

న హి ప్రబుద్ధః ప్రతిభా సదేహే, దేహోపయోగిన్యపి చ
ప్రపంచే
కరోత్యహన్తాం మమతా మిదన్తాం కిన్తు స్వయం తిష్ఠతి
జాగరేణ 456

గీ॥ జ్ఞాని, దేహమ్ము దేహోప।కారియైన
విశ్వమున నేను నాయది। వీనివనెడు
స్వాప్నిక భ్రాంతిఁ బొందడు। స్వానుభవము
సతతముండుట జాగరూ।కతనుజేసి

న తస్య మిథ్యార్థ సమర్థ నేచ్ఛా, న సంగ్రహ స్తజ్జగతోఽపి
దృష్టః।
తత్రానువృత్తి ర్యది చేన్మృషార్థే న నిద్రయా ముక్త ఇతీష్యతే
ధ్రువమ్ 457

గీ॥ జాగృతుండగు జ్ఞానికి జగములేదు
ఇంద్రియార్థ పరిగ్రహ మించుకైన।
లేదు మిథ్యాసమర్థేచ్ఛ। లేదు సుంత
విషయ సంగ్రహమను వృత్తి। విడని నరులు॥
నిదురవీడని వారలు। నిశ్చయముగ॥

యద్వత్పరే బ్రహ్మణి వర్తమాన స్సదాత్మనా తిష్ఠతి నాన్యదీక్షతే,
స్మృతిర్యథా స్వప్న విలోకితార్థే తథావిదః ప్రాశనమోచనాదౌ 458

పరగుచాత్మ సదా పర। బ్రహ్మమందు
నితరములఁ బ్రహ్మమందు నీక్షించనట్టి।
బ్రహ్మవిదునికి మోచన। ప్రాశనములు
జాగృతుని స్వప్న వృత్తాంత। జ్ఞప్తి విధము॥

కర్మణా నిర్మితో దేహః ప్రారబ్ధం తస్య కల్ప్యతామ్,
నాశాదే రాత్మనో యుక్తం దైవాత్మా కర్మ నిర్మితః 459

కర్మ నిర్మితమైన యీ। కాయమునకు
కల్పన తగుఁ బురాకృత కర్మఫలము।
ఆది మధ్యాంత రహితమౌ। నాత్మ కర్మ
నిర్మితముగాదు ప్రారబ్ధ। కర్మ లేదు॥

అజో నిత్యః శాశ్వత ఇతి బ్రూతే శ్రుతిరమోఘవాక్,
తదాత్మనా తిష్ఠతోఽస్య కుతః ప్రారబ్ధ కల్పనా 460

గీ॥ అజుఁడు నిత్యుఁడు శాశ్వతుఁ।డంచు శ్రుతులు,
పలుకుచుండ నమోఘమౌ। వాక్యములను।
అట్టి పరమాత్మ భావము। నలరు నాత్మ
కెందు ప్రారబ్ధ కల్పన। మెన్నఁదగవు?॥

ప్రారబ్ధం సిద్ధ్యతి తదా యదా దేహాత్మ నా స్థితిః,
దేహాత్మభావో నైవేష్టః ప్రారబ్ధం త్యజ్యతా మతః 461

గీ॥ ఎపుడు దేహము నేనని। యెంచునరుఁడు,
కలుఁగునప్పుడుఁ బ్రారబ్ధ। కర్మఫలము।
దేహమందున నేనను। మోహముడుగ,
విబుధుఁ బ్రారబ్ధకర్మము। విడచుఁగాక॥

శరీరస్యాపి ప్రారబ్ధ కల్పనా భ్రాన్తిరేవ హి,
అధ్యస్తస్య కుత స్సత్త్వ మస త్త్వస్య కుతో జనిః 462

కాయమునకైనఁ బ్రారబ్ధ కల్పనంబు
భ్రాంతియేయగుఁ గాకున్న। బ్రహ్మమందు
కల్పితమునకు స త్త్వత। కలుఁగునెందు ?
కలుఁగమి యసత్త్వమునకెందుఁ। గలదు జన్మ ?

అజాతస్య కుతో నాశః ప్రారబ్ధ మసతః కుతః,
జ్ఞానే నాజ్ఞాన కార్య స్య స మూల స్య లయో యది 463

గీ॥ జన్మలేకున్న గలదె నా।శమ్ము ? విమల,
జ్ఞాన సూర్యోదయంబు న।జ్ఞాన కార్య।
మైన ప్రాపంచిక ప్రభావ। మంతరించ
కలుగుఁ బ్రారబ్ధమెంద స।త్కాయమునకు ?॥

తిష్ఠత్యయం కథం దేహః ఇతి శంకావతో జడాన్,
సమాధాతుం బాహ్య దృష్ట్యా ప్రారబ్ధం వదతి శ్రుతిః

న తు దేహాది సత్యత్వ బోధనాయ విపశ్చితామ్,
యత శ్శ్రుతే రభిప్రాయః పరమార్థైక గోచరః 464

గీ॥ దేహ మెటులుండెనో యని। తెలియుటకును
సంశయాత్మకులైనట్టి। జడమతులకు।
నచ్చఁ జెప్పంగ శ్రుతులిల। నయముమీరఁ
బల్కెఁ బ్రారబ్ధ ఫలమును। బాహ్యదృష్టి॥
వేదభావ విచారము। విబుధ జనుల
కమల పరమార్థ గోచరా।ర్థమగుఁగాని॥
తనువు సత్యమనియెడి బో।ధనకుగాదు॥

## బ్రహ్మమున నానాత్వ నిరాకరణము

పరిపూర్ణ మనాద్యన్త మప్రమేయ మవిక్రియమ్,
ఏక మేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కిఞ్చన 465

సద్ఘనం చిద్ఘనం నిత్య మానందఘన మక్రియమ్,
ఏక మేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కిఞ్చన 466

గీ॥ అప్రమేయ ఘనాద్యన్త। మక్రియమ్ము,
అద్వయము పరిపూర్ణైక।మైన బ్రహ్మ।
మందు నానాత్మమించుక।యైన లేదు
సద్ఘనంబక్రియము నిత్య। చిద్ఘనమ్ము
సంతతానంద ఘన మన। [illegible]తంబు
అద్వయము పరిపూర్ణైక।మైన బ్రహ్మ
మందు నానాత్వమించుక।యైన లేదు

ప్రత్యగేకరసం పూర్ణ మనన్తం విశ్వతోముఖమ్,
ఏక మేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కిఞ్చన 467

గీ॥ ప్రత్యగేకరసానంద। బంధురంబు
సర్వతోముఖానన్తత్వ।సంస్తుతంబు।
అద్వయము పరిపూర్ణైక। మైన బ్రహ్మ
మందు నానాత్వమించుక।యైన లేదు॥

అహేయ మనుపాదేయ మనాదేయ మనాశ్రయమ్,
ఏక మేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కిఞ్చన 468

గీ॥ కాదు హేయము గ్రహియింపఁ। గాని దనఘ
అత్యనాదియ నాశ్రయం। బైనయాత్మ।
అద్వయము పరిపూర్ణైక ।మైన బ్రహ్మ
మందు నానాత్వ మించుక। యైన లేదు॥

నిర్గుణం నిష్కలం సూక్ష్మం నిర్వికల్పం నిరంజనమ్,
ఏక మేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కిఞ్చన 469

గీ॥ నిర్వికల్పము సూక్ష్మంబు। నిర్గుణమ్ము
నిత్యము నిరంజనమ్ము వి।నిష్కళమ్ము।
అద్వయము పరిపూర్ణైక। మైన బ్రహ్మ
మందు నానాత్వ మించుక। యైన లేదు॥

అని రూప్య స్వరూపం యన్మనోవాచామగోచరమ్,
ఏక మేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కిఞ్చన 470

గీ॥ అవి నిరూప్య స్వరూపంబ। నాద్యమేది ?
వాక్కునకుమనసునకగు।పడనిదేది ?।
అద్వయము పరిపూర్ణైక। మైన బ్రహ్మ
మందు నానాత్మవించుక। యైన లేదు॥

సత్సమృద్ధం స్వతస్సిద్ధం శుద్ధం బుద్ధ మనీదృశమ్,
ఏక మేవాద్వయం బ్రహ్మ నేహ నానాస్తి కిఞ్చన 471

గీ॥ శుద్ధ సత్త్వస్వ తస్సిద్ధ। బుద్ధమైన,
మృద్ధమానందరూపంబ। నీదృశంబు।
అద్వయము పరిపూర్ణైక। మైన బ్రహ్మ,
మందు నానాత్వమించుక। యైన లేదు॥

## మహాత్ముల త్రోవఁ జని సిద్ధిబడయుమని బోధించుట

నిరన్తరాగా వినిరస్తభోగా, శ్శాన్తా స్సుదాన్తా యతయో
మహాన్తః,
విజ్ఞాయ తత్త్వం పరమేతదన్తే, ప్రాప్తాః పరాం నిర్వృతి
మాత్మయోగాత్ 472

గీ॥ రాగరహిత తిరస్కృత। భోగధనులు,
శాంతులింకయు దాంతమ।హాంతయుతులు।
పరమతత్త్వంబుఁ జక్కఁగ। నెఱిఁగి పిదప
ఆత్మయోగాన సత్సౌఖ్య। మందుకొనిరి॥

భవాన పీదం పరతత్త్వ మాత్మనః స్వరూప మానందఘనం
విచార్య,
విధూయ మోహం స్వ మనః ప్రకల్పితం ముక్తః కృతార్థో భవతు
ప్రబుద్ధః 473

గీ॥ ఆత్మనానందఘనుఁ బరమాత్మఁగూర్చి,
చక్కనగు తత్త్వశోధన। సలిపి నీవు।
మదిని కల్పితమోహంబు। మాని నీవు
జ్ఞానివగుము గృతార్థతఁ। గనుము ముక్తి॥

సమాధినా సాధు వినిశ్చలాత్మనా,
పశ్యాత్మ తత్త్వం స్ఫుటబోధ చక్షుషా,
నిస్సంశయం సమ్యగవేక్షిత శ్చే,
చ్ఛ్రుతః పదార్థో న పునర్వికల్ప్యతే

గీ॥ నిశ్చలాత్మ సమాధిని। నిల్చియాత్మ
జ్ఞాన నేత్రానఁ దత్త్వంబుఁ। గాంచుమయ్య।
స్పష్టముగ నాత్మఁగనిన ని।స్సంశయముగ
సత్పదార్థంబుఁ గల్గదే। సంశయంబు॥

స్వస్యాఽవిద్యాబన్ధ సమ్బన్ధ మోక్షా
త్సత్య జ్ఞానానంద రూపాత్మలబ్ధౌ,
శాస్త్రం యుక్తి ర్దేశి కోక్తిః ప్రమాణం।
చాన్తస్సిద్ధా స్వానుభూతిః ప్రమాణమ్

గీ॥ జీవుఁడజ్ఞాన బంధవిచ్ఛేదనంబు
సచ్చిదానందమయులబ్ధి సంగ్రహించు।
ననుట కలఘు ప్రమాణమీ యవనియందు
శ్రుతులు యుక్తులు గురుజన సూక్తములును॥
ప్రవిమలాంతః కరణ సిద్ధ ప్రజ్ఞయుఁదు
స్వానుభూతి ప్రమాణము సచ్చరిత్ర॥

బంధో మోక్షశ్చ తృప్తిశ్చ చింతారోగ్య క్షుదాదయః,
స్వేనైవ వేద్యా య జ్ఞానం పరేషా మాను మానికమ్ 476

గీ॥ బంధమోక్షముల్ చింతక్షు క్బాధ, తృప్తి,
స్వస్థతాదులు వేద్యముల్ స్వానుభవము।
స్వానుభూత్యైక వేద్యమౌ జ్ఞాన లబ్ధి,
నితరు లనుమానికమున నూహింతురిలను॥

తటస్థితా బోధయన్తి గురవః శ్రుతయో యథా
ప్రజ్ఞయైవ తరే ద్విద్వా నీశ్వరాను గృహీతయా 477

గీ॥ గురువులు తటస్థముగ నిలఁగరపువారు,
వేదములవలెఁ దత్త్వకోఁ విదులు నింక।
నీశ్వరానుగ్రహంబున నెరిఁగి ప్రజ్ఞ
దాటువారలు భవసముద్రమును శిష్య॥

స్వామభూత్వా స్వయం జ్ఞాత్వా, స్వ మాత్మాన మఖండితమ్,
సంసిద్ధ స్సన్ముఖం తిష్ఠే న్నిర్వి కల్పాత్మనాఽఽత్మని 478

గీ॥ ఆత్మ, పరిపూర్ణ బ్రహ్మము। నద్వితీయు,
స్వానుభూతినిఁ జక్కఁగ। స్వయమెరింగి।
నిర్వికల్ప స్వరూపము। నిత్యముగను,
ఆత్మసంసిద్ధుఁడుండు నాత్మాభిముఖము॥

వేదాంత సిద్ధాన్త నిరుక్తి రేషా బ్రహ్మైవ జీవః సకలం జగచ్చ,
అఖండ రూపస్థితిరేవ మోక్షో బ్రహ్మా ద్వితీయే శ్రుతయః
ప్రమాణమ్ 479

గీ॥ సకల వేదాంత సిద్ధాంత।సారమరయు,
బ్రహ్మమే జీవ మెల్లవి।శ్వంబు ననఘ।
బ్రహ్మసంస్థితి మోక్ష మ।ద్వైతమంచుఁ
బల్కు శ్రుతులు ప్రమాణమై। బ్రహ్మమునకు॥

ఇతి గురువచనాచ్ఛ్రుతి ప్రమాణా
త్పర మవగమ్య స తత్త్వ మాత్మ యుక్త్యా
ప్రశమితకరణ స్సమాహితాత్మా క్వచి
దచలాకృతి రాత్మ నిష్ఠతోఽభూత్ 480

కం॥ గురువచనంబులచేతను,
మరివేద ప్రమాణములను। మహితోక్తులఁదా
నరసి సదాత్మ జ్ఞానము
పరమాత్మ సమాహితాత్మ। ప్రజ్ఞాన్వితుఁడై॥

గీ॥ ప్రశమితేంద్రియ సంఘుఁడై బ్రహ్మవిదుఁడు,
అచల పరమాత్మ నిష్ఠయం। దనవరతము।
నిశ్చల సమాధి నెలకొని। నిత్యముగను,
సచ్చిదానందమూర్తియై। సౌఖ్యమందు॥

## బ్రహ్మానందానుభవాతిశయంతో స్వస్థుడైన శిష్యుని పలుకులు

కించిత్కాలం సమాధాయ, పరే బ్రహ్మణి మానసమ్,
ఉత్థాయ పరమానన్దా దిదం వచన మబ్రవీత్ 481

గీ॥ గురుని బోధనవిని శాస్త్రకోవిదుండు,
ఆత్మ విజ్ఞాన విదుఁడయి యచలబుద్ధిఁ
గొలఁదికాలము బ్రహ్మంబుఁ గూర్చి మదిని,
పరమ సౌఖ్యాను భూతిచేఁ బరవశించి॥
స్వస్థుఁడై లేచి యీరీతిఁ బల్కెనపుడు॥

బుద్ధిర్వినష్టా గళితా ప్రవృత్తి ర్బ్రహ్మాత్మనో రేకతయాఽధిగత్య,
ఇదం న జానేఽప్యనిదం న జానే, కిం వా కియద్వా సుఖమ
స్త్యపారమ్ 482

గీ॥ బుద్ధి మరి యింద్రియ ప్రవృత్తి పోయినంత
జీవుఁడును బ్రహ్మ మొకటని చిత్తమందు
నెరిఁగి యిహపరములయొక్క యెరుఁకలేక
పడసితిని యింతలనని యపారసుఖము॥

వాచా వక్తు మశక్య మేవ మనసా మన్తుం న వా శక్యతే,
స్వానందామృతపూరపూరిత పరబ్రహ్మంబుధే ర్వైభవమ్,
అమ్భోరాశివిశీర్ణ వార్షికశిలా భావం భజ న్మే మనో,
యస్యాంశాంశలవే విలీన మధునాఽఽనన్దాత్మనా నిర్వృతమ్, 483

గీ॥ వాక్కునకు నిట్టిదనుటకు వలనుపడదు
మనసునకునైన నిట్లను కొనఁగఁగాదు
అద్వయానంద రసపూరితాంబురాశిఁ,
గరఁగు ప్రావృట్ శిలాఖండకళిక మనము॥
బ్రహ్మమున లీనమై పరబ్రహ్మ సుఖము
స్వానుభవ సిద్ధముగనొంది సంతసించు॥

క్వ గతం కేన వా నీతం, కుత్ర లీనమిదం జగత్,
అధునైవ మయా దృష్టం నాస్తి కిం మహదద్భుతమ్ 484

గీ॥ ఎందుఁబోయెనొ। గొనువారలెవరొ, యేమొ,
ఎట విలీనమయ్యెడునట్టి। దీ జగంబు।
చూడఁబడనిప్డు నాచేత। చోద్యముగను;
ఇంతకంటె మహాద్భుతం। బేమిగలదు?

కిం హేయం కిముపాదేయం కిమన్యత్కిం విలక్షణమ్,
అఖండానంద పీయూషపూర్ణే బ్రహ్మమహార్ణవే 485

గీ॥ విమలపరిపూర్ణ పరమాత్మ। విద్యగంటి,
సచ్చిదానంద పీయూష।సాగరంబు,
హేయమెయ్యది? గ్రాహ్యంబ।దేమిగలదు?
ఇతరమెయ్యది భేదంబిఁ। కేమిగలదు?

న కిఞ్చిదత్ర పశ్యామి న శృణోమి న వేద్మ్యహమ్,
స్వాత్మనైవ సదానందరూపేణాస్మి విలక్షణః 486

నమో నమస్తే గురవే మహాత్మనే. విముక్తసఙ్గాయ
సదుత్తమాయ,
నిత్యాద్వయానంద రసస్వరూపిణే భూమ్నే సదాఽఽపారద
యామ్బుధామ్నే 487

గీ॥ కాంచనించుకయును వినఁ।గొంచెమేని,
ఆత్మకానందరూపుని। కన్యముగను।
హే మహాత్మ నిస్సంగ న।మామి నిత్య,
అద్వయానందరూప ద।యాసముద్ర॥
ఉత్తమా విశ్వరూపా! గు।రువర! నిత్య
సచ్చిదానంద! యిదె నమ।స్కారకోటి॥

యత్కటాక్షశశి సాంద్రచంద్రికా,పాత ధూత భవ తాపజ శ్రమః
ప్రాప్తవా నహ మఖండవైభవానంద మాత్మపదమక్షయం
క్షణాత్ 488

ఎవని కడకంటజాల్వారు। నిండుసాంద్ర
చంద్రికల ధౌతమగును। సం।సార శ్రమము।
పొందితి నఖండ వైభవా।నందపూర్ణ
బ్రహ్మ పదమక్షయముఁదృటి। వానిదయను॥

ధన్యోఽహం కృతకృత్యోఽహం విముక్తోఽహం భవ గ్రహాత్,
నిత్యానందస్వరూపోఽహం పూర్ణోఽహం తదనుగ్రహాత్ 489

గీ॥ గురువరాను గ్రహంబుచే। గురుతరభవ
గ్రహవిముక్తుండనై కృతా।ర్థతనుబడసి।
ధన్యుఁడనయితి నిత్యమద్వైతరూప
సచ్చిదానందమూర్తిని। శాంతమతిని॥
పూర్ణుఁడను సదా నిర్మలా।త్ముండనైతి॥

అసంగోఽహ మనంగోఽహ మలింగోఽహ మభంగురః,
ప్రశాన్తోఽహ మనన్తోఽహ మమలోఽహం చిరన్తనః 490

అకర్తాఽహ మభోక్తాహ మవికారోఽహ మక్రియః,
శుద్ధబోధస్వరూపోఽహం కేవలోఽహం సదాశివః 491

గీ॥ శాంతుఁడ నభంగురుండ నా।సంగుడ నమ
లాత్ముఁడ ననంగుఁడను నేన। నన్తుఁడనిక।
నాద్యుఁడ నలింగుఁడ చిరన్త।నాఖ్యకుండ
నేనకర్తను భోక్తను। నిష్క్రియుఁడను॥
నిర్వికారుఁడఁగేవల। నిర్మలుండ,
చిన్మయానందుఁడను సదా।శివుఁడనేను॥

ద్రష్టు శ్రోతు ర్వక్తు ర్భోక్తు ర్భిన్న ఏ వాహమ్,
నిత్య నిరన్తర నిష్క్రియ నిస్సీమాసఙ్గ పూర్ణబోధాత్మా 492

గీ॥ ద్రష్టకు శ్రోతకింకఁ గర్తకును భోక్త
కింకవక్తకు భిన్నుండ। నెరుఁగుమయ్య।
నిత్యనిస్సీమనిస్సంగ। నిర్వికల్ప
పూర్ణ బోధాత్ముఁడను సత్యమూర్తి నేను॥

నాహ మిదం నాహ మదో ఉప్యుభయో ర్యదవభాసకం పరం శుద్ధమ్,
బాహ్యా భ్యన్తర శూన్యం పూర్ణం బ్రహ్మాద్వితీయ
మేవాహమ్ 493

గీ॥ ఇది యదియుఁగాను రెంటికి। నిత్తువెల్గు।
పరమశుద్ధుఁడనంతర బాహ్యవిరహి
తాద్వితీయుండఁ బూర్ణుఁడ నప్రమేయ
బ్రహ్మమును నేను నిత్యుఁడ। బావనుండ॥

నిరుపమ మనాది తత్త్వం త్వ మహ మిద మద ఇతి
కల్పనాదూరమ్,
నిత్యానందైకరసం సత్యం బ్రహ్మాద్వితీయ మేవాహమ్ 494

గీ॥ నిరుపమమనాదితత్త్వము। నీవు నేను
నిదియు నదయును గల్పన। మెందులేని।
నిత్యమానందరసమయు। సత్యమేను
అద్వితీయుఁడ బ్రహ్మపరాత్మ నేను॥

నారాయణోఽహం నరకాన్తకోఽహం, పురాన్తకోఽహం
పురుషోఽహ మీశః,
అఖండ బోధోఽహ మశేషసాక్షీ నిరీశ్వరోఽహం నిరహం చ
నిర్మమః 495

సర్వేషు భూతేష్వహమేవ సంస్థితో, జ్ఞానాత్మ
నాంతర్బహిరాశ్రయ స్సన్,
భోక్తా చ భోగ్యం స్వయమేవ సర్వం యద్యత్పృథ గ్దృష్ట
మిదంతయా పురా॥ 496

సీ॥ నారాయణుండ నేను। నరకాంతకుండ నేను,
పురవైరి నీశుండ। బూరుషుండ।
నిరఖండ బోధాత్మ। నిశ్శేషసాక్షిని
నిరహంకృతుండ నింక।నిర్మముండను।
సర్వభూతాంతర। సంస్థితాత్ముండను
బాహ్యాంతరాశ్రిత। బ్రహ్మము నిఁక
నిత్యుండ జ్ఞానిని। నేనిరశుండను
అప్రమేయుండ నేననాదిలయుండ

గీ॥ ఎదివేరుగఁ బూర్వ మం।దిద మటంచు,
నెంచగాఁ బడెనయ్యది। యెల్ల నేన।
ఏనభోక్తను భోగ్యము। నేన నిజము,
నిర్మల జ్ఞాన రూపుండ। నిశ్చలుండను॥

మయ్యఖండ సుఖామ్భోధౌ బహుధా విశ్వవీచయః,
ఉత్పద్యన్తే విలీయన్తే మాయా మారుత విభ్రమాత్ 497

గీ॥ ప్రబలమాయా నిలంపు వి। భ్రమమువలన,
న ద్వయాఖండ సుఖవార్ధి।యైన యాత్మ।
విశ్వ వీచీ సమూహంబు। వివిధములుగఁ
బుట్టుచుండును విలయముఁ। బొందుచుండు॥

స్థూలాది భావా మయి కల్పితా భ్రమా, దారోపితా ను
స్ఫురణైవ లోకైః,
కాలే యథా కల్పక వత్స రాయ, న ర్త్వాదయో నిష్కల
నిర్వికల్పే 498

గీ॥ కాలమునఁ గల్పితంబుఁ। గల్పకములు
నేండ్లు నయనంబులును మరి। ఋతులు నటులె।
స్థౌల్యతాది భావంబులు। జనులచేత
భ్రాంతి నారోపితము లాత్మ।భావమందు॥

ఆరోపితం నాశ్రయ దూషకం భవేత్,
కదాఽపి మూఢై ర్మతిదోష దూషితైః,
నార్ద్రీకరోత్యూషరభూమి భాగం,
మరీచికావారి మహాప్రవాహః 499

బుద్ధి దోషములనుజేసి। మూఢమతికి,
కల్పనము బ్రహ్మము నఁదోచు। ఘన జగంబు,।
సర్వమున కధిష్ఠానమౌ। సత్పదార్థ
దూషకంబుగానేరదు;। దూరమునకు,
తోచు మృగతృష్ణవాహిని। తోయములను
తడుపశక్యమె యూషర। ధరణితలము॥

ఆకాశవ ల్లేప విదూరగోఽహ మాదిత్య వద్భాస్య విలక్షణోఽహమ్,
అహార్యవ న్నిత్యవినిశ్చలోఽహ మమ్భోధివ త్పార
వివర్జితోఽహమ్ 500

ఆకసమువలె నేనెప్డు। డంటఁబడను,
భాస్కరువలె భిన్నుండన। భాస్యములకు।
నిశ్చలుండ నచలమట్లు। నీరధివలెఁ
బారరహితుండ, నవికల్ప। బ్రహ్మమేను॥

న మే దేహేన సమ్బన్ధో, మేఘేనేవ విహాయసః,
అతః కుతో మే తద్ధర్మా జాగ్రత్స్వప్నసుషుప్తయః 501

గీ॥ మేఘమున కాకసమువలె। మేనితోడ,
లేదు బంధమునా కొక। లేశమైన।
స్వప్న జాగృత్సుషుప్తుల।వలనఁ దనువు,
గలుఁగు ధర్మములవి యెట్లు। గలుఁగునాకు॥

ఉపాధి రాయాతి స ఏవ గచ్ఛతి సఏవ కర్మాణి కరోతి భుఙ్క్తే
స ఏవ జీర్యన్మ్రియతే సదాఽహం కులాద్రివ న్నిశ్చల ఏవ
సంస్థితః 502

గీ॥ స్వయముగ నుపాధి దేహంబు। వచ్చుచుండు,
పోవుచుండెడు జీవుండు। పూన్కినంటు।
కర్మములఁ జేసి భుజియించుఁ। గర్మఫలము,
తనువు జీర్ణమై కడకు నం।తమ్ముఁజెందుఁ॥
గాని, కులశైలమట్లు త్రి।కాలములను,
నిశ్చలంబుగ నుండుదు। నిత్యమేను॥

న మే ప్రవృత్తిర్న చ మే నివృత్తి స్సదైక రూపస్య
నిరంశకస్య,
ఏకాత్మకో యో నిబిడో నిరన్తరో వ్యోమేవ పూర్ణ స్స కథం ను
చేతపే 503

గీ॥ లేదిచటఁ బ్రవృత్తి, నివృత్తి। లేదు నాకు,
అద్వితీయైక రూప ని।రంశకునకు।
నిబిడ పరిపూర్ణ నిత్యైక। నిరవకాశు,
న కెటులు గలుఁగుఁ జేష్టలు। నయముగాను॥

పుణ్యాని పాపాని నిరింద్రియస్య, నిశ్చేతసో నిర్వికృతే
నిరాకృతేః,
కుతో మమాఖండ సుఖానుభూతే ర్బ్రూతే హ్యనన్వాగతమిత్యపి
శ్రుతిః 504

గీ॥ అనుపమాఖండ సౌఖ్యర। సానుభూతి,
నిర్వికార నిరాకార। నిశ్చలాత్మ।
నింద్రియ విహీన నిశ్చేత। సేశ్వరుండ,
నాకుసుకృత దుష్కృతములు। సోకునెట్లు॥
అంటరావని పాప పుణ్యములు వెంట,
శ్రుతులు పల్కెడు బ్రహ్మము। సోకవంచు॥

ఛాయ యా స్పృష్ట ముష్ణం వా శీతం వా సుష్ఠు దుష్ఠు వా,
న స్పృశ్యత్యేవ యత్కించిత్పురుషం తద్విలక్షణమ్ 505

గీ॥ నీడనంటరు తమపైన। నీడపడియు,
ఛాయ చేనంటఁబడనట్లు। సత్పురుషుఁడు।
ద్వంద్వములచేత నెన్నఁడుఁ। దాకఁబడడు,
మంచి చెడ్డలు నుష్ణమ్ము। మంచుగాని॥
తాకవెపుడు విలక్షణు। తత్పురుషుని॥

న సాక్షిణం సాక్ష్య ధర్మా స్సంస్పృశన్తి విలక్షణమ్,
అవికార ముదాసీనం గృహధర్మాః ప్రదీపవత్ 506

గీ॥ గృహము జరిగెడి కార్యసంస్మృతియెలేక,
దీప మెట్లుదాసీనత। దీప్తి నొసఁగు।
నిర్వికారత నొప్పుచు। నిత్యుఁడటులె
సాక్ష్యధర్మంబు గల్గడు। సాక్షియయ్యు॥

రవే ర్యథా కర్మణి సాక్షిభావో, వహ్నే ర్యథా దాహనియామకత్వమ్,
రజ్జో ర్యథాఽఽరోపితవస్తు సంగ, స్తథైవ కూటస్థ చిదాత్మనో మే 507

రవి యెటుల నగు సర్వ కార్మములసాక్షి
వహ్ని దహియించు నెట్లు సర్వంబు నింకc।
ద్రాటికేరీతి సంగము। ద్రాచుతోడ
నటులె కూటస్థుcడc జిదాత్మ।నైన నాకు॥

కర్తాఽపి వా కారయితాఽపి నాహం
భోక్తాఽపి వా భోజయితాఽపి నాహమ్,
ద్రష్టాఽపి వా దర్శ యితాఽపి నాహం
సోఽహం స్వయంజ్యోతి రనీదృగాత్మా 508

గీ॥ కాను నిర్దేశకుండను। గ ర్తcగాను,
భోజయితుcడను గానేను। భో క్తcగాను
దర్శకుcడcగాను నేనింక। ద్రష్టcగాను
ఆత్మనే నగోచర పర।మాత్మ నింక॥
నాతతము వెలుంగు స్వయం। జ్యోతి నేను॥

చలత్యుపాధౌ ప్రతిబింబలౌల్య మౌపాధికం మూఢధియో నయన్తి,
స్వబింబభూతం రవిద్ ద్వి నిష్క్రియం, కర్తాఽస్మి, భోక్తాఽస్మి
హతోఽస్మి హేతిఽ . 509

గీ॥ సూర్య ప్రతిబింబము జలమ్ముc। జూచి యలలc
గదల మూఢుcడు సూర్యుcడే। కదలెననును।
ఆత్మ ప్రతిభింబము నుపాధి।యైన తనువు,
నరసి నేనె క ర్తమ భో క్త। హతుcడ ననెడు॥
తనువునకు జేష్టలబ్బంగ। ధర్మ్మ ఁ గుచు
ఆత్మ రవివలె నెల్లప్పు। డక్రియుండు॥

జలే వాఽపి స్థలే వాఽపి లురత్వేష జడాత్మకః,
నాహం విలిప్య తద్ధర్మైః ఘటధర్మై ర్నభో యథా॥ 510

గీ॥ పుడమినేని జలమునేని। పొరలుచున్న,
జడశరీరంపు ధర్మము। స్వాత్మఁ।గొనదు;
గగనమున కంటనట్లుగ। ఘటగుణములు
ఆత్మ దేహంపు ధర్మంబు। లంటవనఘ॥

కర్తృత్వ భోక్తృత్వ ఖలత్వ మత్తతా, జడత్వ బద్ధత్వ
విముక్తతాదయః,
బుద్ధే ర్వికల్పా న తు సన్తి వస్తుతః స్వస్మిన్ పరే బ్రహ్మణి
కేవలేఽద్వయే 511

గీ॥ పుడమిఁ గర్తృత్వ భోక్తృత్వ।ములును మరియు
ఖలతమత్తత బద్ధత। కాపురుషత।
జడత ముక్తత మొదలగు। సకలవృత్తు
లరయ వాస్తవమునఁ బర।మాత్మయైన।
కేవలాద్వయ బ్రహ్మంబు। కేనెలేవు
బుద్ధి కలుఁగు వికారముల్। బుధవరేణ్య

సన్తు వికారాః ప్రకృతే ర్దశధా శతధా సహస్రధా వాఽపి,
కిమ్మేఽసఙ్గ చితేస్తై ర్న ఘనః క్వచిదంబరం స్పృశతి 512

గీ॥ ప్రకృతి జనిత వికారముల్। పదులునూర్లు
కల్గనేనియు వేయైనఁ। గల్గుఁగాక
చెందునేనన్న సంగుని। చిత్స్వరూపు
నంటునే మేఘ మెపుడైన। నంబరమును॥

అవ్యక్తాది స్థూల పర్యన్త మేతత్
విశ్వం యత్రాభాస మాత్రం ప్రతీతమ్।
వ్యోమ ప్రఖ్యం సూక్ష్మమాద్యన్తహీనం
బ్రహ్మాద్వైతం యత్తదేవాహ మస్మి 513

గీ॥ సూక్ష్మ దేహము మొదలుగ। స్థూల ప్రకృతి,
వరకు విశ్వమాభాసగ। నరయఁగబడు।
నాకసమువలె సూక్ష్మయ। నాద్యనన్త
మద్వయంబగు బ్రహ్మము। నాత్మనేను॥

సర్వాధారం సర్వ వస్తు ప్రకాశం, సర్వాకారం సర్వగం
సర్వశూన్యమ్,
నిత్యం శుద్ధం నిశ్చలం నిర్వికల్పం, బ్రహ్మాద్వైతం యత్త
దేవాహ మస్మి 514

గీ॥ నిర్వికల్పంబు శుద్ధంబు। నిశ్చలంబు,
నిత్యమఖిల మనంతమ్ము। నిర్మలంబు।
సర్వవస్తు ప్రకాశంబు। సర్వగమ్ము,
సర్వభావ మాధారము। సర్వశూన్య॥
మద్వయంబగు బ్రహ్మంబు। నాత్మ నేను॥

యత్ప్రత్యస్తాశేషమాయా విశేషం,
ప్రత్యగ్రూపం ప్రత్యయాగమ్యమానమ్,
సత్య జ్ఞానాన న్త మానన్దరూపం
బ్రహ్మాద్వైతం యత్త దేవాహ మస్మి 515

గీ॥ ప్రత్యయాగమ్యమైనట్టి। ప్రత్యగాత్మ
సచ్చిదానందరూపము। సంగరహిత।
మ స్తమాయా విశేషంబ। న స్తమ్మాద్య
మద్వయంబగు బ్రహ్మంబు। నాత్మనేను॥

నిష్క్రియో స్మ్య వికారోఽస్మి నిష్కలోఽస్మి నిరాకృతిః,
నిర్వికల్పోఽస్మి నిత్యోఽస్మి నిరాలంబోఽస్మి నిర్ద్వయః 516

సర్వాత్మకోఽహం సర్వోఽహం సర్వాతీతోఽహ మద్వయః,
కేవలాఖండబోధోఽహ మానందోఽహం నిరన్తరః 517

సీ॥ నిర్వికారుండ నిత్యుండ। నిష్క్రియుండ,
నిష్కలుండ నిరాలంబుండ। నిర్దయుండ।
నిర్వికల్ప నిరాకార। నిర్మలుండ,
సర్వ విశ్వాత్మకుండను। సర్వమేను॥
అద్వయుండ నతీతుండను ని। రంతరుండఁ
గేవలాఖండ బోధస్వ।భావమునిఁక।
సచ్చిదానందరూపుఁడ। స్వాత్మ నేను॥

స్వారాజ్య సామ్రాజ్య విభూతి రేషా
భవత్కృపా శ్రీమహిమ ప్రసాదాత్,
ప్రాప్తా మయా శ్రీ గురవే మహాత్మనే
నమో నమ స్తేఽస్తు పునర్నమోఽస్తు 518

గీ॥ నిరుపమంబగు నీదయ। గురువరేణ్య,
ఆత్మ సామ్రాజ్య పదమునే। నందుకొంటి।
కరములను మోడ్చి నిల్చితి। వరమహాత్మ!
కొనుమ నావందనమ్ముల। గూర్మి మీర॥

మహాస్వప్నే మాయాకృత జనిజరామృత్యుగహనే
భ్రమన్తం క్లిశ్యన్తం బహుళతరతాపై రనుదినమ్;
అహఙ్కార వ్యాఘ్ర వ్యథిత మిమ మత్యన్త కృపయా,
ప్రబోధ్య ప్రస్వాపా త్పర మవితవాన్మామసి గురో! 519

ఆ.వె॥ జననవృద్ధి మరణ। సంయుత మాయా ప్ర
కల్పితమగునట్టి। కలను దినము।
బహుళతాప నికర। బాధి తాహంకార
వ్యాఘ్ర బాధితు నను। బరమదీను॥

ముకుళితకరయుగ్ము। మోహ నిద్రాముగ్ను
మేలుకొలిపినావు। మిగులదయ, ని।
వారణము నొనర్చి, భవభయ బాధల
కాచినావు తండ్రి !। కరుణ నిలయ॥

నమ స్తస్మై సదైక స్మై కస్మై చిన్మహసే నమః,
యదే త ద్వి శ్వరూపేణ రాజతే గురురాజ తే 520

ఆ.వె॥ విశ్వరూపుఁడవయి। వెలుగొందు బ్రహ్మ స్వ
రూప ! గురువరేణ్య ! లోకవంద్య।
వందనంబు సదయ ! వరచిదానందైక !
వందనంబు నీకు। వందనంబు॥

# ప్రణతుండగు శిష్యునికి గురుఁడుపదేశోపసంహారముం దెల్పుట

ఇతి నత మవ లోక్య శిష్యవర్యం, సమధిగతాత్మ త త్త్వ
ప్రబుద్ధ త త్త్వమ్
ప్రముదిత హృదయ స్స దేశికేన్ద్రః; పున రిద మాహ వచః
పరమం మహాత్మా 521

కం॥ ఘనతర బ్రహ్మానందముఁ,
గని వినమితుఁడైన శిష్యు। జ్ఞాన వికాసున్॥
గని పరమ మహాత్ముండును
ఘనమతియగు గురుఁడు బల్కెఁ। గరుణామయుఁడై ॥

బ్రహ్మ ప్రత్యయస న్తతి ర్జగదతో, బ్రహ్మైవ స త్సర్వతః
పశ్యాధ్యాత్మదృశా ప్రశా న్త మనసా, సర్వా స్వవస్థాస్వపి,
రూపాదన్యద వేక్షితం కిమభిత శ్చక్షుష్మతాం దృశ్యతే
తద్వ ద్బ్రహ్మవిదః పతః కిమపరం బుద్ధేర్విహారాస్పదమ్ 522

గీ॥ బ్రహ్మ జనిత జగంబెల్ల। బ్రహ్మమెయగు,
కాంచుమాధ్యాత్మ దృష్టిఁద్రి। కాలములను।
శాంత చిత్త ముతో నవ। స్థాత్రయంబు
నజపర బ్రహ్మ రూపంబు। నన్ని యెడల॥
అట్టి రూపమునకు నెటు।లన్యమిందు
చూచువారికిఁదోచెడు;। శుద్ధమైన।
బ్రహ్మమెుక్కఁడె బుద్ధికి। బ్రహ్మవిదుల
సంతతానందదాయి సా।క్షాత్కరించు॥

కస్తాం పరానందరసానుభూతి
ముత్సృజ్య శూన్యేషు రమేత విద్వాన్,
చన్ద్రే మహాహ్లాదిని దీప్యమానే
చిత్రేన్దు మాలోకయితుం క ఇచ్ఛేత్ 523

గీ॥ స్వయముగఁ బరమానంద రసంబునాని
తత్త్వ విదుఁడెట్లు శూన్యంబుఁ। దారమించు?
పూర్ణచంద్రుని వెన్నెల। పొందువిడచి
ఎవఁడు చంద్రుని చిత్రరూ।నిచ్ఛగించు॥

అసత్పదార్థానుభవే న కిఞ్చ, న్న హ్యస్తి తృప్తి ర్న చ
దుఃఖహానిః,
తద ద్వయానంద రసానుభూత్యా, తృప్త స్సుఖం తిష్ఠ
సదాఽఽత్మ నిష్ఠయా 524

గీ॥ విషయభోగానుభవము ల। వీసమేని,
తృప్తిగల్గదు దుఃఖము। తెగదు, కాన।
అద్వయానంద బ్రహ్మర। సానుభూతి
విరత తృప్తుఁడు సుఖమాత్మ। నిష్ఠనుండు॥

స్వమేవ సర్వథా పశ్యన్మన్యమాన స్స్వ మద్వయమ్,
స్వానన్ద మనుభుఞ్జానః కాలం నయ మహామతే 525

గీ॥ ఆత్మ దర్శించి సర్వథా।ద్వయద్వయైక,
బ్రహ్మరూపుని ధ్యానించి। భావనంబు।
ననుభవించుచు నాత్మ సు।ఖానుభూతి,
ఘనమహామతి ! కాలంబు। గడుపుమయ్య॥

అఖండబోధాత్మని నిర్వికల్పే వికల్పనం వ్యోమ్ని పురః
ప్రకల్పనమ్,
తదద్వయానందమయాత్మనా సదా శాన్తిం పరామేత్య భజస్వ
మౌనమ్ 526

ఆ. వె॥ నిర్వికల్పబోధ। నిత్య స్వరూపముఁ,
గల్పనంబుసేయ, ।గగనమందు।
పురముఁగట్టుటూను। పోలికగా దొకో,
సంశయంబుగలదె। సత్త్వమందు॥
అట్టి పరమ సుఖమ।యాత్మను మౌనంబు,
భజనసేసి శాంతిఁ।బడయుమయ్య॥

తూష్ణీమవస్థా పరమోప శాన్తి, ర్బుద్ధే రసత్కల్ప వికల్ప హేతోః,
బ్రహ్మాత్మనా బ్రహ్మవిదో మహాత్మనో, యత్రాద్వయానంద
సుఖం నిరన్తరమ్ 527

గీ॥ విషయ విముఖత వాసనా। విరహితతయు,
నిలన సత్కల్ప సంశయ। హేతువైన।
బుద్ధిపరమోపశాంతిని। బొందుసెందు,
నట్టి బ్రహ్మ స్వరూపంబు। ననవరతముఁ॥
బరఁగుచుండి మహాత్ముఁడౌ। బ్రహ్మ విదుఁడు
అద్వయానంద సౌఖ్య ని।రంతరుఁడగు॥

నాస్తి నిర్వాసనా న్మౌనా త్పరం సుఖకృ దుత్తమమ్,
విజ్ఞా తాత్మ స్వరూపస్య స్వానంద రసపాయినః 528

గీ॥ అద్వయానంద రసలోలుఁ।డై నయట్టి,
ఆత్మ విజ్ఞానరూపున। కమలునికిని।
మౌనమునకును వాసనా। హీనతకును
ఉండదన్యంబు సుఖకరం। బుత్తమంబు॥

గచ్ఛం స్తిష్ఠ న్నుపవిశంశ్ఛయానో వాఽన్యథాఽపి వా,
యథేచ్ఛయా వసే ద్విద్వా నాత్మా రామ స్సదా మునిః 529

గీ॥ కూరుచుండియు నిల్చుండి। కునుకుచుండి।
తిరుఁగుచుండియు నితరత్ర। పరఁగుచుండి
ఆత్మరతుఁడయి మౌనియై। యాత్మవిదుఁడు॥
చిన్మయానందరూపుఁడై। స్వేచ్ఛనుండు

న దేశకాలాసన దిగ్యమాది లక్ష్యాద్యపేక్షా ప్రతిబద్ధ వృత్తేః,
సంసిద్ధ తత్త్వస్య మహాత్మనోఽస్తి స్వవేదనే కా నియమాద్యవస్థా 530

గీ॥ సిద్ధ తత్త్వజ్ఞునికిఁ బ్రతి।బద్ధ వృత్తి,
దేశకాలాసన నియమ। దిగ్యమాది।
లక్ష్య నికరంబునందు న।పేక్ష లేదు,
వివిధ నియమాద్యవస్థల। యవసరంబు॥
విజ్ఞునికి నెట్లు గల్గు న।విజ్ఞ విధము
ఎటుల నజ్ఞునకుండు న।పేక్ష ధరణి॥

ఘటోఽయమితి విజ్ఞాతుం నియమః కో న్వపేక్ష్యతే,
వినా ప్రమాణ సుష్ఠుత్వం యస్మి న్సతి పదార్థధీః 531

గీ॥ ప్రబలమగు ప్రమాణంబుల। పనియె లేక,
యెరుఁగఁబడెడు బదార్థము। లెరుకయున్న।
కుండ యిది యని తెలిసియుఁ। గోరునెవఁడు
కొంటెగాక ప్రమాణముల్। కువలయమున॥

అయమాత్మా నిత్య సిద్ధః ప్రమాణే సతి భాసతే,
న దేశం నాపి వా కాలం న శుద్ధిం వాప్యపేక్షతే 532

గీ॥ నిత్య సిద్ధము పరమాత్మ। నిగమశాస్త్ర
విహిత ప్రామాణికంబయి। వెలుఁగుచుండె।
తెలియుటకు బ్రహ్మతత్త్వము। దేశకాల
శుద్ధ్య శుద్ధులపనిలేదు। సుంతయైన॥

దేవదత్తోఽయ మిత్యేత ద్విజ్ఞానం నిరపేక్షకం,
తద్వద్బ్రహ్మవిదోఽ ప్యస్య బ్రహ్మాఽహ మితి వేదనమ్ 533

గీ॥ దేవ దత్తుఁడి తండంచుఁ। దెలిసినంత
లేదు పని ప్రమాణములతో। లేశమైన।
బ్రహ్మమేనని తెలియంగఁ। బ్రహ్మవిదుఁడు,
కోరడెట్టి ప్రమాణముల్। కువలయమున॥

భానునేవ జగత్సర్వం భాసతే యస్య తేజసా,
అనాత్మక మసత్తుచ్ఛం కింను తస్యావ భాసకమ్ 534

గీ॥ జగము రవి తేజమున వెల్గు। చందమున న
నాత్మకమసత్తు తుచ్ఛంబు।నైన యిహము।
భాసమానము పేయంగ। బ్రహ్మమునకు
నన్యముండునె యందేని। యరయ శిష్య॥

వేద శాస్త్ర పురాణాని భూతాని సకలాన్యపి,
యేనార్థ వన్తి తం కింను విజ్ఞాతారం ప్రకాశయేత్ 535

గీ॥ వేదశాస్త్ర పురాణము। ల్వివిధ భూత
చయము దెవ్వని వలననో। సార్థకంబు।
అట్టి విజ్ఞాన రూపుఁడౌ। నాత్మ నిహము
వెలుఁగఁజేయు న దన్యంబు। గలదె తెలియ

ఏష స్వయంజ్యోతి రన న్తశ క్తి రాత్మాఽప్రమే య స్సకలాను
భూతిః,
యమేవ విజ్ఞాయ విము క్త బంధో జయత్యయం బ్రహ్మ విదు త్త
మో త్తమః 536

గీ॥ అప్రమేయ స్వయం జ్యోతి। యద్వయుండు
ఆత్మ సర్వాను భూతి య। నంతశ క్తి।
బంధన విము క్తుడై వర। బ్రహ్మముఁగని,
యొప్పు నాతఁడు బ్రహ్మవి।దు త్తముండు॥

న ఖిద్య తే నో విషయైః ప్రమోద తే న సజ్జతే నాపి విరజ్యతే చ,
స్వస్మిన్స దా క్రీడతి నన్దతి స్వయం నిర న్తరానందరసేన
తృ ప్తః 537

గీ॥ విషయములఁల ఖేదమోదము।ల్విదుఁడు గొనడు
స క్తుఁడునుగాడు కొతు వి।ర క్తుఁడతఁడు।
సంతతానంద తృ ప్తుఁడు। స్వస్వరూప
మందుఁ గ్రీడించు రమియించు। నాత్మతోడ॥

క్షుధాం దేహ వ్యథాం త్య క్త్వా బాలః క్రీడతి వస్తుని,
తథై వ విద్వాన్ రమతే నిర్మమో నిరహం సుఖీ 538

గీ॥ మనసు బాలుని కాటని। మగ్న మైన
ఆకలియు బాధలనుకొన। కాడుకొనెడు।
అటులె త త్త్వజ్ఞు డేనునా। దనక యెపుడు
సుఖముసుండు మది బ్రహ్మ। శోభిలంగ॥

చింతాశూన్య మదైన్య భైక్ష మశనం పానం సరిద్వారిషు
స్వాతన్త్ర్యేణ నిరంకుశా స్థితి ర భీ ర్నిద్రా శ్మశానే వనే,
వస్త్రం క్షాళన శోషణాది రహితం దిగ్వాఽస్తు శయ్యా మహీ
సంచారో నిగమాన్త వీథిషు విదాం క్రీడాపరే బ్రహ్మణి 539

ఉ॥ దీనతలేక భిక్షగొని। తెచ్చిన యన్నము నేటి నీటితో,
బోనము సేసి చింతవిడి। పూన్కి నిరంకుశుఁడై స్వతంత్రతన్।
తాను జరించు వస్త్రముల। ధౌతమ శోషితమైన సైచుచున్,
మాని భయమ్ము నెల్లపుడు। మౌనిగ నిద్దురకాడు బీడులన్।
తాను దిగంబరుండునయి। తల్పముఁజేసి ధరాతలంబునిం,
కాను గవిజ్ఞుఁడుండు నిగ।మాన్త విహారము బ్రహ్మక్రీడలన్॥

విమాన మాలమ్బ్య శరీరమేత ద్భునక్త్య శేషా న్విషయా
నుపస్థితాన్,
పరేచ్ఛయా బాలవదాత్మవేత్తా యోఽవ్యక్తలింగోఽ ననుషక్త
బాహ్యః 540

గీ॥ అర్భకుని భంగిఁ బరకాంక్ష। నాత్మవిదుఁడు
సకల విషయానుభోగము। సల్పుచుండు।
సంగరహితుఁడు నవ్యక్త। లింగుఁడగుచు
దేహమను విమానము నెక్కి। తీరుబడిగ॥

దిగంబరో వాఽపి చ సాంబరో వా త్వగంబరో వాఽపి చిదంబరస్థః,
ఉన్మత్త వద్వాఽపి చ బాలవాద్వా పిశాచవద్వాఽపి చరత్య
వన్యామ్ 541

గీ॥ ఆత్మరూపము వెల్గు చి।దంబరుండు,
సాంబరుఁడొ దిగంబరుఁడొ చ।ర్మాంబరుండొ।
సంచరించెడు నున్మత్తు। చందముననొ
బాలునటులొ పిశాచమ్ము। పగిదిగానొ॥

కామాన్నిష్కామరూప సంశ్చరత్యేకచరో మునిః,
స్వాత్మనైవ సదా తుష్టః స్వయం సర్వాత్మనా స్థితః॥ 542

గీ॥ వాంఛలను వీడి నిష్కామ। భావమునను
ఏకతమ్మునఁ జరియించు। నిలనుమౌని।
సర్వదా స్వ స్వరూపము। సంతసమున
సర్వ భూతాంత రాత్ముఁడై। సంచరించు॥

క్వచిన్మూఢో విద్వాన్ క్వచిదపి మహారాజ విభవః
క్వచిద్భ్రాంత స్సౌమ్యః క్వచిదజగరాచారకలితః,
క్వ చిత్పాత్రీభూతః క్వచిదవమతః క్వా వ్య విదితః
చరత్యేవం ప్రాజ్ఞః సతత పరమానంద సుఖతః 543

మ॥ ఒకచో మూఢుఁడు పండితుండిఁకొకచో। నుర్వీశ్వరుండొక్కచో
నొకచో భ్రాంతుఁడు సౌమ్యుఁడింకొకటఁ దానుండున్
భుజంగంబటుల్।
ఒకచో బాత్రుఁడు నొక్కచో నవమతుం డొక్కొక్కచోఁ గ్రొత్తగన్
సకలం కాత్ముఁడు సంచరించు పరమానందంబు సౌఖ్యంబుగన్॥

నిర్ధనోఽపి సదా తుష్టోఽప్య సహాయో మహాబలః,
నిత్య తృప్తోఽ ప్యభు ఞ్జానోఽ ప్య సమ స్సమ దర్శనః 544

గీ॥ నిర్ధనుఁడయి సంతుసుండు। నిస్సహాయుఁ
డయ్యు బలవంతుఁడు మఱియుః నద్వయుండు।
అసముఁడయ్యును సమదృష్టి। యాత్మవేత్త
నిరశనుండయ్యు నొప్పెడు। నిత్య తృప్తి॥

అపి కుర్వన్న కుర్వాణ శ్చాభోక్తా ఫలభోగ్యపి,
శరీర్యపి శరీర్యేష పరిచ్ఛిన్నోఽపి సర్వగః 545

ఆ.వె॥ కర్మము లొనరిచియుఁ గర్తృత్వ మొందడు;
భోగియయ్యును ఫలభోక్తగాడు।
దేహధారియయ్యు। దేహ విహీనుఁడు
భిన్నుడయ్యు నిజముభిన్నుఁడాత్మ॥

అశరీరం సదా సన్తమిమం బ్రహ్మ విదం క్వచిత్,
ప్రియా ప్రియే న స్పృశత స్తథైవ చ శుభాఽశుభే 546

గీ॥ నిత్య విజ్ఞాన రూపుఁడు। నిశ్శరీరుఁ
డాత్మ విదుఁడప్రమేయ నిరంతరుండు।
ఎంచనస్పృశ్యుఁడప్రియ। ప్రియములకిల
నొకవా విధంబున-శుభా। శుభములతని॥

స్థూలాది సమ్బన్ధవతోఽభిమానిన స్సుఖం చ దుఃఖం చ
శుభాశుభే చ,
విధ్వస్త బన్ధ స్య సదాత్మనో మునేః కుత శ్శుభం వాప్య శుభం
ఫలం వా 547

గీ॥ సుఖము దుఃఖంబు శుభమున। శుభములిలను
కలుఁగు దేహాభిమానికిం। గాని, యరయు।
బంధ శూన్యుండు సద్రూప। భాసుఁడైన
మునికినిల శుభాశుభ ఫలమ్ములు గలుఁగునె॥

తమసా గ్రస్తవద్భానాదగ్రస్తోఽపి రవి ర్జనైః,
గ్రస్త ఇత్యుచ్యతే భ్రాన్త్యా హ్య జ్ఞాత్వా వస్తు లక్షణమ్ 548

తద్వ ద్దేహాది బన్ధే భ్యో విముక్తం బ్రహ్మ విత్తమమ్,
పశ్యన్తి దేహవన్మూఢాః శరీరాభాస దర్శనాత్ 549

గీ॥ గ్రహము రవి ద్రిమింగె నందురు। భ్రాంతివలన
వాస్తవ జ్ఞాన హీనులై। వసుధ జనులు।
గ్రహము కమలాప్తు ద్రిమింగుట। కల్లయయ్యు;
బ్రహ్మవిదుఁడైన దేహాది। బంధ ముక్తు॥
దేహవంతుడై ధరలోనఁ। దిరుగఁజూచి
మందబుద్ధులు సామాన్య। మానవునిగఁ॥
దలఁచెదరు మహాత్ము లటంచుఁ। దెలియలేక॥

అహిర్నిర్ల్వయనీం వాఽయం ముక్త్వా దేహస్తతిష్ఠతి,
ఇతస్తత శ్చాల్యమానం యత్కించి త్ప్రాణవాయునా 550

గీ॥ పాము కుబుసమ్ముఁ గ్రమముగ। వదలునటుల,
కొంచెముగఁ ప్రాణవాయువుఁ। గొంచుఁదనదు।
ఇంచుక వణంకు దేహము। నిందెవిడచి
ఆత్మరూపము విలసిల్లు। నాత్మవిదుఁడు॥

స్రోతసా నీయతే దారు యథా నిమ్నోన్నత స్థలమ్,
దైవేన నీయతే దేహో తథా కాలోపభుక్తిషు 551

గీ॥ వెల్లువంబడిచను మిట్ట। పల్లములకు
కలప; యారీతి దేహంబు। కాలగతిని।
దైవికంబుగఁదనకిందు। దాపురించు
పూర్వ కర్మఫలంబును। బొందుచుండు॥

ప్రారబ్ధకర్మ పరికల్పిత వాసనాభి,
స్సంసారి వ చ్చరతి భుక్తిషు ముక్తదేహః,
సిద్ధ స్స్వయం వసతి సాక్షివద త్ర తూష్ణీం,
చక్రస్య మూల మివ కల్పవికల్పశూన్యః 552

గీ॥ వసుధఁ బ్రారబ్ధకల్పిత। వాసనలను
తిరుఁగు సంసారివలె ముక్త।దేహిపూర్వ।
కర్మఫల భోగియగుచును। గాలగతిని
సాక్షిశైవడి సిద్ధుఁడు। స్వాత్మయందు॥
చక్రమూలంబురీతి ని।స్సంశయముగ
కల్పనలులేక యుండును।గడు విరక్తి॥

నైవేంద్రియాణి విషయేషు నియుజ్క్త ఏష,
నైవాపయుజ్క్త ఉపదర్శన లక్షణస్థః,
నైవ క్రియాఫలమపీషదవేక్షతే స,
సానన్దసాన్ద్రరసపాన సుమత్తచిత్తః 553

గీ॥ సర్వసాక్షిత్వలక్షణ। సంయుతుండు,
విషయములయందు నింద్రియ। వృత్తిలేక।
విడువకుండియు నింద్రియ। విహరణంబు,
సచ్చిదానంద రసమత్త। సరసచిత్తుఁ॥
డించుకయుఁ గర్మఫలము।గణించకుండు॥

లక్ష్యాలక్ష్యగతిం త్యక్త్వా యస్తిష్ఠే త్కేవలాత్మనా,
శివ ఏవ స్వయం సాక్షా దయం బ్రహ్మవిదుత్తమః 554

గీ॥ ఆత్మ విడిచి లక్ష్యాలక్ష్య।మైన గతిని
ఎవఁడు కేవలమాత్మలో। నిరవుకొనెడు।
శివుఁడు సాక్షాత్తు స్వయముగఁ। జిన్మయుండు,
తత్త్వవిదులందు నుత్తమో।త్తముఁడు ఘనుఁడు॥

జీవన్నేవ సదా ముక్తః కృతార్థో బ్రహ్మవిత్తమః,
ఉపాధినాశా ద్బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి నిర్ద్వయమ్ 555

గీ॥ అవని జీవించుచును ముక్తుఁ।డై చరించు
నిర్వికల్పు కృతార్థుఁడు। నిత్యబ్రహ్మ।
విదుఁడుపాధినాశంబున। విమలమైన,
అద్వయుండగు బ్రహ్మ తా।పొత్కుఁడగును॥

శైలూషో వేషసద్భావాభావ యోశ్చ యథా పుమాత్,
తథైవ బ్రహ్మ విచ్ఛ్రేష్ఠ స్సదా బ్రహ్మైవ నా పరః 556

గీ॥ వేషమునసైన లేకున్న। వెలయునటుఁడు
పురుషుఁడై తాను సర్వదా। పుడమినటులె।
బ్రహ్మ విచ్ఛ్రేష్ఠుఁడెపుడైన। బ్రహ్మమునకు
వరుఁడుగా దాత్మ నిరతుఁడు। బ్రహ్మమయుఁడు॥

యత్ర క్వాపి విశీర్ణం సత్పర్ణమివ తరోః వపుః ప తతాత్,
బ్రహ్మీభూతస్య యతేః ప్రాగేవ తచ్చిదగ్నినా దగ్ధమ్ 557

గీ॥ పడుట కదనయి యున్నట్టి। పండుటాకు
తరువు విడిపడు నెందైన। ధరణి కటులె,।
పతనమగు నెందునైనను। బ్రహ్మవిదుని
తనువు, పూర్వమె జ్ఞానాగ్ని। దగ్ధమగుట॥

సదాత్మని బ్రహ్మణి తిష్ఠతో మునేః
పూర్ణద్వయానంద మయాత్మనా సదా,
న దేశ కాలాద్యుచిత ప్రతీక్షా
త్వ జ్మాంసవిత్పిండ విసర్జనాయ॥ 558

గీ॥ సత్త్వరూపుఁడు బ్రహ్మంబు। సంతతంబు
అద్వయానందపరిపూర్ణుఁ।డైన యాత్మ।
నుండుమని మాంస త్వ జ్మల ।పిండమైన
తనువిడువు నుచితకాల। తల ప్రతీక॥
తడయునే యెన్నడైనను। ధరణిలోన॥

దేహస్య మోక్షో వో మోక్షః న దండస్య కమండలోః,
అవిద్యా హృదయ గ్రన్థిమోక్షో మోక్షో యత స్తతః 559

గీ॥ మోక్షమరయంగ నీ దేహ। ము క్తి గాదు,
ము క్తి దండ కమండల।మ్ములకుఁ గాదు।
మోక్షమగు నెవ్వ హృదయస్థ। మోహ గ్రంధి
కపుడె నిజముగ మోక్షణ।మగు నరునకు॥

కుల్యాయా మధ నద్యాం వా శివక్షేత్రేఽపి చత్వరే,
పర్ణం పతతి చే త్తేన తరోః కిన్ను శుభాశుభమ్ 560

గీ॥ కాలువనుగాని నదిఁగాని। కడుపవిత్ర
శైవ దేవాలయముఁగాని జీర్ణపర్ణ।
మవని రాలెడు, సాధ్యమే। యవనిజమున
కిల శుభాశుభమ్ములఁ బలి।కించి చూడ॥

పత్రస్య పుష్పస్య ఫలస్య నాశవ ద్దే హేన్ద్రియ ప్రాణ ధియాం
వినాశః,
నైవాత్మనః, స్వస్య స దాత్మ కస్యానందకృతే ర్వృక్షవ
ద స్తి చై షః। 561

గీ॥ పత్ర పుష్ప ఫలంబులు। వాడునటుల
నింద్రియ ప్రాణ బుద్ధులు। నింకఁ దనువు।
నాశమొందుట తథ్యము। నాశరహిత
మాత్మ యానందరూపుఁడు। స్వాంతరాత్మ।
వాడుఁ బుష్పాదులు తరులు। వాడ వటుల
ఆత్మ నిత్యం బనిత్యమ।న్యంబు శిష్య॥

ప్రజ్ఞాన ఘన ఇత్యాత్మ లక్షణం సత్య సూచకమ్,
అనూద్యో పాధికస్యైవః కథయ న్తి వినాశనమ్ 562

గీ॥ సత్య సూచకముగను బ్రజ్ఞానఘనము
అను సదాత్మక లక్షణ। మమవదించి।
పల్కె నాశంబు దేహాద్యు।పాధులకును
ప్రస్ఫుటంబుగ వేదముల్। పండితాఢ్య॥

అవినాశీ వా అరేఽ యమాత్మేతి శ్రుతి రాత్మనః,
ప్రబ్రవీ త్యవినాశిత్వం వినశ్యత్సు వికారిషు 563

గీ॥ జగతి వికారంబులన్ని యు।సత్తు గాన
బ్రహ్మమును నిర్వికారుని। పరమపురుషు।
నరెరె। యవినాశితం బని। యాత్మ శ్రుతులు
పల్కుచున్నవి పలుమార్లు। ప్రస్ఫుటముగ

పాషాణ, వృక్ష, తృణ, ధాన్య కడంగరాద్యా,
దగ్ధా భవన్తి హి మృదేవ యథా తథైవ,
దేహేంద్రియాణి మన ఆది సమస్త దృశ్యం,
జ్ఞానాగ్ని దగ్ధ ముపయాతి పరాత్మ భావమ్ 564

గీ॥ తరులు తృణము పాషాణముల్। ధాన్యమాది,
వివిధమగు వస్తువులు ఘన।విశ్వమందు।
దగ్ధమై మట్టి యగునట్లు। తనువు నింద్రి
యములు మనసు మొదలగు దృ।శ్యము లవెల్ల॥
జ్ఞానవహ్నిని దగ్ధమై। కడకు నిత్య
బ్రహ్మరూపంబు నొందెడుఁ। బండితాఢ్య॥

విలక్షణం యథా ధ్వాన్తం లీయతే భాను తేజసి,
తథైవ సకలం దృశ్యం బ్రహ్మణి ప్రవిలీయతే 565

గీ॥ అంధకారంబు తొలఁగున ట్లరుణకాంతి,
సకలదృశ్య విలక్షణ సత్త్వశాంతి
సద్వయానంద బ్రహ్మమౌ స్వాత్మయందు,
జగతి సర్వంబు లీనమౌ సాధుచరిత॥

ఘటే నష్టే యథా వ్యోమ వ్యోమైవ భవతి స్ఫుటమ్,
తథై వోపాధి విలయే బ్రహ్మైవ బ్రహ్మ విత్స్వయమ్ 566

గీ॥ ఘటము పగులఁగ గగనముఁ గలియునట్టి
ఘటగగనమట్లు జీవుండు కాయమను ను
పాధి నాశనమైనంత బ్రహ్మమందు
నైక్యమై బ్రహ్మ సారూప్యమందున నన ఘ

క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే జలం జలే,
సంయుక్త మేకతాం యాతి తథాఽఽత్మ న్యాత్మవిన్మునిః 567

గీ॥ పాలు పాలను దైలము దైలమందు
జలము జలమున మిళితమౌ చందమునను
ఆత్మవిదుఁడగు వరముని యాత్మయందు
నైక్యమై బ్రహ్మసారూప్యమందు నన ఘ

ఏవం విదేహకైవల్యం సన్మాత్ర త్వ మఖండితమ్,
బ్రహ్మ భావం ప్రపద్యైష యతి ర్నావర్తతే పునః 568

గీ॥ యతి విదేహ కైవల్యంబు నద్వితీయ,
బ్రహ్మభావము సన్మాత్ర పరమపదము
ఆత్మ భజియించి సారూప్య మందినంత,
మరల జన్మము నొందడు ధరణి నన ఘ॥

సదాత్మైకత్వ విజ్ఞానదగ్ధా విద్యాదివర్ష్మణః,
అముష్య బ్రహ్మభూతత్వా ద్బ్రహ్మణః కుత ఉద్భవః 569

గీ॥ జీవ బ్రహ్మైక్య జ్ఞానము। చేత నరుఁడు,
దగ్ధమైన యవిద్యాది। తనువుఁగల్గి।
బ్రహ్మరూపంబు భాసిలు, । బ్రహ్మమునకు
నెక్కడిది జన్మ మరయఁగ। నిలను విబుధ!॥

మాయాక్లృప్తౌ బన్ధమోక్షౌ న స్త స్స్వాత్మని వస్తుతః,
యథా రజ్జౌ నిష్క్రియాయాం సర్పాభాస వినిర్గమౌ 570

గీ॥ ధర నచేతనమగు త్రాడుఁ। ద్రాచనియెడు
భ్రాంతి తొలఁగెడు రీతిని। వాస్తవమున।
బ్రహ్మమాయా వికల్పిత। బంధమోక్ష
ములు గలుంగవు యోచించ। బుధవరేణ్య॥

ఆవృతే స్స దసత్త్వాభ్యాం వక్తవ్యే బంధమోక్షణే,
నావృతి బ్రహ్మణః కాచిదన్యాభావాదనావృతమ్,
యద్య స్త్యద్వైతహాని స్స్యాద్వైతం నో సహతే శ్రుతిః 571

గీ॥ ఆవరణమందు సదసత్త్వ। భావములను,
బంధమోక్షమ్ములు నుడువఁ।బడెడుఁగాని।
బ్రహ్మము నిరావరణముగఁ । బ్రజ్వరిల్లు,
బంధమోక్షము లుండ వా।వరణలేమి॥
ఆవరణము బ్రహ్మమున క।న్యముగ నున్న
హాని యద్వైతమునకగు।నట్టి హాని॥
శ్రుతులు సహియించ వెరుఁగుమా। సుజనవినుత॥

బంధం చ మోక్షం చ మృషైవ మూఢా
బుద్ధేర్గుణం వస్తుని కల్పయన్తి,
దృగావృతిం మేఘకృతాం యథా రవౌ,
యతో ఽద్వయాఽసంగచిదేకమక్షరమ్॥ 572

జలజమిత్ర ప్రతాప సంజనిత మేఘ
మాలికాచ్ఛాదిత దినమణి మాడ్కిఁ జూడ
మరగు పరచెడు బ్రహ్మమున్ మాయ శిష్య
అద్వయానందచి ద్రూపుఁడక్షరుఁడగు॥
బ్రహమున వృధ గల్పించె బంధమోక్ష
ములను బుద్ధి గుణంబున మూఢుఁ డనఘ॥

అస్తీతి ప్రత్యయో యశ్చ యశ్చ నాస్తీతి వస్తుని,
బుద్ధే రేవ గుణావేతౌ న తు నిత్యస్య వస్తునః 573

గీ॥ కలదనెడు లేదనెడు నట్టి జ్ఞానమరయ,
బుద్ధి గుణ కల్పనంబుచేఁ బొసఁగుఁగాని
నిత్యుఁడగు బ్రహ్మమందున నిశ్చయముగ,
కలుఁగవిట్టి గుణంబులు కల్పనములు॥

అతస్తౌ మాయయాక్లుప్తౌ బంధమోక్షౌ న చాఽఽత్మని,
నిష్కలే నిష్క్రియే శాంతే నిరవద్యే నిరంజనే,
అద్వితీయే పరే తత్త్వే వ్యోమవత్ కల్పనా కుతః 574

గీ॥ గగన కల్పిత గంధర్వ। నగర మటుల
బంధమోక్షము లనునవి। బ్రహ్మమందు।
కల్గ వవియెల్ల మాయా ప్ర। కల్పితములు
నిష్కలుఁడు నిరవద్యుండు। నిష్క్రియుండు॥
నద్వితీయుఁడు, శాంతని।రంజనుండు,
నాత్మ పరతత్త్వ మగు బ్రహ్మ।మందు గలవె!॥

న నిరోధో న చోత్పత్తి ర్న చ బద్ధో న సాధకః,
న ముముక్షు ర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా 575

గీ॥ లేదు సృష్టి, ని రోధంబు। లేని దింక,
బుద్ధుడును లేడు సాధన।పరుఁడు లేడు।
ముక్తులును లేరు లేరు ము।ముక్షువులును
అనెడి సత్యము ధర పర।మార్థ మనఘ॥

సకల నిగమ చూడా స్వాన్త సిద్ధాన్త రూపం
పరమిద మితి గుహ్యం దర్శితం తే మయాద్య,
అవగత కలిదోషం కామనిర్ముక్త బుద్ధిం,
స్వసుతవ ద స కృ త్త్వాం భావయిత్వా ముముక్షుమ్ 576

గీ॥ పుత్రవాత్సల్యమున నిన్ను।ముక్షువుగను
విగత కలిదోష నిష్కాము। విమలమతిగ।
భావమున నెంచి యొసఁగితిఁ। బరమగూఢ
మఖిల వేదాన్త హృదయ సి।ద్ధాంతరూప॥
తత్త్వసారంబు సత్యార్థ ।దర్శకముగ

## శిష్యుఁడు గురుని కడ సెలవుగొనుట, గురుశిష్యులు యథేచ్ఛజనుట

ఇతి శ్రుత్వా గురోర్వాక్యం ప్రశ్రయేణ కృతానతిః,
స తేన సమనుజ్ఞాతః యయౌ నిర్ముక్త బన్ధనః 577

కం॥ అని పల్కిన గురువాక్యము
విని కడు వినయముగ బుధుఁడు। వినమితశిరుఁడై।
కొని సెలవు గురునివలనను
చనె బంధవిముక్తు డగుచు। సద్రూపుండై॥

గురు రేవం సదానంద సింధౌ నిర్మగ్న మానసః।
పావయ న్వసుధాం సర్వాం విచచార నిరంతరమ్ 578

కం॥ గురుఁడు సదానందాబ్ధిని,
స్థిరముగ నిర్మగ్నమైన। చిత్తముతోడన్
ధరను బవిత్రమొనర్చగఁ
జరియించ యథేచ్ఛఁజనియె। సద్రూపుండై॥

## అనుబంధ చతుష్టయము

ఇత్యాచార్య శిష్యస్య సంవాదేనాత్మ లక్షణమ్,
నిరూపితం ముముక్షూణాం సుఖబోధోపపత్తయే 579

కం॥ గురుశిష్యుల సంవాదము,
పరమాత్ముని లక్షణములు। బ్రహ్మజ్ఞానా।
తురులకు నిరూపకము సుఖ
తరముగ విజ్ఞాన ప్రాప్తి। దాయకమునగున్॥

హిత ముపదేశ మాశ్రయంతాం
విహిత నిరస్త సమస్త చిత్తదోషాః,
భవసుఖనిరతాః ప్రశాంతచిత్తాః
శ్రుతిరసికా యతయో ముముక్షవో యే 580

కం॥ గత సకల చిత్త దోషులు,
శ్రుతిరసికులు శాంత చిత్త। శుద్ధాత్ము లిఁకన్
యతులు భవ సౌఖ్య దూరులు
హితమగు బోధనము నాద।రింతురుగాతన్॥

## ఫలశ్రుతి

సంసారాధ్వని తాపభానుకిరణ ప్రోద్భూత దాహవ్యథా
ఖిన్నానాం జలకాంక్షయా మరు భువి శ్రాన్త్యా పరిభ్రామ్యతామ్,
అత్యాసన్న సుధామ్బుధిం సుఖకరం బ్రహ్మాద్వయం దర్శయ
త్యేషా శంకరభారతీ విజయతే నిర్వాణ సంధాయినీ॥ 581

జలమునకు మరుభూమియం।దలమటించు
జనుల నమృతాబ్ధిఁజేరుచు। చంద మొప్ప
సారహీన సంసారాధ్వ। చారణులకు
తాప మార్తాండ జనిత దా।హాపనయము॥
జ్ఞానదాయకమైన శం। కరునివాణి
అద్వయ బ్రహ్మ నిర్వాణ।మందఁజేయు

ఇతి శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యవర్యస్య శ్రీ శంకరాచార్య భగవత్కృతః వివేకచూడామణ్యాఖ్యః మహా ప్రబంధరాజః॥

పరి సమాప్తః॥

ఇది శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యవర్యులగు శ్రీ శంకరాచార్య భగవత్ప్రణీతమగు వివేకచూడామణి యను మహాప్రబధరాజము పరిసమాప్తము.

ఇది సుజన విధేయుఁడు, ఎద్దుల అప్పయ్య పౌత్రుఁడు, మహాలక్ష్మి రామమూర్తులకుఁ బుత్రుఁడునగు కమలాకరసాయిచే నాంధ్రీకృతము.

సమాప్తము.





రచయిత :

## డా॥ వై. కమలాకరసాయి

జననము : క్రీ॥ శ॥ 19–3–1950 నాటి యుగాదిపర్వ దినము

జననీజనకులు : ఎద్దుల రామమూర్తి, మహలక్ష్మమ్మ గారలు.

స్వస్థలము : వేంకటగిరి, నెల్లూరు జిల్లా.

విద్య : వైద్యమున ఎం.బి.బి.ఎస్. పట్టభద్రులు

వృత్తి : వైద్యము.

ఇతర రచనలు : కచదేవయాని యను కావ్య నాటకము.
గజానన సంభవమను ప్రబంధము.
మాతృమూర్తి యశోద యను కావ్యము.
శ్రీకృష్ణ శతకము
శ్రీరామ శతకము
కనకాంబరి స్తోత్రము
జ్ఞాన ప్రసూనాంబికా శతకము.

అనువాదములు : శ్రీమద్భగవద్గీత పద్యకావ్యము.
సాంసన్ ఎగొని స్టైస్ | జాన్ మిల్టన్
కోమస్ |
వీనస్ మరియు ఎడోనిస్ |
లూక్రిసుమానభంగము |
మేక్బెత్, హామ్లెట్, ఒథెల్లో |
మొదలగు కొన్ని సర్ విలియమ్ షేక్స్పియర్
ఆంగ్ల నాటకములు
అపరోక్షానుభూతిః ఆదిశంకరులు.

R. K. PRINTERS - BAPATLA.